ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# భాగవతకథ

## 50వ భాగము

గ్రంథకర్త - శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

అనువాదం - శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

# విషయసూచిక


1. ప్రద్యుమ్నచరిత్ర ... 1
2. ప్రద్యుమ్నాగమనమున ద్వారకలో నానందము 10
3. అష్ట పట్టమహిషుల సంతతి-ప్రద్యుమ్నవివాహము 18
4. అనిరుద్ధ వివాహము - రుక్మి వధ ... 26
5. శ్రీకృష్ణుండు రుక్మిణితో వినోదమాడుట... 38
6. శ్రీకృష్ణునకు రుక్మిణీ ప్రత్యుత్తరము ... 55
7. శ్రీకృష్ణుండు రుక్మిణి నాశ్వాసించుట ... 74
8. శ్రీకృష్ణ సత్యభామా సంవాదము ... 83
9. అనిరుద్ధుండు - ఉష ... 110
10. చిత్రలేఖద్వారా అనిరుద్ధునిఁ దెప్పించుట 125
11. బాణాసురుఁ డనిరుద్ధుని బంధించుట ... 136
12. బాణాసురుని కోటకు హరి హరుల యుద్ధము 145
13. ఉషానిరుద్ధుల చరిత్ర సమాప్తము ... 156
14. నృగోద్ధారము ... 163
15. బ్రహ్మస్వాపహరణ దోషము ... 1[illegible]
16. వ్రజమున బలరాముఁడు ... 19[illegible]
17. వ్రజమున మరల బలదేవుని క్రీడ ... 213
18. పౌండ్రక వాసుదేవుఁడు ... 22[illegible]
19. కాశీరాజు కృత్యయొక్క దుష్పరిణామము 235


---

# భాగవతకథ



# ధర్మజ రాజసూయము



## ప్రద్యుమ్న చరిత్ర

౧౧౧౩

శ్లో॥ ప్రభాష్యైవం దదౌ విద్యాం ప్రద్యుమ్నాయ మహాత్మనే।
మాయావతీ మహామాయాం సర్వమాయావినాశినీమ్॥
స చ శంబరమభ్యేత్య సంయుగాయ సమాహ్వయత్।
అవిషహ్యైస్తమాక్షేపైః క్షిపన్సంజనయన్ కలిమ్॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౫౫అ. ౧౭శ్లో॥

వ. అని పలికి మాయావతి మహానుభావుండైన ప్రద్యుమ్నునికి సర్వశత్రు మాయా వినాశిని యయిన మహామాయా విద్య నుపదేశించె నివ్విధంబున.

మ॥ గురు మాయా రణవేదియై కవచియై కోదండియై బాణియై
హరిజుం డారి నిశాట వైచితివి నాఁడంభోనిధిన్ నన్ను ఘో,
ర రణాంభోనిధివైతు నిన్ను నిదె వేరమ్మాచుఁ జీరెన్ మనో,
హర దివ్యాంబరు నుల్లసద్దనుజ సేనాడంబరున్ శంబరున్॥

—శ్రీమదాంధ్రభాగవతము.

పూర్వజన్మ సంస్కారముదయమైనచో నసంభవ విషయము సంభవమగును పాపపుణ్యముల ప్రవృత్తి పూర్వజన్మసంస్కారవశమునఁ గలుగును. మానవుఁ డెచ్చటికిఁ బోవుచున్న మాయయును నచ్చటికిఁ బోవుచుండును. జీవి యేయోని యందుద్భవించినను వాని సంస్కారము లాతని నంటుకొనియే యుండును. మంచిచెడ్డల సంస్కారములు లేకున్న సంబంధముండదు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! కృష్ణుని జ్యేష్ఠ పత్ని యగు రుక్మిణికిఁ బ్రద్యుమ్నుడు పుట్టెను. శంబరాసురుఁ డాతనిఁ దన శత్రువుగా భావించి, సూతికా గృహమునుండి కొనిపోయి సముద్రములోఁ బాఱవైచెను. అచ్చట నొక పెద్ద చేప వానిని మ్రింగెను. చేఁపలు పట్టువారా చేఁపను శంబరాసురున కొసంగిరి. శంబరాసురుఁడు దానిని వంటవారి కొసంగెను. వారు దాని పొట్టఁ గోయునప్పటికి దానినుండి ప్రద్యుమ్నుఁడు వెలువడెను. ఆ వంటవారు శంబరుని భవనములో నివసించు మాయావతియును నామె కాతని నొసంగిరి. ఆమె పూర్వజన్మమున రతీదేవి. ఆమె ఆతనినిఁ బ్రేమతోఁ బోషించుచుండెను. ఆతఁడు తన పూర్వజన్మపు పతియగు మన్మథుఁడని ఆమెకు నారదుఁడువచ్చి చెప్పెను. అందువలన నామె పతిభావమును మనస్సులోఁ బెట్టుకొనియే ఆతనిఁబోషించుచుండెను. ఈ విధముగ నాతఁడంతఃపుర ములో నుండియే పదునాఱేండ్ల బాలుడయ్యెను.

ఇంత వఱకాతఁడు పిల్లవాఁ డగుటచే నేమియు నెఱుఁగఁడు. ఇప్పుడు యువకుఁడైనాఁడు. స్త్రీల చేష్టలను దెలిసికొనఁ గలఁడు. తన్ను బోషించు దల్లి చేష్టలు బాగుండ లేదని ఆతఁడు గ్రహించెను. ఆమె నన్నుఁ బుత్రునిఁగాఁ జూడక కామభావముతోఁ జూచుచున్నది. అందువలన నాతనికి మిక్కిలి సిగ్గును వేయుచుండెను, ఆశ్చర్యమును గలుగు చుండెను.

ఒక దినమువ నామె అత్యంతానురాగ భరిత హృద యముతో రతికి సంబంధించిన హావభావములను, గటాక్ష ములద్వారా సతృష్ణనయనములతో నతృప్తవలెఁ జూచు చుండుటను గాంచి వాసుదేవనందనుఁ డగు ప్రద్యుమ్నుఁ డామెతో నిట్లనెను :- "అమ్మా! నీ బుద్ధి కొంచెము విప రీతమైనదని గ్రహించుచున్నాను. నీ భావములలోఁ బరివర్త నము కలిగినట్లున్నది. అందువలననే నీవు మాతృభావమును బరిత్యజించి కామినీవలె వ్యవహరించుచున్నావు. ఇట్టి యాచరణము గర్హ్యమైనది, సర్వథా నిందనీయమైనది. నీవు నాతో నిట్టి వ్యవహార మొనరించుట శోభింపదు."

ఇది విని లజ్జించుచు మాయావతి యిట్లనెను :- "ప్రభూ! నేను నీకు తల్లినిగాను. ఈ శంబరుఁడు నీకు తండ్రి కాఁడు. నీవు వాసుదేవ నందనుఁడవు. శ్రీమన్నారాయణుని తనయుఁడవు. భాగ్యవతియగు రుక్మిణీదేవి నిన్నుఁ గన్నది."

ఇది విని అత్యంతాశ్చర్య చకితుఁడై ప్రద్యుమ్నుఁ డిట్లనెను :- "అయితే, నేను ద్వారకనుండి యిచ్చటి కెట్లు వచ్చితిని ? నీవు నన్నెట్లు పోషించితివి ? నీ వెవరు ? నాయీ ప్రశ్న లన్నిటికిని సమాధాన మిమ్ము."

ఇది విని మాయావతి యిట్లనెను:-"నీ జన్మ ద్వారకాపురి యందు పరమ భాగ్యవతి యగు రుక్మిణీదేవి గర్భము నుండి అంతఃపురమునఁ గలిగినది. ఇంకను నీకు బది దినములు నిండకమునుపే పాపియగు నీ శంబరాసురుఁడు నిన్ను హరించి, సముద్రములోఁ బాఱవైచినాఁడు. ఒక మత్స్యము నిన్ను మ్రింగినది. అది దైవ వశమున నిచ్చటికి వచ్చినది. దాని కడుపునుండి నీవు బయట పడితివి."

అంతఁ బ్రద్యుమ్నుఁ డిట్లనెను:-"అయితే, నీవెవరు?" మాయావతి యిట్లనెను :- "స్వామీ ! నేను బూర్వ జన్మమున నీకు భార్యను. నీవు పూర్వజన్మమున మన్మథుఁడవు. నేను రతీదేవిని. నీకొఱకే నిన్నుఁ బ్రతీక్షించుచు నీ శంబరాసురుని గృహమున దినములు గడుపుచున్నాను. ఇప్పుడు నీవు నీకు బ్రబల శత్రువగు శంబరాసురునిఁ జంపివేయుము"

ప్రద్యుమ్నుఁ డిట్లనెను :-"అయితే, నే నీతని నెట్లు చంపెదను ? ద్వంద్వ యుద్ధ మొనర్చెదను."

భయభీతయై మాయాదేవి యిట్లనెను :- "స్వామీ ! ఎన్నడును నట్లు చేయవలదు. ఈ యసురుఁడు మిక్కిలి

దుర్దమ్యుఁడు, దుర్జయుఁడు. యుద్ధమున నెవరును నీతని జయింపఁ జాలరు. గొప్ప మాయావి. ఈతని కనేక మాయలు తెలియును. ఈతఁడు సాధారణ మాయలతో జయింపఁ బడఁడు. ఆ మహామాయలు స్త్రీకడ తక్క నింకెక్కడ నుండవు. ఆ మాయను నీవు నా వద్ద నేర్చుకొనుము. దాని ద్వారా యీతనిఁ జంపవచ్చును. అట్లు గాక యుద్ధమునే చేయునెడల నూరు సంవత్సరములకైనను నీతని జయింపఁ జాలవు. వీనిని జంపి, నన్నుఁ దీసికొని నీవు నీపురమునకు బోవలయును, పుత్రస్నేహాకులయగు నీ తల్లి నీవిరహమునఁ గురరీవలె నిరంతరము విలపించుచున్నది. దూడ చచ్చిన నావెట్లు అంబాయని దుఃఖించునో, అట్లే నీ కొఱకు నీతల్లి దుఃఖించుచున్నది. పోయి ఆమెకు ధైర్యమును జెప్పుము. నాకు ప్రేమ ప్రదానమును గావింపుము. ఇదంతయును నీవీ ప్రబలశత్రువును మాయద్వారా చంపిననాఁడే జరుగఁగలదు.

ప్రద్యుమ్నుఁ డిట్లనెను :–"మంచిది. ఇఁక మహామాయ దీక్షను నాకిమ్ము. నీ యంగీకారమునను, నీ సహాయము చేతను నేనీ యసురునిఁ జంపఁగలుగుదును."

సూతుఁడిట్లనెను :– "మునులారా! ప్రద్యుమ్నుఁ డంగీకరింపఁగా మాయాదేవి సమస్త మాయలను వ్యర్థ మొనర్చు మహామాయ యను విద్యనాతని కొసంగెను. ఇప్పుడింకేమున్నది. ఇప్పుడు ప్రద్యుమ్నుఁడు నిర్భయుఁ డయ్యెను."

శంబరాసురుఁడు నిశ్చింతగా నుండెను. కృష్ణతనయునివలనఁ దనకు మృత్యువు సంభవించుననియు, ఆతనినిఁ దన ప్రయత్నమున నాశనమొనర్చితిననియు నాతనికి విశ్వాశము. ఇప్పుడు తాను మృత్యుంజయుఁడ ననుకొనెను. ఇప్పుడాతనిఁ జంపువాఁడు లేఁడనుకొనెను. కానిమాయావతిచేఁ బెంపఁబడు వాఁడు కృష్ణపుత్రుఁడగు ప్రద్యుమ్నుఁడనియు, నాతనిచే తాను జావఁగలఁడను సంగతి ఆతనికిఁ దెలియదు.

ప్రద్యుమ్నుఁ డతి సుందరుఁడు. ఆతని నెవరు గాంచినను మోహితులయ్యెదరు. శంబరా సురుఁడును నాతనిఁ గాంచి ప్రేమించుచుండెను. ఒక దినమున నాతఁడు శంబరాసురుని సమీపమునకుఁబోయెను. ఆతఁ డాతనికిఁ గోపమును దెప్పించి పోరాడఁదలచెను. కోపమును దెప్పించుట కేమికావలయును. ఎవరి నైన రెండు తిట్లు తిట్టినఁజాలును. లేని పోని నిందలువైచినఁజాలును. మర్మమున గ్రుచ్చుకొను ఒకటిరెండు కఠినవాక్యములను బలికినఁజాలును, ఎంత శాంతుఁడైనను క్రోధమును జెందితీరును. ఇఁకఁ దామ ప్రకృతికల వారివిషయమును గూర్చి చెప్పవలసిన దేమున్నది పోఁగానే ఆతఁడిట్లనెను :- ''ఓరీ! పాపియగు నసురా! కడు నీచుఁడవురా, కామివి, క్రూరుఁడవు, నీవు నా భార్యను నీయింటిలో నేల నుంచికొంటివిరా ?'' ఇది వినఁగా

శంబరాసురునకుఁ గోపమువచ్చెను. ఆతఁడిట్లనెను :-'పోరా, నీచా! సిగ్గులేనివాఁడా! నీతల్లిని పత్నిగాఁ జెప్పుకొనుటకు నీకు సిగ్గగుటలేదా? నే నెవరో నీకు తెలియదటరా? వాగు నట్టి నీనాలుకను గాల్చిన పట్టుకారుతోఁ బీఁకించెదనురా, బ్రతికియుండఁగానే నిన్ను నేలలోఁబాతించి, కుక్కలచేఁ బీఁకించెదనురా. నీ శరీరమునఁ జర్మమును వలిచి కారమును రాయించెదనురా ఓరీ, మూఢా! నీకు నా శక్తి తెలియదురా. నేను రాజరాజేశ్వరుఁడను, అజరామరుఁడను. సమరమున నన్ను దేవతలందఱు గలిసినను జయింపఁ జాలరు.''

ఇది విని క్రోధముతోఁ బ్రద్యుమ్నుఁడిట్లనెను :— ''ఓరీ! బడాయిలు కొట్టెదవేమిరా? వ్యర్థ భాషణము లేల! దేవతల సంగతి నట్లుంచి నాతో యుద్ధము చేయరా? నీ బ్రదుకు బయట పడఁగలదు. నేనే నిన్ను యమసదనమునకు బంపెదను. నేనే నీ బీరముల నణఁతును. నీకు నేను చాలును. నీకు నమ్మకము లేకున్న రమ్ము. నాతోఁ దల పడుము.''

చేతిలో ఖడ్గమును గైకొని యెగిరి శంబారాసురుఁ డిట్లనెను:-''రా, రా, నీ యవజ్ఞతకు ఫలము నొసంగెదను. రమ్ము.''

ప్రద్యుమ్నుఁడును నెగిరి యిట్లనెను:- ''సరే, రమ్ము''

సూతుఁడిట్లనెను:-"మునులారా! వాసుదేవ నందనుఁడగు ప్రద్యుమ్నుఁ డిట్టి కఠోరమును, నసహ్యమునగు వచనములను బలుకగా విని, యా యసురుఁడు తోఁక ద్రొక్కిన త్రాచువలె క్రోధముతో, గ్రుడ్లనెఱ్ఱఁజేయుచుఁ, జేత గదను ధరించి, తన యాసనమునుండి లేచి ప్రద్యుమ్నునితో బోర వచ్చెను. ఇచ్చటఁ బ్రద్యుమ్నుఁడును సావధానముగ నుండెను. వచ్చి, ఆతఁడు తన పండ్లను బటపట కొఱుకుచు, బలము కొలది అనేకసార్లు తన గదను ద్రిప్పుచుఁ బ్రద్యుమ్నునిపై విసరెను. అంత మెఱుగుఁ తీగవలె నెగిరి "వీఁడు చచ్చినాఁడు చచ్చినాఁ"డని అఱచెను.

ప్రద్యుమ్నుఁడు సావధానముగ నుండెను. అగ్నివలె జాజ్వల్యమానముగ నున్న అసురుని గద తన వైపునకు వచ్చుచుండుటను గాంచి, ఆతఁడు తనగదచే వ్యర్థమొనర్చి, ముక్కలు ముక్కలుగ నొనర్చెను. వాని గదను వ్యర్థము కావించి తన గదను అసురుని పైకి విసరెను. ఆ దైత్యుడు మాయావి. మాయాసురున కీతఁడు శిష్యుఁడు. కావునఁ దన ఆసురీఁ మాయా ప్రభావముచే నాతఁ డాకాశమున కెగిరి, అచ్చటి నుండియే ప్రద్యుమ్ని మీఁదకు అస్త్ర శస్త్రములను వర్షింపసాగెను. గొప్పగొప్ప అస్త్రములనుండి గోళములు విసరుచుండెను. ఆ గోళములు క్రింద పడఁగానే పగులఁగానే దానినుండి అనేక అస్త్రశస్త్రములు వెలువడు

చుండెను. వీని మాయను తన శరీర బలపౌరుషములతో జయింప నశక్య మని తెలిసికొని, తనకు మాయావతి నేర్పిన సర్వమాయావిభంజనకరమగు మహామాయను బ్రయోగించెను. ఆ మాయాప్రయోగమును గాంచి శంబరాసురుఁ డత్యంత భయభీతుఁడై యుండెను. ఆతఁడు యక్ష, రాక్షస పిశాచ, సర్ప, గంధర్వ, అసురాదులందఱ మాయలు వానికి దెలియును. వాఁడా మాయలను బ్రయోగింపగా ప్రద్యుమ్నుడు వాని నన్నిటిని హరింపఁ గలిగిన మహామాయను బ్రయోగించెను. మాయావతి నేర్పిన మహామాయ ముందే మాయలును బనిచేయలేదు. అవన్నియును వ్యర్థములైనవి. అప్పు డసురుఁడు గడగడ వణఁక నారంభించెను. అప్పుఁడు ప్రద్యుమ్నుఁ డొక నిశిత ఖడ్గమును గైకొని కిరీటకుండల మండిత మగు శంబరాసురుని శిరమును ధరణి కొరగ ఛేదించెను. ఆతఁడు చావగనే అసురులందఱును హాహాకారము లొనర్చుచుండిరి. దేవతలాకాశము నుండి పుష్పవృష్టిని గురిపించిరి. అత్యంత ప్రసన్నుఁడై ప్రద్యుమ్నుఁడు తనఁ బ్రియ యగు మాయావతి సమీపమునకు వచ్చి యిట్లనెను:–

"ఇఁక బోవుదము పద. ద్వారకా నగరమునకుఁ బోయి తల్లిదండ్రులను దర్శింప వలెను."

ఇదివిని మాయావతి అత్యంతానందమును జెందెను. ఆమె షోడశ శృంగారము లొనర్చుకొని ప్రద్యుమ్నునితోఁ గలిసి ద్వారకకుఁ బోవుట కుద్యుక్తయయ్యెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఈ విధముగఁ బాపియగు శంబరాసురునిఁ జంపి, తన పూర్వజన్మపు పత్నిని వెంటఁబెట్టుకొని ప్రద్యుమ్నుఁ డాకాశమార్గమున ద్వారకా పురమునకు వెడలెను. ద్వారకకు వారు పోయినమీఁదట నెట్టి యానందము కలిగినదో వ్రాయుదుము.

— ౯ —

## ప్రద్యుమ్నాగమనమున ద్వారకలో నానందము.

౧౧౧౪

శ్లో॥ యం వై ముహుః పితృస్వరూప నిజేశ భావా
స్తన్మాతరా యదభజన్ రహరూఢభావాః।
చిత్రం నతత్ఖలు రమాస్పద బింబ బింబే
కామే స్మరేఽక్షి విషయే కిము తాన్య నార్యః॥
—శ్రీభాగ. ౧౦ స్కం. ౫౫ అ. ౪౦ శ్లో॥

క॥ సిరిపెనిమిటి పుత్రకుఁడగు
మరుఁగని హరిఁజూచినట్లు మాతలు వమలోఁ

గరఁగుదురఁట పరకాంతలు
మరుఁగని మోహాంధకార మగ్నులు కారే॥

—శ్రీ మదాంధ్ర భాగవతము.

ఒక్కొక్కప్పుడసంభవమగు నాశయును సంభవ మగుచుండును. ఎవని విషయములో మన మాశను వదలుకొంటిమో, ఎవని విషయమున క్షీణమైన ఆశ యుండునో అట్టివారు హఠాత్తుగా వచ్చినచో, ప్రథమమున విశ్వాస ముండదు. ఎవరైనను విశ్వాసమును కలుఁగ జేసిన నప్పటి ఆనందమును శబ్దములతో వర్ణించుట అసంభవము. సుగమముగా శ్రమ లేకుండ వస్తువు లభించినచో దానివలన నంతగా నానందముండదు. చిరకాల ప్రతీక్షానంతరముసఁ బ్రాప్తించిన వస్తువున నవర్ణనీయమగు సుఖముండును. ఒకానొకరి పుత్రుఁడు పరదేశములకు బోయి మరల వచ్చినాఁడనిన నందులో నేవిధమగు నానందమును విశేషమును లేదు. ఆతని రాకలో నెంతటి విలంబనముండునో, అంత అధికముగ బ్రతీక్షలో నుందురు. అందులో నంతటి ఉత్కంఠ కల్గును. ఎంతటి ఉత్కంఠత కలిగిన నంతటి ఆనందము కలుగును.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! వాసుదేవ నందనుఁడగు బ్రద్యుమ్నుఁడు శంబరాసురునిఁ జంపి, తన పూర్వజన్మపు భార్యయగు మాయావతిని వెంటఁబెట్టుకొని ఆకాశమార్గమున ద్వారకానగరమునకు వచ్చెను. వస్త్రా

భూషణాదులచే నలంకరింపఁబడిన గౌరవర్ణపు భార్యతోఁ గూడ ఆశ్యామవర్ణుఁడగు ప్రద్యుమ్నుఁడు ఆకాశమున నూత్న జలధరముచేఁ జుట్టుకొనఁబడిన మెఱఁగు తీఁగెవలె నుండెను. ఆతఁడాకాశమునుండి సరిగా వచ్చి తన తల్లి యగు రుక్మిణీదేవియొక్క విశాలాంగణమున దిగెను. ఆ సమయమున రుక్మిణీదేవి రాణులందఱితోఁ గలిసి కూర్చుండి యుండెను. శ్రీకృష్ణుఁడు రాజసభకు వెళ్ళియుండెను. అకస్మాత్తుగాఁ బ్రద్యుమ్నుని జూడఁగానే వారందఱును నిర్ఘాంత పడిరి. వారందఱును గబగబ వారి వారి పైఁటలను సవరించు కొనిరి. మేలిముసుఁగులు వైచుకొనిరి. ప్రద్యుమ్నుఁడు నూతన జలధరమువలె సుందరశ్యామవర్ణుఁడై యుండెను. ఆతఁడును భగవానునివలె సన్ననిదియును, మెఱయుచుండు నదియునగు బట్టు పీతాంబరమును ధరించియుండెను. ఆతని భుజములు విశాలములైనవి. ఆతని నేత్రములు వికసిత కమలారుణములుగ విశాలములైయుండెను. ఆతని ముఖము నను సుందరమందహాస మొలుకుచుండెను. ఆతని ఉంగరములు తిరిగిన నవి నీలాలకములు విరియఁబడి వంగి యూగుచుఁ గపోలములను ముద్దుపెట్టుకొనుచున్నట్లుండెను. ఆతని కను బొమలు కుటిలములుగను, ధనుషాకారముగను నుండెను. ఈ లక్షణములన్నిటిని బట్టి అంతఃపురమందలి రాణులంద ఱును ప్రథమమున శ్రీకృష్ణుఁ డనుకొనిరి. అందువలన

సంభ్రమముతోఁ బైటలను సవరించుకొని, ముసుఁగులు సర్దుకొని దాగుచుండిరి. పెద్దకోడండ్రవద్ద చిన్నవారు తమ పతులకు సిగ్గుపడుచుందురు. మాటలాడరు. అందువలన భగవానుని యితర పత్నులటునిటుఁ బారిపోయిరి. రుక్మిణి అందఱకంటెఁ బెద్దది. అందువలన నామె పారిపోలేదు. ఆతఁడు శ్రీకృష్ణుఁడు కాఁడని ఆమె గ్రహించెను. అందువలన నవ్వుచు నిట్లనెను :- "ఓసీ, మీరేమి స్త్రీలు. మీ భర్తను గుర్తింపఁజాలరు. ఈతఁడాయన కాఁడు. ఇంకెవరో పురుషరత్నము." ఇది వినఁగానే రాణులందఱును లజ్జితలై మరలఁ దిరిగి వచ్చిరి. కిశోరావస్థలోనుండి అత్యంత సుందరుఁడగు కుమారుఁడు సుందరియగు స్త్రీతో నిర్భయుఁడైయుండుటను గాంచిరి. అందఱిట్లనుకొనిరి:- "వీనియొక్క వైఖరియు, నడకయు భగవానునికి వలెనే యున్నది, భగవానునకువలె సుందరాకార మీతని కెట్లు వచ్చినది ?"

సూతుఁ డిట్లనెను:-"మునులారా ! రక్తప్రభావము గొప్పది. పరస్పరము రక్తసంబంధముండినచో నసఁగాఁ దల్లిదండ్రులు, సోదర సోదరీలు, పుత్రికా పుత్రులు మొదలగు వారినిఁ గాంచఁగనే హృదయమున స్వతఃప్రేమ యుత్పన్నమగును. అందువలవ రుక్మిణీదేవి ప్రద్యుమ్ననిఁ జూడఁగనే పుత్రస్నేహమున నార్ద్రియయ్యెను. ఆమెకు సూతికా గృహమునుండి హరింపఁబడిన పుత్రుఁడు స్మృతికి

వచ్చెను. ఆమె యిట్లనుకొనెను :- "నాకును నొక పుత్రుఁడు పుట్టినాఁడు. వాని ముఖాకృతియు నిట్లే యుండెడిది. ఎవఁడాతని సూతికాగృహమునుండి హరించినాఁడో తెలియదు. దైవవశమున నాతఁడెచ్చటనైనను జీవించి యుండిన నింత వయస్సువాఁడై యుండవలయును. ఈతఁడెవఁడు ? ఎవరి కుమారుఁడు ? పరమభాగ్యశాలినియగు నే తల్లి గర్భమును బండించినాఁడు ? ఈతని కింతటి చక్కని భార్య యెచ్చట లభించినది ? నాకీవిషయమున నాశ్చర్యము కలుగుచున్నది. ఈతఁడు కృష్ణునివలెనే యున్నాఁడేలకో ? ఈ పోలికలు మోహనకృష్ణుని పోలికలవలెనే ఉన్నవి. ఈతనినడకయు, మాటలును నాతనికి వలెనే యున్నవి. ఆతనివలెనే నవ్వును. ఈతని శరీరసౌష్టవమును శ్యామసుందరునికి వలెనేయున్నది. రంగు, రూపము, స్వభావము, వ్యవహారము, లేచుటయుఁ గూర్చుండుటయును, నడకయును, వైఖరియును వేయేల, సమస్తవిషయములందును ఘనశ్యామునివలె నున్నాడు, ఈతఁడు నేను బోఁగొట్టుకొనిన పుత్రుఁడు కాదుకదా ! ఎచ్చటనైనను బెరిగి పెద్దవాఁడై, నాకన్నుల కానందమును గలిగించుటకు రాలేదుకదా ! అట్లు కాకుండిన నాకీతనిపై సహజ స్వాభావిక వాత్సల్యప్రేమ నేల గలుగును? నా యెడమ కన్ను, ఎడమభుజము నదురుచున్నది. ఈ శుభ శకునము లన్నిటి చేతను నేఁడు నాకత్యంత ప్రియమైన వారిని గలిసి కొనుట సంభవించునని తోఁచుచున్నది.

రుక్మిణీ దేవి యిట్లాలోచించు చుండఁగనే దేవకీ వసుదేవులును వాసుదేవుఁడును నచ్చటికి వచ్చిరి. సర్వజ్ఞుడగు భగవానున కన్నియును దెలియును. అయినను నాతఁడు వచ్చి యేమియునుబలుకలేదు. ఆతడునునాశ్చర్యచకిత దృష్టులతోఁ బ్రద్యుమ్నుని గాంచి యిట్లనెను :—"ఈ పిల్లవాఁ డెవఁడు? ఎక్కడి నుండి వచ్చినాడు?" అందఱును మెదలకుండిరి. భగవానునికి గూడ తెలియకుండిన నీతఁ డెవరో? అందఱును నీ విషయమునే ఆలోచించు చుండిరి. ప్రద్యుమ్నుఁడును మాటలాడక తలను వంచుకొని నిలుచుండెను. ఆ సమయమున వీణను మీటుచు హరి గుణగాన మొనర్చుచు నారదుఁ డచ్చటికి వచ్చెను. నారదుఁని గాంచగనే భగవానుఁ డానందముతో నిట్లనెను :— "నారదా! రమ్ము! రమ్ము!

నారదుఁ డిట్లనెను :— "వచ్చితిని స్వామీ! నేఁడేల పరివారమంతయు నొక్కచోటునకు సమావేశమైనారు? మీరింతగా విస్మయమును జెందుటకు కారణ మేమి?"

భగవానుఁ డిట్లనెను :— "నారదా! ఈ పిల్లవాఁ డెవడో ఒక స్త్రీని దీసికొని యిచ్చటకు వచ్చినాఁడు. ఈతని గాంచియే అందఱును విస్మయమును జెందుచున్నారు. ఈతనిని తన విషయమును గూర్చిఁ చెప్పుమనఁగా నేమియును జెప్పుట లేదు."

ఇదివిని నారదుఁడిట్లనెను:–"స్వామీ! నరనాటకమాడెద రేల? అందఱను మోసగించెద రేల? మీరు వీనిని గుర్తింప లేదా? ఈతఁడు మీ ప్రథమ పుత్రుఁడు ప్రద్యుమ్నుఁడు. శంబరాసుఁ డీతని హరించుకొని పోయినాఁడు. వానిని జంపి తనపూర్వజన్మపు పత్నిని దీసికొని మీచరణ సన్నిధికి వచ్చినాఁడు." ఇట్లు పలికి నారదుఁడు ప్రద్యుమ్నునితో నిట్లనెను:–"ఏమోయి! మీతల్లిదండ్రులకును, పితామహి పితామహులకును, ఇతర తల్లులకును నేల నమస్కరింపవు."

ఇది వినఁగానే ప్రద్యుమ్నుఁడు తన నవవధువుతోఁ గూడి దేవకీవసుదేవులకును, శ్రీకృష్ణబలరాములకును, రుక్మిణికిని, ఇతర తల్లులకును బ్రణామము కావించెను. అందఱును బ్రద్యుమ్నునిఁ గౌఁగిలించుకొని, ఆతని ముద్దాడి, అనేకాశీస్సుల నొసంగెను. చచ్చినవాఁడు బ్రదికివచ్చిన నాతనిబంధువుల కందఱ కెట్టి యానందము లభించునో, అంతకంటె నధిక సుఖము వారికిఁ గలిగెను. ప్రద్యుమ్నుఁడు హరింపఁబడి యిప్పుడు పెద్దవాఁడై సతితో వచ్చినాఁడను సంగతిని బుర వాసులు వినఁగానే అందఱును ద్వారకానగరమున నుత్సవములు చేసికొనిరి. ఆనందమును బ్రకటించుచు నిట్లనిరి :– "ప్రారబ్ధమును గూర్చి యెవరును జెప్పఁజాలరు బాలకుఁడు చచ్చిపోయినాఁడని మనమందఱ మనుకొంటిమి. కాని ఈతడు మరలఁ దిరిగి వచ్చినాఁడు. భగవానునిచే రక్షింపఁబడువాని నెవరు చంపఁగల రనునది యథార్థము."

ఈ విధముగ నగరవాసు లందఱును ప్రద్యుమ్నునిం జూచుటకై వచ్చి, ఆతని రూపమును గాంచి ముగ్ధులగుచుండిరి. ఆతని నెంతగాంచినను వారికి దృప్తి జనించుటలేదు. ఆతఁడు సాక్షాత్తుగాఁ గామదేవుని అవతారము గదా! ఆతనిగాంచి ఆతని తల్లులే మోహపడి రనఁగా నింక నితర స్త్రీల విషయమై చెప్పవలసిన దేమున్నది? ఆతనికి మరల ద్వితీయ జన్మ సంభవించినట్లు ద్వారకావాసు లందఱును నుత్సవము లొనర్చుకొనిరి. రుక్మిణీదేవి తన ప్రియపుత్రుని బొంది పరమ ప్రముదిత యయ్యెను. ఆమెకు బాలచేపు వచ్చెను. ఆమె ప్రద్యుమ్నుని గట్టిగాఁ గౌఁగిలించుకొని, ప్రేమాశ్రువులను గార్చుటచేతను, స్తన్యముచేతను నాతని నభిషేకించుచున్నదా యనునట్లు ఆతనిఁ దడిపెను.

సూతుఁ డిట్లనెను :-"మునులారా! ఇప్పుడు మీకు రుక్మిణియొక్క ప్రథమపుత్రుని కథను జెప్పితిని. ఇంక నిప్పుడు మీరేమి వినఁదలఁచినారు?"

శౌనకుఁడిట్లనెను :-"సూతా! పదునాఱువేల నూర్గుర పత్నుల కొడుకుల పేర్లను నీవు చెప్పకుండినఁ బోనిమ్ము. ఎనిమిదిమంది పట్టపురాణుల పుత్రులలో ముఖ్యులగువారి పేర్లనైనను జెప్పుము."

సూతుఁడిట్లనెను:-"మంచిది, స్వామీ! నేను మీకు అష్టమహిషుల పుత్రుల పేర్లను జెప్పెదను."

---

# అష్ట పట్టమహిషుల సంతతి—ప్రద్యుమ్న వివాహము

౧౧౧౫

శ్లో॥ తాసాం యా దశపుత్రాణాం కృష్ణస్త్రీణాం పురోదితాః ।
అష్టౌ మహిష్యస్తత్పుత్రాన్ప్రద్యుమ్నాదీన్ గృణామి తే॥
—శ్రీభాగ. ౧౦ స్కం. ౬౧ అ. ౬ శ్లో॥

చ॥ అనఘ పదాఱువేల సతులందు జనించిరి వేఱువేఱు సం
దన దశకంబు తత్సుతవితానము గాంచి రనేక సూనుల
న్ననయముగ నిట్లు పిల్లచెఱ గొనిన కైవడిఁ బుత్రపౌత్త్ర వ
ర్ధనమున నొప్పెఁ గృష్ణుఁడు ముదంబునఁ దామరతంపరై
భువిన్॥
—శ్రీమదాంధ్ర భాగవతము.

స్థాన సంకీర్ణత లేకుండి, సుందరసువిస్తృత స్వచ్ఛ సుఖకర భవనముండి, ధనాభావము లేక, జీవనోపయోగకరములగు వస్తువులు ప్రచురముగనుండి, పోషించు చింత లేకుండిన భాగ్యశాలి భవనములలోఁ జాలమంది సుందర సుందర బాలకులు విహరించుచుఁ గ్రీడించుచుండి, ఇటునటుఁ గేకలు వేయుచుఁ దిరుగుచుండిన నది భూతల స్వర్గమే. సుందరమును స్వచ్ఛమునగు వస్త్రములను ధరించి, చిన్నపిల్లలు తమ బాల సులభచంచలతావశమునఁ గ్రీడించుచుండినఁ జూచుటకందముగ నుండును. ఈ ప్రాణి క్రీడాప్రియుఁడు.

ఈతఁడాడుకొనుటకు ఆటవస్తువులు కావలయును. చిన్న చిన్న బాలకులు, బంతులాట, గోలీలాట, బిళ్ళంకోడు మొదలైన నాటల నాడుకొందురు. బాలికలు అచ్చనగండ్లు, బొమ్మల పెండ్లిండ్లాటలాడుకొందురు. వారు పెద్దవారైన తరువాత వారికి పిల్లలే ఆటవస్తువులగుదురు. పిల్లలకుఁ గాటుకను బెట్టి, గోటంచుకలిగి మెఱయుచుండు వస్త్రములను గట్టి తల్లి దండ్రులు మిక్కిలి ఆనందమును జెందెదరు. వారితో నాడుకొనుచుఁ దాము అదృష్టవంతుల మనుకొనుచుందురు. దరిద్రుల యిండ్లలో బహుసంతానము కలుగుట దరిద్రతకు చిహ్నము. కాని సంపన్నులకు బహుసంతతి కలుగుట గొప్ప యదృష్టము. లక్షలకొలఁది పుత్రులు కలవాఁడు సమస్తైశ్వర్య, బల, యశ, శ్రీ, జ్ఞాన, వైరాగ్యములకు స్వామియగును. ఇవి ఆతనికే చెల్లును. విశ్వమునకంతకును నాతఁడు తండ్రి.

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! పదునాఱువేల నూటయెనిమిదిమంది రాణుల పుత్రులనుగూర్చి చెప్పుట వలన నేమియును లాభములేదు. వారికి విశేషప్రసిద్ధియును లేదు. కావున సమయ సంకోచము ననుసరించి నేను కృష్ణ పుత్రుల నందఱను జెప్పుటకసమర్థుఁడను. కథాప్రసంగ మును బూర్తియొనర్చుటకై నేను అష్టమహిషుల పదుగురు పుత్రుల నామములను మీకు జెప్పెదను. ముందుగా విదర్భ నందినియగు రుక్మిణీదేవి పుత్రులనుగూర్చి వినుఁడు.

ప్రద్యుమ్నుఁడామెకు జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడు నగు పుత్రుఁడు. ఇతఁడుగాక చారుదేష్ణ, చారుగుప్త, భద్రచారు, చారుచంద్ర విచారు, చారు మొదలగువారు తొమ్మిదిమంది. ప్రద్యుమ్నునితోఁ బదుగురు. వీరందఱును గొప్ప పరాక్రమ వంతులును, వీర్యశాలురునై యుండిరి. చారుమతి యను నొక కుమార్తె కలదు. ఆమెను కృతవర్మ పుత్రుఁడగు బలి కొసంగిరి. అందువలనఁ కృతవర్మ భగవంతునకు వియ్యంకుఁడు. ఈవిధముగ నందఱకును బదుగురు బదుగురు పుత్రులుదయించిరి. వీరందఱును బలవీర్యములలోఁ దండ్రికి సమానులు.

సత్రాజిత్తు తనయయగు సత్యభామకు భాను, సుభాను, స్వర్భాను, ప్రభాను, భానుమంతుఁడు, చంద్రభాను, బృహద్భాను, అతిభాను, శ్రీభాను, ప్రతిభాను అను పదుగురు పుత్రులుండిరి.

జాంబవంతుని కుమార్తెయగు జాంబవతికి సాంబ, సుమిత్ర, పురుజిత్, శతజిత్, సహస్రజిత్, విజయ, చిత్రకేతు, వసుమాన్, ద్రవిడ, క్రతువను బదుగురు పుత్రులు కలరు. వీరదఱును దండ్రికివలె బలపరాక్రమవంతులును, యుద్ధప్రియులునై యుండిరి. సాంబుడతిసుందరుఁడు. ఆతనిఁ గాంచి స్వర్గమందలి యప్సరసలును మోహితలగుచుందురు. ఈతని మూలముననే యదుకుల సంహారమైనది. ఈతని

అంగ ప్రత్యంగములు స్త్రీలకువలె నాకర్షకములును, గోమలములును నైయుండెను.

నగ్న జిన్మహారాజు కూఁతురగు నాగ్నజిత్తికి వీర, చంద్ర, అశ్వసేన, చిత్రగుప్త, వేగవాన్, వృష, ఆమ, శంకు, వసు, తేజస్వి. కుంతి యనువారలు పదుగురు పుత్రులు. ఇట్లే సూర్యతనయ యగు కాళిందికినిఁ బరమ ప్రసిద్ధులగు బదుగురు పుత్రు లుదయించిరి. వారు శ్రుత, కవి, వృష, వీర, సుబాహు, భద్రకళ, శాంతి, దర్శ, పూర్ణ మాస, సోమకులను వారు.

మద్రదేశపు రాజకుమార్తెయగు మాద్రి లక్ష్మణకును ప్రఘోష. గాత్రవాన్, సింహ, బల, ప్రబల, ఊర్ధ్వగ, మహాశక్తి, సహ, ఓజ, అపరాజితులను బదుగురు పుత్రు లుదయించిరి. వీరందఱును మహావీర్యవంతులు.

అష్టమ పత్నియగు భద్రకును సంగ్రామజిత్, బృహత్సేన, శూర, ప్రహరణ, జయ, సుభద్ర, వామ, ఆయు, సత్యకులగువారు పుత్రులుగ నుదయించిరి. ఈ అష్టమహిషలకు గాక మిగిలిన రోహిణిప్రముఖ పదునారువేల నూర్గురకును నొక్కొక్కరకు పదుగురు పుత్రు లుదయించిరి. వారిలో దీప్తిమంతుఁడు, తామ్రతప్తుఁడనువారు రోహిణీ పుత్రు లతి ప్రసిద్ధులు.

శౌనకుఁ డిట్లడిగెను :- సూతా! నీవు భగవానుని పుత్రులను గొందఱను జెప్పితివి. వీరందఱకును వివాహము లెచ్చట నైనవి?''

నవ్వి సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! క్షత్రియకుమారులకును వివాహచింత యుండదు. సంతోషముతోఁ గన్య నీయకుండినఁ గొట్టి తెచ్చుకొందురు. ఆరోజులలోఁ దన్నుఁ బ్రేమించుదానిని రాక్షసవిధిచే హరించి తెచ్చుట వీరత్వముగ నెంచెడువారు పెద్దవారెట్లు చేసెదరో పిల్లలును నట్లే చేయుదురు. తండ్రి కన్యకలుండిన బలవంతమున హరించుకొని తెచ్చి వివాహమాడెను. వీరందఱును నట్లే స్వయంవరమునఁ గన్యకలను హరించి తెచ్చుకొనిరి. వీరందఱును గులీనులు, సుందరులు, బలవంతులు, ధనుర్వేద విశారదులు. వీరికి కన్యకలు దొఱకకపోవుట యనునది యుండదు.

శౌనకుఁ డిట్లనెను:- ''సూతా! భగవానుని ప్రథమ పుత్రుఁడగు ప్రద్యుమ్నుని వివాహము మాయావతి తోడ నేనా, ఇంక నెవరితోడనైన నైనదా?''

సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! మాయావతి పూర్వజన్మపుభార్య. ప్రద్యుమ్నుని వివాహము తన మేనమామయగు రుక్మియొక్క కూఁతురగు రుక్మవతితో నయ్యెను.''

ఇది విని యులికిపడి శౌనకుఁ డిట్లనెను:- ''సూతా! రుక్మి భగవానుని ద్వేషించునే; ఆతఁడు తన కుమార్తెను ప్రద్యుమ్నున కెట్లొసఁగెను?''

సూతుఁ డిట్లనెను:- "స్వామీ! మీకీ గృహస్థుల విషయము తెలియదు. ఏ రేఁబదిసార్లు పోరాడుదురు, మరల నేఁబదిసార్లు ఒక్కటిగ నయ్యెదరు. సంబంధులతోఁ బోరాడినను వారు సంబంధులే కదా! రుక్మి మనస్సు శుద్ధమైనది కాదు. రుక్మిణీ హరణసమయమున నాతఁ డిట్లు ప్రతిజ్ఞ నొనర్చెను. "నేను కృష్ణుని జయించి రుక్మిణిని విడిపింపనంతవఱకు కుండిన నగరమునఁ బ్రవేశింపను." భగవానుని జయించుట అట్లుంచి ఆతనికిఁ బ్రాణములు దక్కుట కష్టమయ్యెను. అందువలన లజ్జచే నాతఁడు కుండిన నగరమునకుఁ బోలేదు తాను వేఱుగా భోజకటమను నగరమును నిర్మించుకొని నివసించుచుండెను. ఆతనికి కుండిన నగరమునకుఁ బోవలయునను బుద్ధి కలిగినపుడెల్ల ఆతనికి దన యవమానము జ్ఞాపకమునకు వచ్చెడిది. అందువలన నాతఁడు తన పూర్వవైరమును మఱవలేదు. రుక్మిణి అన్నమీఁదఁ గల ప్రీతిచే భోజకటమునకు వచ్చుచుఁ బోవుచుండెడిది. తన సోదరుఁడగు రుక్మి కుమార్తె రుక్మవతి పెద్దది కాఁగానే ఆమె రుక్మితో నిట్లనెను:- "అన్నా! ఈమెను మా ప్రద్యుమ్నున కీయవలయును." యాదవులతోఁ గ్రొత్త సంబంధమును బెట్టుకొనుట రుక్మికి ఇష్టములేదు. కాని రుక్మిణిని గాదనలేకుండెను. అందువలన నాతఁ డిట్లనెను:- "అమ్మా! నేను నాకూఁతురికి స్వయంవర మొనర్ప నిశ్చయించితిని. స్వయంవరమున నామె

యెవరిని వరించిన నామెను నాతనికిచ్చి పెండ్లి చేసెదను. ఇది యింటిలోని మాట. రుక్మిణి రుక్మవతి బాగుగా నచ్చఁ జెప్పెను. ప్రద్యుమ్నుఁ డతి సుందరుఁడు. సాక్షాత్తుగ మన్మ థావతారము. అందువలన రుక్మవతి యీ విషయము నంగీక రించెను.

రుక్మి స్వయంవరమునకు జాల యేర్పాట్లు నొన ర్చెను. సమస్తదేశములనుండియును రాజపుత్రులు స్వయం వరమునకు వచ్చిరి. రాజకుమారియగు రుక్మవతి యిదివఱకే నిర్ణయించుకొని యుండుటచే జయమాలను దీసికొని, అచ్చటి రాజకుమారులవైపు చూడనే చూడక సూటిగాఁ బ్రద్యు మ్నుని కడకు బోయి ఆతని కంఠమున వైచెను, అందు వలన రాజులందఱును గుపితులై యిట్లనుకొనిరి:_"రుక్మి తన మేనల్లునకే పిల్లనీయఁదలఁచిచో నీ యేర్పాట్లన్నియు నేల? మనల నందఱను బిలిచి యవమానింప నేల? అందఱమును గలిసి యితనినుండి పిల్లను లాగివేయుదము,"అని అందఱును బ్రద్యుమ్నునిపై యుద్ధ మొనర్ప నుద్యుక్తులైరి. ప్రద్యు మ్నుఁడు మహారథుఁడు. భగవానుని ప్రథమ పుత్రుఁడు. అందు వలన నాతఁ డిసుమంతైనను విచలితుఁడు కాక, ఆ రాజులందఱితో నొంటరిగాఁ బోరాడు చుండెను. చివరకా రాజుల నందఱ నోడించి రుక్మవతినిఁ దీసికొనిపోయెను.

రుక్మి ద్వేషవశమున ద్వారకకు వెడలుటలేదు. సదా సమయమును జూచుకొని శ్రీకృష్ణునిఁ జంపుటకు యత్నించు చున్నను దన సోదరియగు రుక్మిణికి ప్రియ మొనర్చుటకై ఆతఁడు ద్వారకానగరమునకు వచ్చి, తన పుత్రికను దన మేనల్లుఁడగు ప్రద్యుమ్నున కిచ్చి వివాహము గావించెను. మిక్కిలి ఆనందముతోఁ బ్రద్యుమ్నుని వివాహము జరిగెను. ఈ రుక్మవతి గర్భమునఁ బ్రద్యుమ్నుని వలన అనిరుద్ధుఁడను బుత్రుఁడు పుట్టెను. ఆతని వివాహసమయమున బలరాముఁడు రుక్మినిఁ జంపివైచెను.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! భూత, భవిష్య ద్వర్తమాన, అతీంద్రియ, దూరస్థ, వ్యవహితాది విషయ ముల నన్నిటి నెఱిఁగిన యోగిరాజగు మా గురువు శుక దేవుఁడు పరీక్షిన్మహారాజునకే విధముగఁ బ్రద్యుమ్నుని వివాహమును గూర్చి చెప్పినాఁడో నేనును మీకట్లే చెప్పితిని. ఇప్పుడు మీరేమి వినఁదలఁచుచున్నారు?"

శౌనకుఁ డిట్లనెను :- "సూతా! నీవు అనిరుద్ధుని వివాహసమయమున బలరాముఁడు రుక్మినిఁ జంపినాఁడని చెప్పితివి. ఏ కారణమున నట్లు జరిగినది? బలరాముఁడు రుక్మి ప్రాణములు నెట్లు హరించినాఁడు. ఏల హరించినాఁడు? అనిరుద్ధుని వివాహ మెచ్చట జరిగినది. దయతో వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అను నీ చతుర్వ్యూహావ

తారములలోఁ జతుర్థవ్యూహుఁడగు ననిరుద్ధుని వివాహ వృత్తాంతమును గూర్చి చెప్పవలయును.”

సూతుఁ డిట్లనెను :- “మంచిది. స్వామీ! ఇప్పుడు మీకు భగవానుని పౌత్రుఁడును, ప్రద్యుమ్నుని పుత్రుఁడు నగు ననిరుద్ధుని వివాహ వృత్తాంతమును గూర్చి చెప్పెదను. మీరందఱును దత్త చిత్తులరై శ్రవణ మొనర్పుఁడు.

---

## అనిరుద్ధ వివాహము రుక్మి వధ

(౧౧౬)

శ్లో॥ దౌహిత్రాయానిరుద్ధాయ పౌత్రీం రుక్మ్యదదాద్ధరేః ।
రోచనాం బద్ధవైరో౽పి స్వసుః ప్రియచికీర్షయా ।
జానన్నధర్మం తద్యౌనం స్నేహపాశానుబంధనః ॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౬౧అ. ౨౫ శ్లో॥

సీ॥ నావుడు శుకయోగి నరనాయకోత్తమ
నీవు చెప్పిన యట్ల నెమ్మనమునఁ
బద్మాయతాక్షుచేఁ బడిన బన్నమునకుఁ
గనలుచు నుండియు ననుజతోడి
నెయ్యంబునను భాగినేయున కిచ్చెను
గూఁతు నంచిత పుష్ప కోమలాంగి ॥

... ... ... ... ... ...

—శ్రీ మహాంధ్ర భాగవతము.

గొప్పగొప్ప బుద్ధిమంతులగువారు వేఁట, మద్య, మాంసములు, ధర్మవిరుద్ధకార్యములు, జూదము మొదలగున వన్నియును వ్యసనములని తెలిసినను, అవి పతనమునకుఁ గారణమని యెఱిఁగియుఁ బ్రవృత్తులగుదురు. గొప్పగొప్ప ధర్మాత్ములును జూచుచు దూరముగా నుండఁజాలనంతటి ఆకర్షణమిందు గలదు జూదమాడుట మేలు కాదని అందఱకును దెలియును. దానిలో నెప్పటి కప్పుడు విజయాశయుండుటచే సర్వస్వమును గోల్పోయినను మానవుఁడు దానిని విరమింపఁడు. అధికముగ మోసమును గపటమును జేయువారికే సాధారణముగ జూదమున విజయము లభించును. దానికి బరిణామము కలహము, విగ్రహము, ద్వేషము, మృత్యువు. వీనిలో నేదైన సంభవించును. అందువలననే శాస్త్రకారులు మాటిమాటికిని దుర్వ్యసనములలోఁబడరాదని చెప్పుచుందురు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ప్రద్యుమ్నుని కుమారుఁ డనిరుద్ధుఁడు. వీరికి మేనమామల పిల్లలను బెండ్లి చేసికొను సదాచారమేర్పడినది. ఇది అధర్మమే. మేనమామ పిల్లలు పరస్పరము సోదరసోదరీలవలెనే" అగుదురు. కాని ప్రేమవశమున నీ పరంపరాచారము దక్షిణదేశమున నేర్పడినది. మహారాష్ట్ర, సౌరాష్ట్ర, ఘుర్జర, కళింగ, పాండ్య మొదలగు దాక్షిణాత్య దేశములందీ యాచారము నడుచు

చున్నది. అందువలన దేశాచారమునుబట్టి యిది నడుచు చున్నదే కాని యిది అధర్మమే.

రుక్మి లోలోన శ్రీకృష్ణుని ద్వేషించుచుండెను. ఆతఁడు తనపుత్రియగు రుక్మవతీ వివాహమును దన సోదరి రుక్మిమీఁదఁగల ప్రేమతోఁ బ్రద్యుమ్ననకిచ్చి చేసెను. ఇప్పుడాతని పుత్రునకు రోచనయను నొక కుమారిత కలదు. ఇచ్చటఁ బ్రద్యుమ్నుని పుత్రుఁడగు ననిరుద్ధుఁడును వివాహ యోగ్యుఁడయ్యెను. రుక్మిణీ అభిప్రాయము తనయింటి కోడం డ్రందఱును దన వంశములోనివారుగనే ఉండవలయునని కలదు. అందువలన నామె భోజ కటకమునకుఁ బోయి రుక్మితో నిట్లనెను :- "అన్నా! ఇప్పుడు రోచనకు వరుని వెదకుట కెచ్చటికిఁ బోయెదవు? మన పిల్ల మన యింట నుండుటయే మంచిది. మన అనిరుద్ధుఁడు పెద్దవాఁడైనాఁడు. నీవు రోచనను అనిరుద్ధున కిచ్చిన బాగుండునని నాకున్నది.

తన చెల్లెలగు రుక్మిణికి ఆ యభిప్రాయముండిన దానిని నెఱవేర్చుటయే మంచిదని రుక్మి అనుకొనెను. నే నానంద ముతో వివాహమును జేయకుండినచో నీకృష్ణుఁడు, ప్రద్యు మ్నుఁడు, బలరాముఁడు మొదలగు వారందఱును బలవంతు లగుటచే బలవంతముగఁ గొనిపోయెదరు. కావున వీరితో విరోధమును బెట్టుకొనుట మంచిదికాదు.' అని అనుకొని ఆతఁడిట్లనెను :- "మంచిది, నీ కట్టి కోరిక యుండినచో నట్లేకానిమ్ము."

ఇది వినఁగానే రుక్మిణికి మిక్కిలి ఆనందము కలిగెను. ఇంకేమున్నది. ద్వారకానగరమున వివాహ విషయము తెలిసినది. యాదవులిట్లనుకొనిరి:- "విదర్భ దేశమున రెండు వివాహసంబంధములు జరిగినవి. ఒక్కసారికూడా వివాహము నకుఁ దరలి పోలేదు. రెండువివాహములును ద్వారకలోనే జరిగినవి. ఇప్పుడీ మూఁడవ వివాహమునకు జక్కఁగా దరలిపోయి చక్కగా మనుగుడుపు లందుకొందము" అని అనుకొని అందఱును మిక్కిలి యానందమును జెందిరి. అందఱును మంచిమంచి వస్త్రాభూషణములను ధరించి పెండ్లికి పోవుటకు సిద్ధపడిరి. భగవానుని పుత్రులందఱును బెండ్లికి పోయినచో రుక్మి దివాల యెత్తవలసినదే. అందువలన బలరామకృష్ణులును, ప్రద్యుమ్నుఁడును, సాంబుఁడును, ఇంక రెండు మూఁడు వేల మంది ముఖ్యముఖ్య యాదవులును బెండ్లికి తరలిరి. రుక్మిణి రెండు వైపులను సంబంధము కలది. అందువలన నామె భోజకటకమునకుఁ బోవలసి వచ్చెను. అందువలనఁ బౌత్రుని వివాహమునకామెయును బోయెను.

విదర్భపురవాసులు యాదవులకు నత్యధిక స్వాగత సత్కారము లొనర్చిరి. చాల వైభవముగ వైదికవిధిచే రోచనా వివాహము అనిరుద్ధునితో జరిగెను. వివాహమైన తరువాతకూడ చాలదినములవఱకు పెండ్లివారుండిరి. వివాహములో వరుసవాయులు, నవ్వులు, పరియాచకములు,

వినోదములు, ఆటలుండును. కన్యాపక్షమువారు వరపక్షము వారిని నీచపరచుట కేదియో చేయుచుందురు. తాంబూలమున రంగుగలిపి యిచ్చుచుందురు. దానినిఁ దినిన నోరంతయును నీలమైపోవును. తీపి పిండివంటలలో మిరియాలు కలిపెదరు. దానినిఁ దినఁగానే కారము పుట్టగా నందఱును నవ్వెదరు. ఇదే విధముగ నిట్టి కార్యములనే చేయుచుందురు. వివాహము శోభ తెచ్చునదియే యిది.

రుక్మి యిట్లనుకొనెను :- "ఈ బలరామునకు బలవంతుఁడనను నహంకారము కలదు. ఎట్లైన నీతని కించపఱచవలయును. కనాపక్షమునను నాహ్వానింపఁగాఁ జాల మంది రాజులు వచ్చిరి. వారిలోఁ గళింగ దేశపు రాజు మిక్కిలి వినోదప్రియుఁడు. ఆతఁడు రుక్మితో నిట్లనెను:-"బలరామునిఁ గించపరచుటకొక ఉపాయమున్నది. ఆతనికి జూదమాడుట తెలియదు, కాని ఆతనికి జూదమనిన మిక్కిలి వ్యసనము కలదు. మనము ద్యూతక్రీడతోఁ బండితులము. కావున నాతని నుత్సాహపరచి జూదమాడినచో నాతని. గించపరచ వచ్చును."

ఇది అందఱకును రుచించెను. అందఱును బలరామునితో నాడి ఆతని నెట్లైనఁ గించపరచఁ దలంచుచుండిరి. వారి బుద్ధిభ్రష్టమైనది. ఆట నాడఁదలఁచినచోఁ గ్రీడాప్రియుఁడును, గౌతుకుఁడునగు గృష్ణునితో నాడవలయును.

సర్పముతో నాటలేమిటి? అది యెప్పుడు కుపితమై కాటు వేయునో తెలియదు. కాని వినాశకాలమున విపరీతబుద్ధి పుట్టుచుండును. రాజు ప్రోత్సాహము చేయఁగా రుక్మి మిక్కిలి ఆదరముతో బలరామునిఁ బిలిచి యిట్లనెను:-"బలదేవా! నీవు జూదమాడుటలోఁ జాల నిపుణుఁడవని వినియుంటిని".

బలరాముఁడిట్లనెను:-"నైపుణ్య మేమున్నదిలే. ఏదో మనో వినోదముకొఱకు అప్పుడప్పు డాడుచుందుము."

రుక్మి యిట్లనెను:-"మనకుఁ జేతులు కలిసినవి కావున వివాహమందు ద్యూతక్రీడ నొనర్చెదము."

బలరాముఁడిట్లనెను:-"మంచిది. కానిందు కొంచెము సేపు మనోరంజనము." అని పలికి అతఁడు ద్యూతమాడ నుద్యుక్తుఁడయ్యెను. ఆటసామగ్రిని దెచ్చిరి. పాచికలు వేయుచుండిరి. రుక్మివైపున ధూర్తరాజులగు కళింగాధిపతి మొదలైనవారుండిరి. బలరాముఁ డొక్కడే. రుక్మి యిట్లడి గెను:- "బావా! నీవు పందెమును దేని నొడ్డెదవు?"

బలరాముఁ డిట్లనెను :- "సరే, ముందుగా నేను నూఱు సువర్ణముద్రల నొడ్డుచున్నాను."

ఇది విని రుక్మియును నూఱు సువర్ణముద్రలనొడ్డి పాచి కలను వైచెను. అతఁడు వెంటనే నూఱు సువర్ణముద్రలను గెలిచికొనెను. జూదములోఁ బోనుపోను ఉత్సాహము ప్రబలు చుండును. ఇరు పక్షములవారును దమ సర్వస్వమును నొడ్డు

టకు సిద్ధపడెదరు. నూఱు గెలువఁగనే బలరాముఁడు సహ స్రము నొడ్డెను. సహస్రమును గెలువఁగనే దశసహస్రము నొడ్డెను. అవన్నియును బోయెను. బలరాముఁడేది పందె మునఁ బెట్టిన నదిపోవుచునే యుండెను. అప్పుడందఱును గలిసి పకపక నవ్వుచుండిరి. కళింగరాజునకు బలరామునకుఁ గోపమును దెప్పించుటలో నానందము కలదు. రుక్మి గెలు వఁగనే ఆతఁడు పకపకనవ్వి యిట్లనెను:- "బలదేవా! ఇంకను బందెమును బెట్టుము, ఇంకను బెట్టుము."

ఆతని నవ్వులను, వ్యంగ్యవచనములను వినఁగానే లోనఁ గోపము వచ్చెను గాని యేమియును మాటలాడ లేదు. రుక్మి పదివేల సువర్ణముద్రలను గెల్చుకొనఁగానే, ఆతఁడిట్లనెను - "ఇప్పుడు నేను లక్షముద్రలను పందెమిడుచున్నాను". అని ఆతఁడు పాచికలను విసరెను. ఈసారి బలరాముఁడు గెలుచుకొనెను. కాని వారందఱును ధూర్తులు. వారంద ఱును గలిసి 'రుక్మి జయించెను, రుక్మి జయించెను' అని అఱచిరి.

ఇప్పుడు బలరాముఁడు తన క్రోధము నాపుకొనఁ జాలకపోయెను. స్వాభావికముగ నాతని నేత్రము లరుణ వర్ణము కలవి. ఈ కారణమున నవి యింకను నరుణము లయ్యెను. పూర్ణిమనాఁడు సముద్రముప్పొంగి నట్లాతఁడు తన్నుఁదాను సంబాళించుకొనఁజాలక పదికోట్ల ముద్రలను నాతఁడు పణముగ నొడ్డెను. ఈ సారియును బలరాముఁడే

గెలిచెను. కాని రుక్మికపటము నాశ్రయించి యిట్లనెను :- ''ఈసారియును నేనే జయింతిని.''

బలరాముఁడు క్రోధముతో నిట్లనెను :-''ఇప్పుడు మీరధర్మము నాశ్రయించినారు. నాకు జయము కలుగగా మీదే జయమనుచున్నారు.''

వ్యంగ్య స్వరమున రుక్మి యిట్లనెను :-''చేఁజిక్కిన నక్క గ్రామమువైపునకుఁ బరువిడునట్లు, ధర్మమునకుఁ గార్యము నెఱవేరకుండిన నధర్మము నాశ్రయించెదరు. జయము నాకు గలుగఁగా మీదనుచున్నారు. మీరీ కళింగరాజును, అన్య రాజుల నడుగుఁడు జయమెవరిదో? మీ మాటలు సరైనవి కావు. వీరు మధ్యస్థులు, నిర్ణాయకులు. వీరేది నిర్ణయించిన దాని నంగీకరించెదము.'' అంత నాదూర్తులందఱు నిట్లనిరి:- ''రుక్మియే జయించెను! నిజము రుక్మియే జయించెను.''

ఇంతలో నాకాశవాణి యిట్లనెను :-''ధర్మపూర్వకముగ విజయము బలరామునిదే. రుక్మిమాట అబద్ధము.'' కాని ఆకాశవాణి సమయమున నందఱును నుచ్చస్వరమున నిట్లరిచిరి :- ''కాదు, కాదు, రుక్మికే జయము కలిగినది. రుక్మియే పందెమును గెలిసినాఁడు.''

రుక్మియును హాస మొనర్ప నారంభించెను. ఆకాశవాణి నుపేక్షించి రాజులందఱును బ్రోత్సహింపఁగా నాతఁడును నామాటమీఁదనే యుండెను. ఆతఁడు బలరామునిఁ బరిహా

సింప నారంభించెను. ఆతని నీచముగఁ జూడ నారంభించెను. ఎగతాళిలో మానవుఁడెవఁడును సహింపఁ జాలనంతటి వ్యంగ్య వచనములను బలుక నారంభించెను. ఆతఁడు బలరామునకు గోపమును దెప్పించుచు నిట్లనెను :-"ఎవరి పనిని వారు చేయఁగలరు. కుక్క-పనిని గాడిదయేమి చేయఁగలదు ? చాకలి చాకలిపనినే చేయఁగలఁడు. చదరంగమాడుటయును, శరసంధాన మొనర్చుటయును, యుద్ధమొనర్చుటయు నేమి తెలియును. ఇవి క్షత్రియుని కార్యములు. మీరు చిరకాలము వనములలో నావులను మేపుకొంటిరి. మీకు యుద్ధమును, జూదమాడుటయు నేమి తెలియును. అరక దున్నుకొనుటయును, దొంగతనము చేయుటయును మీకు బాగుగాఁ దెలియును, మీరీ రాజులతో వ్యర్థముగఁ జదరంగమాడ నుద్యుక్తులైతిరి."

రుక్మియొక్క బల్లెపు పోటులవంటి యీవాక్యములను విని మిగిలిన రాజులందఱును బకపక నవ్వనారంభించిరి. ఇంకొకఁ డిట్లనెను :-"అందులకే యీతఁడు భుజముపై హలమును ధరించినాఁడు. అరకను దున్నుటయును, వ్యవసాయ మొనర్చుటయును వైశ్యులకార్యము. అట్టి వీరు పాచికలాడ వచ్చిరి. తూర్పుగాడిద పడమర అంకెవేసిన నేమి లాభము ?"

అందఱును నెగతాళి చేయఁగా బలరాముని క్రోధము మితిమీఱిపోయెను. అచ్చట నొక పరిఘ పడియుండెను. ఇఁక వెనుక ముందు చూడక ఆ పరిఘను దీసికొని రుక్మి తలమీఁద నొక్కబాదును బాదెను టెంకాయ పగిలినట్లు రుక్మితల బ్రద్దలుగఁ బగిలెను. ఆతఁడా మాంగలిక సభ సభయందు బలిపశువువలెఁ బడిపోయెను. గోచనా వివాహమున బెద్దమామ బలియొసంగి నట్లుండెను.

రుక్మినిఁ జంపుటతో బలరామునకు క్రోధము శాంతింప లేదు. ముందుకుఁబోయి ఆతఁడు కళింగరాజును గూడ పట్టుకొనెను. కళింగరాజు గడగడ వణఁక నారంభించెను. బలరాముఁడు పరిఘను బారవైచెను. కాని వాని చెంపపై నొక్క చఱపును జఱచెను. దెబ్బ దెబ్బకు వాని పండ్లన్నియును రాలిపోయెను. అంత మరల పరిఘను దీసికొని ధనాధన్ ధనాధన్నని వానిని బాద నారంభించెను. బలరాముని కోపమును జూడఁగనే సింహమును గాంచి గొఱ్ఱెలు పాఱిపోయినట్లు మిగిలిన రాజులందఱును పాఱిపో నారంభించిరి. ఆ పాఱిపోవుటలోఁ దడబడి. క్రిందఁబడిరి. కొందఱకు ముఖమునకు దెబ్బ తగిలెను. కొందఱకు కాళ్లు విరిగెను. కొందఱకు చేతులు నొచ్చెను. కొందఱకు గ్రుడ్లు చితికెను. కొందఱకు ముక్కుదూలములు విరిగెను. ఇట్లందఱును క్షత విక్షతులై ప్రాణములను జేతఁబట్టుకొని పారిరి.

రుక్మిణియును వచ్చి యేడువ నారంభించెను. కృష్ణుఁడును వచ్చెను. అతఁడు బలరాముఁడు కోపముతో నుండుటను గాంచి ఆశ్చర్యపోవుచుండెను. సమ్ముఖమున రుక్మిణి యేడ్చు చుండెను. కృష్ణుఁడొక్క శబ్దమైన బలరామునితోఁ గాని, రుక్మిణితోఁగాని పలుకలేదు. ఒకవేళ నేదైన మాటలాడిన యెడల ఏమి కలియుగము వచ్చినది. ఎవరైనను భార్యను వెనుకవైచుకొని వచ్చుచుందురు. అన్న అనినైన లేదు. బావమఱఁదులే సమస్తమును. వీని బావమఱఁది నన్ను నానామాటలని నప్పుడూరక చూచుచుఁ బలుకకుండెను. వీనినిఁ జంపఁగనే భార్యను వెనుకవైచుకొని వచ్చినాఁడని అనఁగలఁడని కృష్ణునకుఁ దెలియును. రుక్మిణితో నేమైన ననినచో నామె 'ఈ యాదవులు నిర్దయులు. మా అన్నను జంపి పైఁగా నాకు నీతులు చెప్పుచున్నా'రన వచ్చును. అందువలన మౌనముగ నుండుటయే మంచిదనుకొనెను. బలరాముని క్రోధము శాంతించినచో రుక్మిణిని ద్వారకకు గొని పోయిన తర్వాత నోదార్చ వచ్చుననుకొనెను.

సూతుఁడిట్లనెను:–"మునులారా! ఆనందమంతయును భంగమైనది. వివాహ శుభావసరమున హత్యజరిగినది. కొంచెము సేపటికి బలరాముఁడు శాంతించెను. అతఁడు వెంటనే తనరథముపైఁ గూర్చుండి ద్వారకకుఁ బోయెను.

కృష్ణుఁడును కపటాశ్రువులను రాల్చుచు, రుక్మి కుమారుల నోదార్చి, తన పౌత్రుని వధువును దీసికొని పెండ్లి వారందఱతోడను, యాదవులతోడను భోజకటము నుండి బయలుదేరి ద్వారకాపురికి వచ్చెను. మార్గమందందఱు నిట్లనిరి :-"బలరాముఁడు అవసరమునకు మించిన క్రోధమును జెందినాఁడు. వివాహమందు హత్య జరిగినది."

భగవానుఁ డిట్లనెను :-"బావ మఱఁది చచ్చినాఁడు బాగుగనే యున్నది. మమ్ము ద్వేషించినాఁడు. ఆతఁడు చేసిన దానికి ఫలము ననుభవించినాఁడు."

ఇది విని శౌనకుఁ డిట్లడిగెను :-"సూతా! ఇది రుక్మికి అన్యాయము చేయుట కాదా? ఆతఁడు తన చెల్లెలి నిచ్చినాఁడు. పుత్రిక నిచ్చినాఁడు. పౌత్రినిచ్చినాఁడు. దానికి బదులుగా యాదవులాతని ప్రాణమును దీసినారు. స్వామీ! బలరామునకు జూదమాడుట తెలియకుండిన నాడకుండ వచ్చును. జూదములో నిట్టి తగాదాలు వచ్చుచునేయుండును. దీనికై ఒకానొక రాజును జంపుట యేమంత ఉచితము?"

సూతుఁడిట్లనెను :-"స్వామీ! పెద్దవారి విషయములు పెద్దవిగనేయుండును. వృద్ధుల కృత్యములు విచారణీయములుగనుండవు. పెద్దవారేది చేసిన నదియేయుచితము. చిన్నవారేది చేసిన నది అనుచితము. అయిన దేమో అయినది. భగవానుఁడేది చేసినను మేలునకే చేయును. ఈవిషయమున మీరధికముగ విచారింపకుఁడు."

శౌనకుఁడిట్లనెను :–"మంచిది, సూతా! ఇది చెప్పుమయ్యా! ఎన్నడైన నీ సంఘటనము జరిగిన తరువాత రుక్మిణిని కృష్ణుఁడోదార్చినాఁడా ?"

సూతుఁడిట్లనెను :–"స్వామీ! ఓదార్చుటేమి! ఒక దినమున నవ్వులాటలలో నీ విషయమును జెప్పఁదలఁచెను. రుక్మిణి స్వభావము కొంచెము గంభీరమైనది. ఆమె సత్యభామకు వలె మానిని కాదు. కృష్ణుఁ డామెనొక దినమున సరసములాడెను. అప్పుడు భగవానునకు జాల చిక్కు కలిగెను. చివరికెట్లో ఆమెను బ్రశంసించి ఓదార్చెను. అప్పుడీ సంఘటనమునుగూడ యెత్తెను. ఇప్పుడిఁక మీరు రుక్మిణీ కృష్ణుల సరస వినోద కథనుగూర్చి వినుఁడు."

---

# శ్రీకృష్ణుఁడు రుక్మిణితో వినోదమాడుట

(౧౧౧౭)

శ్లో॥ తాం రుక్మిణీం శ్రియమనన్యగతిం నిరీక్ష్య
యా లీలయా ధృత తనోరను రూప రూపా ।
ప్రీత స్మయన్నళ కుండల నిష్క కంఠ
వక్త్రోల్లస త్స్మిత సుధాం హరిరావభాషే.

—శ్రీ భాగ. ౧౦స్కం. ౬౦అ. ౯వ శ్లో.

మ. పతి యే రూపము దాల్చినం దదను రూపంబైన రూపం
బుతో, సతి దా నుండెడు నట్టి రూపవతి నా చంద్రాస్య
నా లక్ష్మి నా, సుతనున్ రుక్మిణి నా యనన్య మతి నా
శుద్ధాంతరంగం గళా, చతురత్వంబున శౌరి యిట్లనియెఁ
జంచ న్మందహాసంబుతోన్.

— శ్రీమదాంధ్ర భాగవతము.

నీరసమగు నీ గృహస్థాశ్రమమందు సరసతా సంచారమును గామినియే కావింపఁగలదు. ప్రపంచమున నానందోత్పాదక వస్తువులు రెండే. సుందరీ, దరీ (గుహ). ఇంటిలో ననుకూలవతియును, బతివ్రతయగు పత్ని లేకున్న గృహమున నుండుట వ్యర్థము. అట్టి యెడ గుహ నాశ్రయింప వలయును. గృహము మృద్వికారమే. జడమైనదే. కాని దానికిఁ జైతన్యమును భార్య కలిగించును. గృహమున నానాచింత లుత్పన్నమై కటువుగ నొనర్చును. ఆ కటువును దీసివైచి గృహిణియే మధురముగ నొనర్చును. స్త్రీ యెట్టిదైనను బురుషుని గృహమున బంధించును. అట్లు కాకుండినఁ బ్రతికూలాచరణ మొనర్చు పత్నినిఁ బరిత్యజించి పురుషులందఱును బత్నీ విహీన జీవనమును గడిపెదు వారే. పగలంతయు నలసిపోయిన పురుషుఁడు పత్నినిఁ జూచుకొని, ఆమె యాతిథ్యమును గ్రహించి నవజీవనమును బొందును.
జూచుకొని, ఆమె యాతిథ్యమును గ్రహించి నవజీవనమును

బొందును. దినమంతయును జింతా వ్యథితుఁడైనవాఁడు భార్యయొక్క మధుర మందహాసమును గాంచియు, కొన్ని సరసవాక్కులను బలికియు నాత్మ విస్మృతినిఁ జెందును. కొందఱు సురాపాన మొనర్చి, కొంతకాలము తమ చింతలను మఱచుటను బ్రయత్నించెదరు, కాని దానిలో నొక్క దోషము కలదు. అది అచేతనుల నొనర్చి నిశ్చింతుల నొనర్చును. కాని ధర్మపత్ని సచేతనావస్థలోనే పురుషునిఁ జింతారహితు నొనర్చును. పుత్రులఁ గని వంశమును నిలుపును. దినమంతయును బనిచేయుచున్నను నామె సంతోషముతోడనే యుండును. చింతాసమయమునఁ బతియెడల సహానుభూతినిఁ బ్రకటించును. ఇట్టి స్త్రీ యొక్క ముఖము ప్రేమయందును, రోషమందును, దుఃఖమందును, సుఖమందును సమస్తావస్థలలోను స్ఫూర్తి ప్రదానము కావించును.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! అనిరుద్ధుని వివాహము కావించి కృష్ణుఁడు ద్వారకకు వచ్చి సుఖముగఁ దన పదునాఱువేల నూటయెనిమిదిమంది భార్యలతో నానంద విహారము కావించుచుండెను. భగవానునకు జరావ్యాధులు లేవు. నిత్య యౌవనుఁడుగనే యుండును. ఆతని పత్నులకును జరావ్యాధులు లేవు. నిత్య యౌవనులగనే యుందురు. వారి కెవరికినిఁ దలలు నెఱయుటలేదు. శరీరము ముడుతలు పడలేదు. వ్యాధియును లేదు. ఎల్లప్పుడును బదునాఱేండ్ల వారివలె నుందురు.

భగవానుని భార్యలలో సత్యభామ అతి మానిని. ఆమెకుఁ గోపము వచ్చెనా, ఆమెను జాలసేపటివరకు బ్రతిమ లాడ వలసియుండును. కాని రుక్మిణి చాల సరళమైనది. కృష్ణుఁడు చెప్పినదేమో చేయును, ఎప్పుడైనఁ గృష్ణుఁడు పరిహాసవాక్కులను బలికినచో నామె సిగ్గుపడి, నవ్వి యూర కుండును. మరల తిరిగి జవాబీయదు. పరిహాసాదులు రెండు వైపులనుండి వచ్చిననే వినోదముగ నుండును. ఒకరు పలుకఁ గానే యెదుట నున్నవారు మాటలాడకుండినచో నది అంత టితో నాగిపోవును. ఆమె స్వాధీన భర్తృకవలెఁ బ్రగల్భ కాదు. ఆమెకు భగవత్సేవలోనే ఆనందము కలుగును. ఆమెది దాస్యభావము. ఎగతాళి పరిహాసము లామె కిష్ట ముండదు. భగవానునకు ప్రజమండలి అలవాటే నిలిచి పోయెను. అచ్చట గోపిక లాతనిఁ దిట్టుచుందురు. చీవాట్లు పెట్టుచుందురు, కోపపడు చుందురు. అలుగు చుందురు. ఈతఁడు వారిని బ్రతిమలాడును. హాహా హాహా యనును. పాదములు పట్టును. వీపు నిమురును. ఒక్కొక్కప్పుడు చేతులను జోడించుకొని నిలుచుండును. ఇచ్చట ద్వారకలో నీరసమెచ్చటిది? ఇచ్చట నెల్లప్పుడును సేవను జేయించు కొనుటయే.

ప్రేమలో బ్రతిమలాలుటయు, నలుగుటయు, గోప పడుటయు, ముఖము ముడుచుకొనుటయును, హఠమొనర్చు

టయు నవసరము. దీనివలనఁ బ్రేమ సౌందర్యము వృద్ధియగును. దానిలో నవజీవనము కలుగును. మధుర మందహాసమయ ముఖమును గాంచిన నెంతటి అధికానందము కలుగునో, అంతటి యానందము తన ప్రియియొక్క ప్రేమ కోపయుక్తమగు ముఖమును గాంచినఁ గలుగును.

కృష్ణుఁడొక దినమున నిట్లనుకొనెను :- "నేను నిత్యము మందహాసయుక్తమగు రుక్మిణీ ముఖమునే కాంచితిని. కోపముతో నుండిన నీమె ముఖమెంతటి శోభాయుక్తముగ నుండునోకదా! ఈ అనుభవము నా కెన్నడును గలుగలేదు. అదెట్లు కలుగును. రుక్మిణీదేవి యెన్నడైనవ్వులాటలకై నను నాతో గోపింపదు. నే నెప్పుడును గోపమువచ్చు మాటను మాటలాడలేదు. ఒకవేళ మాటలాడినను ఆమె నవ్వి యూరకుండును. ఇఁక నామీఁద నాకేమియును మాటలాడుటకు సాహస ముండెడిదికాదు. ఒక దినమున నీమె బాగుగాఁ గోపము వచ్చునట్లు, హృదయశూలమువలె నుండు మాటలను బలుకవలయును. అప్పుడీమె క్రోధోద్రేకమున నున్నప్పుడు నేను నవ్వెదను." అని ఆలోచించి శ్యామసుందరుఁడు మంచి సమయము కొఱకు నిరీక్షించుచుండెను.

అది వసంతఋతువు. బయట పిండి యారపోసినట్లు వెన్నెల కాయుచుండెను. కొంచెముగ వెచ్చగకూడ ఉండెను. వీవనతో విసరుట ప్రియముగ నుండెను. శ్యామసుందరుఁడు

తన సుఖదశయ్యపై సుఖపూర్వకముగ శయనించియుండెను. ఏనుఁగుదంతములతోఁ జేయఁబడి, పట్టుదారములతో నల్ల బడిన మంచముమీఁద, బూరుగు దూదిపరుపు పరుపఁబడి యుండెను. దానిమీఁద పాలనురుగు వంటిదియుఁ, గొంగ ఱెక్కలవలెఁ దెల్లగా నున్నదియు నగు దుప్పటి పరుపబడి, మెత్తని దిండ్లుకూడ అమర్చఁబడి యుండెను. శ్యామసుంద రుఁడు కుడిచేతిమీఁద, దిండుపై భుజమునుంచి, దాని సహా యమునఁ బరుండియుండెను. ఒకదాసి ఉమ్మివేయు పాత్ర నచ్చట నుంచెను. ఒకర్తుక చందనమును దీసికొనివచ్చెను. ఇంకొకతె తాంబూలమును జుట్టుచుండెను. రుక్మిణీదేవి స్వయముగ నొక విసనకఱ్ఱను దీసికొని వనమాలికి విసురు చుండెను. భగవానుఁడు భక్తులను సంతోషపెట్టుటకును, ధర్మ మర్యాదను స్థాపించుటకును నవతరించును. ఆతని కేమియు నిచ్ఛయుండదు. ఏలననఁగా నాతఁ డాప్తకాముఁడు.

భగవానునియొక్క భవ్యభవనము సమస్త భోగ సామగ్రిలచే సుసజ్జితమై యుండెను. దానిలో సుందర, స్వచ్ఛ, శుభ్ర వితానములు కలవు. వానికి నలువైపులను ముత్యముల జాలరులు వ్రేలాడఁగట్టఁబడి యుండెను. ఆ యింట తైలఘృతాది దీపములు లేవు. కాంతిమయ మణు లతో నది ప్రకాశించు చుండును. దివ్యములగు మల్లికా మాల లచ్చటచ్చట వ్రేలాడఁగట్టఁబడి యుండెను. వాని

గంధలోభమున భ్రమరగణ మెగురుచు గుంజారవ మొన ర్చుచు మాధవునకు మధుమయ సంగీతమును వినిపించుచుం డెను. పూర్ణచంద్రుఁ డుదయించి పురుషోత్తముని దర్శింప వ్యగ్రుఁడై యుండెను. కాని అచ్యుతుఁ డంతఃపురమునఁ దన ప్రియతో హంసతూలికా పాన్పుపైఁ బవళించినాఁడని తెలిసికొనఁగానే ఆతని అధీరత అధికమయ్యెను. ఆతఁడు స్వయముగ నంతఃపురములోనికిఁ బోఁజాలక తన కిరణము లను బంపెను. కిరణప్రసారముచే నా భవనమంతయును బరమ శోభితమయ్యెను. రహస్యముగ గవాక్షములకుండా చంద్రదేవుఁడు చూచుచుండెను. భవనమందలి పాత్రయందు వెలుఁగుచుండిన నగరు ధూపపుపొగ చంద్రుని యీ అశిష్ట వ్యవహారమునకుఁ గుపితయై స్వయముగ గవాక్షరంధ్రముల ద్వారా బయలుదేరి నిశానాథుని నయనముల నింపఁదఁలచు చుండెను. పారిజాతోపవన సుగంధముచే సువాసితమగు వాయువు వనమాలి వస్త్రములతోడను, శ్రీ రుక్మిణీదేవి చీరెతోడను గ్రీడించుచుండెను.

పరమేశ్వరుఁడగు తనపతికిఁ బరిచర్య యొనర్చుచున్న వైదర్భిశోభ అపూర్వముగనుండెను. ఇంతవఱకు ఒక సుందరి యగు సఖి రత్నదండమండితమగు చామరమును గైకొని శ్యామసుందరునకు విసురుచుండెను. ఇప్పుడు స్వయముగ శ్రీ రుక్మిణీదేవియే వీచుచుండెను. చామరమును వీచుటచే

నామె కరమందలి రత్నజటిత కంకణములు మధుర మధుర శబ్దము లొనర్చుచుండెను. కమలదళముల కంటెను నధిక కోమలములగు సన్నని వ్రేళ్ళకు మణిమయాంగుళీయకములు శోభించుచుండెను. వానిలోఁ బొదుగఁబడిన వజ్రములు వీవన వీచునప్పుడు తళతళ మెఱయుచుండెను. కేసరీకస్తూరి చందనలిప్తమై, కంచుకముతో నావృతమగు నామెయొక్క ఉన్నతవక్షస్థలము శ్రమచేఁ గదలుచుఁ గేసరీకస్తూరి చందన కర్పూర సుగంధములను వెదజల్లుచుండెను. మణిమయ నూపుర సుమధుర ధ్వనిచే నామె మదనమోహనుని చిత్తమును దనవైపున కాకర్షించుచుండెను. కుంకుమ పంకిలమై, అరుణవర్ణముగనుండిన నామె కంఠము ముత్యాలహారముచే నావృతమై కొంచెముగఁ గదలుచుండెను. సుందర వస్త్రముచే నావృతమైన గటియందలి యుండిన మహామూల్యమయమగు మొలనూలు కదలికచే గలగల శబ్దమొనర్చుచుండెను. కుటిలాలకములచే నావృతమైన దన ముఖారవిందమును గొంచెముగఁ గ్రిందకు వంచుకొనియుండెను. అచ్యుతుఁడు తదేకదృష్టితో నామెయొక్క అనుపమ లావణ్యాయుక్తమగు ముఖమువైపు చూచుచుండెను. మధ్య మధ్య కనకకుండలకాంతిచే సుశోభితమును, పదక విభూషితమునగు దన కంఠమునెత్తి తన ప్రాణనాథునివైపు చూచుచుండెను. ఒక్కొక్కప్పుడు వారిద్దరి నేత్రములు కలిసి

నప్పుడు తన మధుర మందహాసమయదృష్టిని మరల్చి ఆమె మరల నేలను జూచుచుండెను.

ఈ విధముగ ఛాయవలె భగవానునితోఁగూడియుండు, లక్ష్మీదేవియొక్క అవతారరూపమగు నారుక్మిణీదేవినిఁగాంచి నేఁడు భగవానునకు పరిహాసములాడవలయునను బుద్ధి కలిగెను. అతఁడిట్లనెను :- "ప్రియా! నేను నిన్నొక్కమాట అడిగెదను. అన్యథా తలంపవుకదా?"

అత్యంత ప్రేమతో వీణావినిందిత స్వరమున రుక్మిణీదేవి యిట్లనెను :- "అడుగుఁడు ప్రాణనాథా! అన్యథా తలంచుటకేమున్నది? ఎచ్చటనైన భార్య తన భర్త వాక్యముల నన్యథా తలంచునా యేమి?"

భగవానుఁ డిట్లనెను :- "సరేకాని. నీవు నన్ను వరించుటకు నాలో నేమిగుణమును గాంచితివి?

వాసుదేవుఁడు తన్నుఁ బరిహాసములాడఁ దలచుచున్నాఁడని తెలిసికొని విషయమును ముందునకుఁ బోనీయకుండుటకై ఆమె యేమియును మాటలాడలేదు. ఊరక ముసిముసి నవ్వులు నవ్వి యూరకుండెను. కాని భగవానుఁ డామె కెట్లైనఁ గోపమును దెప్పింప సిద్ధపడియుండెను. అందువలన నిట్లనెను :- "నాకు శంకయేమనఁగా నీకు వివాహము కాదనికాదు. గొప్ప గొప్ప రాజులు నిన్నుఁబెండ్లాడుటకు సిద్ధపడియుండిరి. మాకైశ్వర్యమేమున్నది? గొప్ప గొప్ప

లోకపాలురను మించినవారును, ఉదారత, సుకుమారత, సుందరత, వీరత్యాగులందు జగత్ప్రసిద్ధి కలవారా రాజులు. నీవు చెప్పుటకు సంకోచించుచున్నావు కాని, మీ అన్న, మీ తండ్రియును శక్తిశాలురగు నారాజుల కీయఁదలంచిరి. వారు తరలివచ్చి నిన్నుఁ బాణిగ్రహణ మొనర్చుకొనుటకై నీ నగరమునకును వచ్చియుండిరి. సర్వసమర్థులగు నారాజులను గాదని నన్నేలవరించితివి ? వారు నీకుఁ దగినవారు. నే నేవిధముగఁ జూచినను నీకుఁ దగినవాఁడనుగాను. నీవిట్టి పొరపాటు నేలఁజేసితివి ?''

భగవానుఁడు తనకుఁ గోపముచు దెప్పింపఁదలఁచుచున్నాడనియు. అందులకే వివాహము సంగతినెత్తి తన్నుఁ బరిహాసమొనర్చుచున్నాఁడనియు నామె యేమియును మాటలాడలేదు. భగవానుని శ్రీముఖమువైపుచూచుచుఁ గొంచెముగ లజ్జితయై యుండెను. భగవానుఁడీ దినము నాగఁదలఁపలేదు. ఆమెకడనుండి ప్రత్యుత్తరము నపేక్షింపకయే యిట్లనెను :– ''నీవు నన్నుఁ బతిగా గ్రహించి చాల పొరపాటు చేసితివి. వానిలోఁ గొన్నిఁటినిఁ జెప్పెదను వినుము.

(1)

నీవు రాజకన్యవు. రాజకన్యక రాజపుత్రునే వివాహమాడనలయును. మేము రాజులము కాము. పారుబోతులము రాజులకు భయపడి, మా ప్రాణములను గాపాడు

కొనుటకై వచ్చి సముద్రమధ్యమున నివసించుచుంటిమి. మాకు రాజసింహాసనమునఁ గూర్చుండుట కధికారము లేదు. గొప్ప గొప్ప బలవంతులగు రాజులు మాతో విరోధమును బెట్టుకొనిరి. అందువలన మనకిద్దఱకును జోడు కుదురదు.

(2)

రెండవ విషయ మేమనఁగాఁ బురుషుని పద ప్రతిష్ఠ తన కనురూపముగ నుండవలయును. అత్యంత ప్రేమాను రాగములు కలవాఁడుగ నుండవలయును. స్త్రీలను దన ప్రేమ మయ వ్యవహారముచే, వారి కనుకూలములగు గార్యము లొనర్చి, వారి యధీనమునుండి, వారినిఁ బ్రసన్నుల నొనర్చినచో ఆకులీన పురుషునైనను స్త్రీలు వరించెదరు. మాలో నదియును లేదు. స్త్రీలయెడల నాకంతగా నాసక్తి లేదు. వారికి నాయందు ప్రేమ జనించుట కేమియును నాకర్షణమును లేదు. మేము అస్పృష్ట, అలౌకిక మార్గము ననుసరించువారము. ఇట్టి నీరస, పామర పురుషుల పాలఁ బడిన పత్నులు కేవలము దుఃఖమునే పొందఁగలరు. వారి కెన్నడును కాంతరంగిక ప్రసన్నత యుండనే యుండదు.

(3)

మూఁడవ విషయ మేమనఁగాఁ గులీనుఁడు కాకున్నను, పదప్రతిష్ఠలు లేకున్నను, కామకళా కోవిదుఁడు కాకున్నను నాతఁడు ధనికుఁడగుచో ధనముకొఱకై స్త్రీలు

పురుషునిఁ బ్రేమించెదరు. అద్దైనను గలదా యనిన మావద్ద ధనమును లేదు. నిర్ధనులము, నిరాధారులము. మాకు సహచరులు నిష్కించనులుగను, నిర్ధనులుగను, దీనులుగను నుండెదరు. మేమెట్టివారమో మమ్ముఁ బ్రశంసించువారును నట్టివారే. అకించనులును, నిర్ధనులు నగు నా భక్తులే మాకు బ్రశంసా వారధినిఁ గట్టి మాకింతటి ప్రసిద్ధినిఁ గలిగించినారు. తాము స్వయముగ సమస్తదీనులకును నాథులగుటచే సంపన్నులు మాకడకు వచ్చుటకు భయపడుచుందురు. ధనవంతులు మమ్ముఁ బ్రేమింపరు. మాకు ధనమును లేదు, ధనవంతులతో మైత్రియును లేదు.

(4)

ఇఁక నాల్గవ విషయము. వియ్యమునకు గాని, నెయ్యమునకు గాని కయ్యమునకు గాని సమాన శీలసంపత్తి కల వారలకడనే శోభించును. నీకును నాకును నే విషయములోను సమానత్వము లేదు. నీవు ధనవంతుఁడగు రాజు కూఁతరవు. మేమా యెల్లప్పుడును దిరుగుచుందుము. మా కిల్లువాకిళ్ళు లేవు. మన యిద్దరకులములును సమానములు కావు. నీవు రాజపుత్రివి. మేము భ్రష్టులముగ నామమాత్రపు క్షత్రియులము. నీవైశ్వర్యశాలుని పుత్రికవు. మేమైశ్వర్య విహీనులమై కాలమును గడుపుకొను వ్యక్తులము. నీవు గౌరవర్ణముగ నుందువు. నేను నల్లనివాఁడను. నీవు గంభీర ప్రకృతి

కలదానవు. నేనా చపలుఁడను, జంచలుఁడను. నీవు గుణవతివి నేనునిర్గుణుఁడను. ఈ కారణములనుబట్టి మనకిద్దఱకును జోడు అనురూపముగ లేదు. నీవు యౌవనోద్రేకము వలన నాలోచింపక నన్నుఁ జేసికొని మిక్కిలి యాలోచనము లేని పని నొనర్చితివి. కాని యిప్పటికిని మించిపోయినది లేదు. ప్రొద్దుట మఱచిపోయిన సాయంత్రము జ్ఞాపకమునకు వచ్చిన నది మఱచినట్లు కాదు. ఇప్పటికైనను బొరపాటును సర్దుకొనవచ్చును. త్రుటినిఁ బరిమార్జన మొనర్చుకొనవచ్చును. కావున నిప్పుడు నీవొక పనినిఁ జేయుము. నాకు విడాకుల నొసంగి, మంచివాఁడును, సుందరుఁడును, ప్రభావశాలియు, యువకుఁడు నగు నొక రాజకుమారుని వరించుము. ఐశ్వర్యశాలురగు రాజులకు గొదువలేదు. నీవు సుందరివి. నిన్ను జాల గొప్పరాజులైనను సంతోషమున మిక్కిలి ఆదరముతో స్వీకరించెదరు. నీకిష్టమగుచో నీకు ప్రథమమునఁ బతిగా నిర్ణయింపఁబడిన శిశుపాలుని కడకు బోవచ్చును. ఆతనిలో నేవైన దోషము లున్నవనుకొనిన నాతని కాధారమును నధిపతియునగు జరాసంధు నాశ్రయింపుము. సాల్వుఁడును గొప్ప బలవంతుఁడే. ఆతనితోఁ గ్రొంగ్రొత్త సంబంధము నేర్పఱచుకొనుము. ఆతనికి భార్యవగుము. మా మేనత్త కుమారుఁడు దంతవక్త్రుఁడును గొప్ప బలవంతుఁడే. ఆతనినైనఁ జేపట్టవచ్చును. లేదా నీకిష్టము వచ్చినవాని కడకుఁ

బోవచ్చును. అచ్చటికిఁ బంపు నేర్పాటు నేను గావించె దను.''

''నీవు నన్ను వదలఁదలచినచో నన్ను నా తండ్రి గృహమునుండి, కుండినపురమునుండి యేల దెచ్చితివని నీవడుగవచ్చును. మీరు రాకుండిన నా ముఖమున నెవరికి భార్యను గావలయునని వ్రాసిపెట్టినదో వాని కయ్యెడి దాననే.'' అని నీవందువా దానికొక కారణము కలదు. నేను నిన్నుఁ బ్రేమ వశమునఁ దీసికొని రాలేదు. నేను నా ప్రతిష్ఠ వృద్ధియగుటకై అచ్చటికిఁ బోయితిని. నీయన్న రుక్మి. రుక్మి నన్ను ద్వేషించినాఁడు. మీతండ్రికి నిన్ను నా కిచ్చి వివాహము చేయవలయునని తలంచు చుండెడువాఁడు. కాని రుక్మి ద్వేషవశమున నాతని కభ్యంతరమును బెట్టెను. నన్నవమానించినాఁడు. దానిని నేను సహింపఁజాలక పోయితిని. అందువలన నా వీర్యమదోన్మత్తులగు మహీపతుల మానమర్దన మొనరించుటకై నేను నిన్నచ్చటినుండి హరించుకొనివచ్చితిని. ఏలననఁగా నేను దుష్టుల దర్పమును నాశము చేయువాఁడను. అందువలన నేను సాహస మొనరించితిని. నీ రూపమును గాంచి నేనచ్చటికి వచ్చినానని నీవనుఁకొని యుండవచ్చును. నే నాత్మారాముఁడను. నాలో నేను రమించు వాడను. నాకు దారీ పుత్రుల వలన గావలసిన దేమున్నది ? నాకు చర్మాస్థి మాంసాదులతోఁ జేయ

బడిన మృద్దారు వికారమగు నొక బొమ్మవంటిదే. నేను దాసీనుఁడను. ఒక భవనమున నొక దీపపు వెలుఁగులో నొకఁడు దొంగతనము చేయఁ వచ్చును. ఇంకొకఁడు వధ నొనర్చును. మఱియొకఁడు మద్యపానఁ మొనర్చును. అన్యుఁడు నిందిత కార్యము లొనర్చును. వేఱొకఁడు పుస్తకమును వ్రాయును. ఇంకొకడు పరోపకార మొనర్చును. దీపము మాత్రము వెలుఁగుచు నట్లే యుండును. చెడ్డపనిని జేయువారిని నిందింపదు. మంచిపని జేయు వానిని స్తుతింపదు. అందఱకును సమానభావముగఁ బ్రకాశ మొసంగును. అదే విధముగ నేను దేహగేహములందు దాసీనుఁడనై నిష్క్రియుఁడుగను, కేవలము సాక్షీ మాత్రుఁడనుగ నున్నాను. ఇట్టి నావలన నీ కేమి ప్రయోజనము ? నీవు నీ మాఁట ముల్లెను సర్దుకొనుము. నే నిప్పుడే రథమును సిద్ధమొనర్చెదను.''

సూతుఁ డిట్లనెను :-''మునులారా! ఈ విధముగ పలికి కృష్ణుఁడు మౌనముగ నుండెను. రుక్మిణి అన్ని మాటలకును సహనమును జూపినది కాని, కృష్ణుఁడు మాటిమాటికిని గంభీరుఁడై, నీవు నీయిష్టము వచ్చిన వారితోఁ బోవచ్చును. ఇంకొకని నెననినైన బతిగా నేర్పఱకొనుము'' అని పలుకు నప్పటికి ఆమెకు మిక్కిలి సంక్షోభము కలిగెను. భయముచేతను, ఆ శంక చేతను ఆమె హృదయము కొట్టు

కొన నారంభించెను. నేత్రముల నుండి ప్రవాహముగ నీరు గార్చుచుండెను. ఆమె నోట నేమియును మాటలాడఁ జాల కుండెను. చింతితయై ఆమె నిరంతరము క్రిందకు జూచుచుం డెను. ఆమె తన అరుణ చరణనఖములచే నేలను ద్రవ్వు చుండెను. ఆమె అంజన రంజితములగు నశ్రుబిందువులు కపోలముల మీఁదుగా జారి కుచకుంకుమ పంకమును గడుగు చుండెను. మానసిక దుఃఖము, పతి పరిత్యాగ భయము, అత్యంత శోకముచే నామె బుద్ధి నశించెను. దుఃఖముచే నామె దుర్బల మగుటచే నామె కంకణములు జారిపోవుఁ చుండెను. ఆమె యేచామరముతోఁ బతికి వీచు చుండెనో అది ఆమె చేతినుండి జారిపడిపోయెను. బుద్ధి విభ్రమమును జెందుటచే నామెకు మూర్ఛ వచ్చెను. కాళ్ళు శరీరభార మును సహింపఁ జాలక గడగడ వణఁక నారంభించెను. చైతన్యరహిత యగుటచేతను, కాళ్ళు వణకుట చేతను. నామె అధిక కాలము నిలువఁ జాలక ప్రబలఁ వాయువుచే విఱిగిన గదళీవృక్షము రీతిఁ నామె శరీరము నేలపైఁ బడెను. పడిపోఁగానే ఆమె వస్త్రము లస్తవ్యస్తము లయ్యెను. ఆభరణము లెక్కడివక్కడ జారిపడి పోయెను. మేలిఁ ముసుఁగు జారిపోయెను. కుటిలకుంతరములు విరియఁ బడెను. ఆమె జడయూడి వదుఁ లయ్యెను. తలలోఁ దుఱిమిన మాలతీమల్లికల మాలలు జారిక్రింద బడెను. కృష్ణుఁ డెన్న

డైన నిట్టి పరిహాసము చేసియుండినఁ దెలిసిఁ యుండెడిదే. ఆమె కిది క్రొత్త యగుటచే నధికముగ మానసిక క్లేశము కలిగెను.

భగవానుఁ డిట్లనుకొనెను:–"పరిహాసము దుఃఖముగ మారినది. అనభిజ్ఞయగు వైదేహి అత్యంత దుఃఖితయైనది. ఆమెకు నాపై నెంతటి యనురాగము కలదు! ప్రత్యక్ష త్యాగము నట్లుంచి, కేవలము వినోదమునకు వాక్కు ద్వారాగానైన నా వియోగమును సహింపఁ జాలకున్నది ?" ఈ విధముగఁ బ్రేమానుబంధ విషయమును గ్రహించి కరుణామయుఁడును కృపాలుఁడు నగు కృష్ణుఁడు రుక్మిణి ననుగ్రహించెను. వెంటనే ఆతఁడు తన మంచము మీఁద నుండి దిగెను. ఇప్పుఁ డాతనికి నాలుగు చేతుఁ లవసర మయ్యెను. రెండు చేతులతో నామెను లేవఁదీసి, ఒక చేతితో నామె వెండ్రుకలను సవరించి, మఱియొక చేతితో నామె ముఖముపై నుండిన స్వేద బిందువులను దుడిచెను. మాటిమాటికి నామె గడ్డమును బట్టుకొని యెత్తి, అశ్రు బిందువులను దన పీతాంబరముతోఁ దుడిచెను. శోకా క్రుసించిత, కుంకుమ రంజిత హృదయమును మాటిమాటి కిని దుడుచుచుఁ బ్రేమపూర్వకముగఁ దనఁ భుజములతో నొత్తుచుఁ దనఁ నికటమునఁ గూర్చుండఁ బెట్టుకొని యోదార్చుచుండెను. ఆతఁడీ పరీక్షలో నాచార్య తం

గతిలో నుత్తీర్ణుఁ డయ్యెను. వ్రజమందలి పల్లెలలో నీతఁడు స్త్రీలను బ్రతిమలాడుట నేర్చుకొని యుండెను. అట్లు బ్రతిమలాడు నప్పుఁ డేమి మాటలాడవలయునో, ఏ యుక్తులను బన్నవలయునో వాఁటి అన్నిటిలో నాతఁడు పండితుఁడు. అందువలనఁ బరిహాసమున భ్రాంతఁ చిత్తయైన రుక్మిణిని, తాను త్యాగ మొనర్చు నేమో యనుభయమున దుఃఖితయైన రుక్మిణిని దీనానాథుఁడును, దయాళుఁడు నగు దామోదరుఁడు మందహాస మొనర్చుచు నోదార్చెను.''

సూతుఁ డిట్లనెను :-''మునులారా ! ఏ విధముగా వాసుదేవుడు రుక్మిణి నోదార్చినదియు, హరి యోదార్పుచే దెలివి దెచ్చుకొని, యే విధముగ నాతని పరిహాస వాక్యముల కొక్కొటిగ సమాధాన మొసంగినదియు దానిని నేను ముందు వర్ణింపఁ బోవుచున్నాను. కృష్ణుడిఁక మాటలాడకుండునట్లుగ నామె ప్రత్యుత్తర మొసంగెను. దానిమీఁద మరల మాటలాడుటకు ''హిఁ హిఁ హిఁ'' అని నవ్వి ఆ ప్రసంగమును సమాప్త మొనరించెను.''

---

## శ్రీకృష్ణునకు రుక్మిణీ ప్రత్యుత్తరము

(౧౧౧౮)

శ్లో॥ నన్వేవమేతదరవింద విలోచ నాహ
యద్వై భవాన్భగవతోఽసదృశీ విభూమ్నః।

స్వస్వే మహిమ్న్యభిరతో భగవాంస్త్ర్యధీశః ॥
క్వాహం గుణ ప్రకృతి రజ్ఞ గృహీతపాదా ॥
—శ్రీభాగ. ౧౦స్కం. ౬౦ అ. ౩౪ శ్లో॥

క॥ మురహర దివసాగమగళ
దరవింద దళాక్ష తలఁప నది యట్టిద లే
నిరవధిక విమల తేజో
వరమూర్తివిభక్తలోక నత్యాల యెందున్॥

తే॥ సంచిత జ్ఞాన సుఖ బలైశ్వర్యశక్తు
లాదిగాఁ గల సుగుణంబు లమరు నీకు
నేను దగుదునె సర్వలోకేశ్వరేశ
లీలమై సచ్చిదానంద శాలి వనఘ॥
—శ్రీమదాంధ్ర భాగవతము.

సూతుఁ డిట్లనెను:- “మునులారా! ముకుందుఁడు రుక్మిణితోఁ బరిహాసములాడఁగా నామె దుఃఖితయై మూర్ఛ పడెను. అప్పుడచ్యుతుఁడు ప్రేమపూర్వకముగ లేవఁదీసి, గట్టిగాఁ గౌఁగిలించుకొని, అత్యంతప్రేమతో నిట్లోదార్చెను:- వైదర్భి! నీకు గోపము వచ్చినదా? ఎచ్చటనైనఁ బరిహాస వాక్యములకు గోపపడుదురా?”

కన్నులను బాగుగాఁ దెఱచి శ్యామసుందరునివైపు చూచుచు రుక్మిణీదేవి ప్రేమకోపమున నిట్లనెను :-“ఎచ్చట నైనా నిట్టి పరిహాసములుండునా? పరిహాసమునకైనను మితి

యున్నది. మీరు నన్నుఁగులటగా భావించితిరా యేమి ? లేకున్న నిట్టి పలుకులేల పలికెదరు ?"

అత్యంత ప్రేమతో శీఘ్రముగ నామె వీపుమీఁదఁ జేతితో నిముఋచు భగవానుఁ డిట్లనెను :-"కాదు కాదు. నా అభిప్రాయ మది కానే కాదు. నేను నిన్నెఱుఁగనా యేమి? నీవొక్కతెవే నామీఁద నత్యంత ప్రేమ కలదానవని నాకు బాగుగాఁ దెలియును. నీవు మనస్సులోనైనను బరపురుషునిఁ దలఁపవు".

కపోలముల మీఁద జారుచుండిన నశ్రువుల నెడమ చేతితోఁ దుడుచుకొనుచు, పైఁటకొంగుచే ముక్కునుండి కారుచున్న నీటినిఁ దుడుచుకొనుచు రుక్మిణి యిట్లనెను :- "నిజముగా మీరట్లు తలఁచు చుండిన నిట్టి చెడ్డమాటల నేల నోటఁబలికెదరు? మీరిది వఱలో నెన్నడును నన్ను హృదయ శూలములవలె నుండు మాటలనన లేదు."

భగవానుఁడు ప్రేమతో నిట్లనెను:-"ఇప్పుడు నిజమును జెప్పుదునా ? అయితే వినుము. నేను నీ చంద్రముఖమునందు సదా మందహాసము లొలుకుచుండుటనుగాంచితిని. క్రోధమున నీముఖ మెట్లుండునో చూతమని నాకెన్నాళ్ళనుండియో కోరిక కలదు. నేను చాలసార్లు ప్రయత్నించితిని, కాని నీవు మాటలు సాగనీయ లేదు. సిగ్గుతోనుంటివి. సిగ్గుచే నీ యవనత ముఖార విందమును జూడఁగనే మిక్కిలి యాకర్షణ ముండుటచే

నేనింక మాటలాడఁజాలక పోయితిని. కాని నా కుతూహల మట్లే పరాకాష్ఠ నందుకొనినది. ప్రణయకోపమునఁ గం పించు దొండపండువంటి నీయధర బింబమును జూడవలయు నని నాకోరిక. కటాక్ష విక్షేప కారణమునఁ గుటిలమైన నీ విశాల యుగళనయనములను గాంచవలయునని నాకోరిక. కోపమందు నీ కుటిల భృకుటి యెంతో అందముగ నుండును. నీ యీ నిర్మల పూర్ణ చంద్ర సదృశమగు ముఖారవిందము రోషమున నెంతో అందముగనుండునని భావించి నే నెగతాళి కట్లంటిని. కాని నీవు నిజమను కొంటివి. అందువలననే సరళ స్వభావము కలవారితో నెక్కువగా మాటలాడరాదని పెద్దలు చెప్పినారు.

రుక్మిణీదేవి కోపకటాక్ష వీక్షణమున నిట్లనెను – "పో పొండు మాటలు త్రిప్పుట మీకు బాగుగాఁ దెలియును. ఇదేమి పరిహాసము ? ఇట్టి పరిహాసము వలన నేమి ప్రయో జనమున్నది ?"

నవ్వి భగవానుఁ డిట్లనెను:–"నవ్వులాటలో వచ్చిన మాటలకు విచారపడకూడదు. ఎప్పుడైనను బరిహాసము నిర్ముక్తహృదయముతో నడచును. మనస్సులో నేదైన భేద ముండినచో శీల సంకోచమును జూడవలసియుండును. అచ్చట నవ్వులే యుండవు. దీనివలన లాభమేమని నీవడుగు చున్నావు. గృహస్థాశ్రమముననిదియే గొప్ప లాభమని నేనను

చున్నాను. నవ్వులలో నిత్య నూతనానందము లభించును. అది లేకున్నచో నెన్నిటికినిఁ బూరింపఁబడని జలము లేనిఅంధ కూపమే కాఁగలదు. గృహస్థాశ్రమమునఁ జింతా, వ్యాధి, శోధనాభావ, పుత్ర, పుత్రికా వివాహచింత, వ్యవసాయ చింత, దుష్ట, చోర, రాజ, ప్రజా, జాతి, కులాది చింత లెన్నో కలవు. గృహస్థాశ్రమమున నన్నియును దుఃఖము లే. దీనిలో గల గొప్పలాభ మొక్కటియే. అదేమనఁగాఁ దన ప్రాణ ప్రియతోఁ బ్రేమపూర్వకముగఁ బరిహాసములాడుచు వినో దమునఁ గాలమును గడుపుటయే. ఈ సుఖము కొఱకు గృహస్థు కోటానకోట్లు దుఃఖములను సహర్షముగ సహించు చున్నాడు. ఈ సుఖము కొఱకే ఆతఁడు విపత్పర్వతమును నెత్తి కెత్తుకొనుచున్నాఁడు, ఇందులో సత్యమగు వస్తువొక కాసంతైన లేదు. నేను నీకడ నెగతాళికి పలికితిని గాని నీకు బాధ కలిగించుటకు కాదు.''

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! భగవానుఁడు తన్నుఁ బరిహాసమాడుచుండెను గాని నిజముకాదని రుక్మిణి తెలిసికొనఁగనే మిక్కిలి సంతోషమును జెందెను. ఇంత వఱకు ప్రియుని వియోగము కలుగనేమోనని భయపడు చుండిన నామె యిప్పుడు ధైర్యము తెచ్చుకొనెను. ఇప్పుడా భయముపోయెను.''

శౌనకుఁడిట్లనెను:- "సూతా! పరిహాసములు పరిహాసములుగానే యుండవలెను. చక్కిలిగింత నవ్వు వచ్చువఱకే యుండవలయును. అతిగాఁ జక్కిలిగింత పెట్టినచో నవ్వులు చివ్వలలోనికి మారును. భగవానుఁడామెను వదలివేయుట యును, ఇంకొకరికడకు బొమ్మనుటయును నిందులోనతి అయినది. ఆతఁడిట్లేల జేసినాఁడు?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! ఈ నటనాగరుని విషయము నెవరును నిదమిత్థమని జెప్పఁజాలరు. ఈతని కార్యములలో నొక్కొక్కదానికి అనేక గూఢాభిప్రాయములిమిడియుండును. ఇందులో స్వయముగఁ గృష్ణుఁడే ఆమె యొక్క క్రోధయుక్తమగు ముఖమును జూడవలయునని యిట్లంటినని ఆతఁడు చెప్పియే యుండెను.

రెండవది-ప్రేమలో మాటిమాటికిని నేను నిన్నొక్కని మాత్రమే కోరుచున్నాను, నీవుతప్ప నాకింకెవరును లేరని వినఁదలఁపు కలుగును. ఈ విషయము నెన్నిసారులు వినిన నంతటి యానందము కలుగుచుండును. అందువలన నచ్యుతుఁడు స్వభావవశమున నీవిషయములను బలికెను.

ఇఁక మూఁడవది-క్రోధమునను, ప్రేమకలహమునను, మానమునను, రోషమునను ప్రేమ నిశ్చితముగఁ దేలిపోవును. అంతయును దీపినిఁ దినిన నోరుమొత్తగాఁ గొంచెముగఁ గారము పచ్చడీ నంజుకొనిన రుచి మారును. చాల దిన

ములు రాగిపాత్ర నక్లేయుంచినచోఁ జిలుముపట్టును. కొంచెము పుల్లని ద్రవమును వైచి తోమినిచో బంగారము వలె మెఱయును. అదే విధముగ సత్యాంత కోపము తరువాత జనించు ప్రేమలో విలక్షణమగు నూతనానందముకలదు. 'పొలయలుక నాటి కూటమి వెల యింతని చెప్పరాదని చెప్పిరి కదా! అట్టి నూతనతను, ఆనందమును తెచ్చుటకు కృష్ణుఁడట్లొనర్చెను.

నాల్గవ కారణము-ఇట్లు పలికి కృష్ణుఁడు రుక్మిణీనోట పతివ్రతధర్మములను జెప్పింపఁదలచెను. దీనివలన నితరస్త్రీలకు మేలు, శిక్షణయును, లోక కల్యాణమును గలుగును. భగవానునియొక్క చిన్నచిన్న పెద్దపెద్ద లీలలలో లోక కల్యాణమిమిడి యున్నది. ఆతఁడు నవ్వులలోను, వినోదములందును, క్రోధమందును, ఇతర భావములందును నే లీల నొనర్చినను లోకహితము కొఱకే చేయును.

అయిదవ కారణమిది-భగవానుఁడెన్నటికిని రుక్మిణిని విడిచి యుండఁడు అందువలన నామెకు కృష్ణుడెన్నడును దనను వదలి యుండడనియు, దానే సుందరిననియు, నాతఁడు తన గుప్పిటలోఁ గలఁడనియు నాతఁడు తనకు వశమగుటచేఁ దనను వదలి యురడుట లేదనియు గర్వము కలదు. ఆ గర్వమును ఖర్వమొనర్చుటకై ఆతఁడిట్టి శూలసదృశములగు మాటలు పలికినాఁడు. ఆ మాటలవలన నామె మిక్కిలి

వ్యాకులము చెందినదని తెలియఁగానే ఆతఁ డిట్లనెను:- "ఈ మాటలన్నియు నబద్ధములు. ఎగతాళికంటిని. ఇందులో సత్యము అణుమాత్రమైనను లేదు." కాని రుక్మిణీ గర్వము నాశనమయ్యెను. ఆమె యిట్లనెను:- "దేవా! నీవొక్క విషయము తప్ప అన్నిటిని సత్యముగనే పలికితివి. ఇందులో నసత్యమేమియును లేదు."

భగవానుఁడు పేహాస్వరమున నిట్లనెను :-"పరిహాసము లలో సత్యముండదు. ఆ మాటలు సాధారణముగ వినో దము కొఱకును, మనోరంజనముకొఱకును బలుకఁ బడు చుండును."

రుక్మిణి యిట్లనెను :- "ఇది సాంసారిక విషయము లందు మునిఁగిన పురుషులలో నిజము కావచ్చును; కాని మీరు సత్యస్వరూపులరు. సత్యసంకల్పులరు మీ రెగతా ళిగాఁ బలికినను నది సత్యమే కాఁగలదు. మీరు నావిషయ మున నేమి పలికితిరో వాని కన్నిటికినిఁ బ్రత్యుత్తర మొసంగె దను. వినుఁడు"

తన ప్రియురాలు కపటము లేక తనతో మాటలాడ వలయునని ఆ కృష్ణునిఁ కోరిక. తన్నుఁ బ్రేమించినవారెన్ని సారులు మాటలాడినను, ఎన్నిసారులామాటలను విన్నను తృప్తియొసంగును. వినుటకు బాగుండును. ఆమె సమీప మునఁ గూర్చుండి, ఆమె ముఖమును గాంచుచు నామె

మాటలను వినవలయునని చిత్తము కోరుకొనుచుందును.
అందువలన శ్యామసుందరుఁడు సరే చెప్పుమనెను.''

రుక్మిణి యిట్లనెను :- ''అయితే వినుఁడు. నాకును మీకును సమత్వము లేదని మీరు మొట్టమొదట పలికితిరి. జోడు కుదుర లేదంటిరి. ఇది సర్వవిధముల సత్యమే. ఐశ్వర్యాది గుణయుక్తులరై, సర్వవ్యాపక సర్వేశ్వర, సచ్చిదానంద స్వరూపులునైన మీరెక్కడ? వికృతమగు త్రిగుణయుక్తలమును, ఆజ్ఞలచే నుపాసింపఁబడు త్రిలోక వాహినియగు నేనెక్కడ? మన కిద్దరకును సమత యెట్లు కుదురఁగలదు. నేను మీకు పత్నిగనుటకు యోగ్యురాలను గానే కాను; కాని దయతో నన్ను స్వీకరించితిరి. ఇందులో నా విశేషత యేమియును లేదు. ఇందు మీ కృపాళుత యే కలదు.

రెండవ విషయము మీరిట్లంటిరి :- ''నేను రాజులకు భయపడి సముద్రమధ్యమునకు వచ్చి నివసించుచున్నాను.'' ఇదియును సర్వథా సత్యమే. ఏలననఁగా నీ త్రిగుణమయ ప్రపంచమునఁ గలహము సంభవించుచునే యుండును. దాని భయముచే మీరు చైతన్యఘనుఁడగు చైతన్యరూపుఁడనై అంతఃకరణ రూపమగు నగాధ సముద్రమునకు వచ్చి సుఖముగ శయనించి యున్నారు. సమస్త దేహరూపములగు పురమునందు నివసించెదవు కావున నీవు పురుషుఁడనఁబడుచున్నావు.

మీరింకొక మాట నంటిరి :- "మమ్ముగాంచిన బల వంతులగు రాజులందఱును వైరమును బూనిరంటిరి. అది యును సత్యమే. ఏలననఁగాఁ గుత్సిత యింద్రియగణరూప మగువారే యీ నృపతి గణము. వీరందఱుకును మీకును నెప్పుడును గలహామంటిరి. జిహ్వ తన వైపునకు లాగు కొనును. చెవులు వానివైపునకు లాగుకొనును. ఇంద్రియము లన్నియును దమతమ విషయములను గాంక్షించుచుండును. విషయములందకపోయిననో నవి విరోధించును. విద్రోహ మొనర్చును. మీరు వీని నన్నిటిని జయించెదరు. అందు వలన మీరు హృషీకేశులరైతిరి. హృషీకములనఁగా నింద్రియములు. వానికీశులరు మీరు."

రాజసింహాసనమును వదలితినని మీరంటిరి. అది యును నిజమే. ఘోర తమోగుణమే రాజసింహాసనము. దీనిని మీచరణముల నాశ్రయించిన మీ భక్తులే విడిచి వనములకుఁబోవుదురు. మీ భక్తులచేతనే విడువఁబడినది మీరెట్లు గ్రహించెదరు ?"

"నామార్గ మస్పష్టమైనది. నేను లోకవిరుద్ధముగ నడుచువాఁడనని మీరంటిరి. అదియును సత్యమే. మీ చరణకమలరేణువు నాశ్రయించిన నీభక్తులును, యోగి జనమును సమస్త విధినిషేధ బంధనములనుండి ముక్తులై స్వచ్ఛందముగ విహరించుచున్నారు. వారు లౌకిక వైదిక

కార్యములందు లిప్తులై యుండరు. లోకవిరుద్ధ వ్యవహార మును గావించుచుండుటను గాంచుచున్నాము. మీ చరణార విందసేవకులే విధినిషేధ బంధనమునుండి బయటపడఁగా మీ రెట్లు లౌకికబంధనములోఁ బడఁగలరు? మీ మార్గము నెవరెఱుఁగఁగలరు?"

మీరు నిష్కించనులమని చెప్పుకొంటిరి. ఇదియును నసత్యముకాదు. మీరు దారిద్ర్యముచే నిష్కించనులైన వారుకారు. దరిద్రదేవత మీవదినయే. ఆమె కెవరును నాశ్రయ మొసంగలేదు. మీరామె కాశ్రయ మొసంగితిరి. ఆమె కాశ్రయము నొసంగితిరి. వదినె అయినందుల కభి మానించితిరి. అసురులును నిన్నాశ్రయించి సుఖపడెదరు. పశు, పక్షి, క్రిమి, కీట, పతంగాదు లన్నిటికిని ఆశ్రయము మీరే. ఏలననఁగా మీరు లేక ఇంక దిక్కు లేనేలేదు. ఈ నిష్కించనతయే మీలోనున్నది. మీరు ఇంద్ర, వరుణ, కుబేరాది విశ్వవందిత దేవతలచేఁ బూజింపఁబడుచుందురు. వారు మీ కనన్య భక్తులయ్యెదరు. మీరును వారి నాత్మీయు లుగ భావించి కృపఁజూచెదరు. వారు మీ యంశలే, ధనాదులచే మదమత్తులైనవా రంధులై మిమ్ము మఱచు చుందురు. కాలరూపులరై మీరే వారి ఆయుస్సును నాశ మొనర్చుచున్నారను సంగతిని వారు మఱచుచున్నారు. వా రెల్లప్పుడును శరీరపోషణమందే మగ్నమై యుండెదరు. మీ

టె శ్రేష్ఠు లింకెవరును లేరు. మీకుఁ బరమైన వస్తు వేది
ంను లేదు. అందువలన మీరకించనులు.

మీరింకొకమాట నంటిరి, సంబంధము సమానముగ
ండవలయునంటిరి. ఈమాట పరమసత్యము. కామినీ
'ంచనములనే సర్వశ్రేష్ఠ మనుకొనువారును, సుఖదుఃఖాది
ంద్వములలోఁ బడి కొట్టుకొనువారును మీరును నొక్క
ట్లు కాగలరు ? మీరు పరమ పురుషార్థ స్వరూపులరు.
ర్మార్థ కామమోక్షములకు మీరు ప్రభువులరు. అన్నిటికి
ద్గమస్థానము. త్రివర్గములలోఁ బడినవారు జననమరణము
లోఁ బడిపోవుదురు. మీకును వారికిని సంబంధమెట్లు
మరఁగలదు? సమస్తకామములను బరిత్యజించి నిన్నొక్క
నే శరణుజొచ్చిన నన్యభక్తులు సర్వస్వత్యాగ వివేక
రాగ్యములు కలవారితో మీకు సేవ్యసేవక సంబంధము
మరఁగలదు. నాలో నేమియును గుణము లేదు. నిజమునకు
కును మీకును సమత్వముండదు. లేదు. అయినను మీరు
న్ను స్వీకరించితిరి.''

మీరిట్లడిగితిరి:- ''నీవు ఇందరు రాజులుండఁగా, వారిని
డి నన్నేల వరించితివని మీరంటిరి.'' దీనికిని జవాబును
మదు. నేనజ్ఞను. మీ మహిమము నెఱుఁగఁజాలను.
ాని న్యస్తదండ సన్న్యాసులును, ప్రాణుల కభయదాన
ముసంగినవారును, గొప్ప వివేకవంతులును, వైరాగ్య

వంతులును మీ ప్రభావమును వర్ణించియుండిరి. మీరు జగత్తంతకును నాత్మస్వరూపులు. మీ భక్తులను మీరు మీవలెనే యొనర్చెదరు. ఇంతేకాదు. వారిని మీరు మీకంటె గొప్పవారినిగా నొనర్చెదరు. అత్యధికముగ నాదరించెదరు. అందువలన మిమ్ములను నేను వరించితిని. శిశుపాల, దంతవక్త్ర, జరాసంధాది తుచ్ఛరాజుల విషయమేల ఇంద్రబ్రహ్మ శంకాదుల భువనములందలి భోగములన్నియును నీ భ్రుకుటి మీసముచే నుత్పన్నమై నశించుచుందురు. ఈ లోకేశ్వరుల స్థితియే యిట్లుండఁగా నింక నీ క్షుద్ర నరపతుల లెక్కయేమి యున్నది ?''

ఒక్క విషయములో నేను మీ కేకీభవించుట లేదు. అది నన్ను మీరు మభ్యపెట్టుటకు చెప్పిన విషయము. నేను తప్పక దానినిఁ బ్రతిఘటించెదను. నిండు సభలోనే ప్రతిఘటించెదను. రాజుల భయముచే నేను సముద్రములోనికి వచ్చి దాగికొంటిని. నిర్బలుఁడని మీరంటిరి. అది పొరపాటు. మీరు నిజముగ నిర్బలుర లే యగుచో నిట్టి సాహస మెన్నటికినిఁ జేయరు. జరాసంధునకు భయపడి పాఱిపోయి వచ్చితి నని మీరంటిరి. నావివాహ సమయమున జరాసంధాదులును నచ్చటఁ గలరు ఆతని యనుయాయులును గలరు. పృథివి యందలి శూరగణ మచ్చటనుండిరి. అట్టి చోటునకు మీరొక్కరే వచ్చి అచ్చట రథముమీఁద నన్నెక్కించుకొని,

అందఱ కండ్లలో దుమ్మును గొట్టి సమస్త పశుమృగాదుల మధ్యనుండి సింహము తన భాగమును దీసికొని వచ్చినట్లు మీభాగమగు నన్నుఁ దెచ్చితిరి. అప్పుడు మీరు మీ శార్ఙ్గధనుష్టంకార మొనర్పఁగా శత్రురాజుల హృదయము లన్నియును విదీర్ణములయ్యెను. జరాసంధాది దుష్టరాజన్యులు పారిపోవలసి వచ్చెను.''

'నీవు నాతో నుండిన దుఃఖపడెదవు. సుఖము కలుగదని మీరంటిరి. అదియును నుచితము కాదు. రాజ్యమునందును, ధనవైభవమునందును సుఖమే యుండినచోఁ జాల ప్రతాపవంతులగు అంగుఁడును, సహస్రాధిక అశ్వమేధము యాగము లొనర్చిన బృథు చక్రవర్తియును, ఎవరినామమున నిప్పటికిని భారత వర్షమని పిలువఁబడుచున్నదో, అట్టి మహారాజగు భరతుఁడు మొదలగువారును, వైభవశాలియగు యయాతి మహారాజును, ఇంకను యశస్వులగు రాజర్షులును, ఇంక నెందఱో సమ్రాట్చక్రవర్తులును దమ తమ ఏక ఛత్ర రాజ్యమును వదలి ధనవైభవ, విషయసామగ్రులను వీడి నిన్నుఁబొందుటకై వనముల కేల పోవుదురు ? రాజ్యమును వదలినఁగష్టము కలిగినచో వారట్టి పథము నేల అనుసరించెదరు ? ఇట్లు చేసి వారెవరును గ్లేశమును బొందలేదు. నేను నీచరణముల నాశ్రయించి యేల కష్టపడెదను. మీరు సుఖస్వరూపులరు. సుఖస్వరూపము కడకు పోయినచో సుఖమే లభింపఁగలదు.

చివరకు మీరు, ఇప్పుడైనను మించిపోయినది లేదు. ఇంకొక రాజకుమారుని వరింపుము. ఎవరినైన వైభవశాలి నాశ్రయింపుమంటివి. స్వామీ! రసగుల్లాను దినువాఁ డెవఁడు చీమలు, ఈఁగలు, పురుగులంటుకొనిన బెల్లము నెవఁడు తినఁగోరును? విమానము మీఁద నెక్కువాఁడెవఁడు గర్దభము నెక్కఁదలఁచును. కపిల గోవు పాలను ద్రాగువాఁ డెవఁడు జిల్లేడు పాలను ద్రాగఁదలఁచును. అమృతమును ద్రాగువాఁడెవఁడు విషమును ద్రావును. ఎవఁడు రాజసింహాసనమును వదలి ముండ్లమీఁదఁగూర్చుండును? అల్లే సత్పురుషులచేఁగీర్తింపఁబడుచు, మోక్షధామమును, లక్ష్మీదేవి కాశ్రయస్థానము నగు మిమ్ము వీడి మరణధర్మము గల యీ నరపశువుల నెవరాశ్రయింపఁగలరు? ఎవరు వారికి పత్ని కాఁగలరు? నిరంతరమధికాధిక కాలభయము కలిగిన నీ యజ్ఞపురుషుల యాశ్రయ మెవరు గ్రహింపఁగలరు?''

'నీవు నాలో నే విశేషతను గాంచితివి? ఏగుణమును గాంచి నన్నుఁబతిగా గ్రహించితివని మీరడుగవచ్చును. వినుఁడు. మీరీచరాచర విశ్వమున కేకైకాధీశ్వరులు. అందఱ కాత్మ స్వరూపులరు. మీరు ఇహలోక పరలోక సంబంధమగు కోరికలనన్నిటిని బూర్తిచేయువారు. మీరు సుఖ స్వరూపుల రగుటచేఁబరమ ప్రేమాస్పదులు. ఆనందస్వరూపుల రగుటచే నానంద దాతలు. అందువలన సమస్త విషయ

౦దఱచేఁ దిరస్కరింపబడువారునగు నీ సాంసారిక పతులు మందభాగినులగు స్త్రీలకే ప్రాప్తించెదరు. నేనట్టి విషయాసక్తుల వైపు తలనెత్తి చూడనైనఁ జూడను. కర్ణములతో భగవన్నామములను విన నోచుకొననివారును, సర్వత్ర కీర్తనీయములగు నీ నామములను గీర్తింపని వారును, శివబ్రహ్మాదిక దేవతాసభలందు గానము చేయఁబడు నీ గుణములను గానము చేయనివారునగు నట్టి హతభాగ్యులగు పురుషులను హతభాగినులగు స్త్రీలకే పతి కాఁగలఁడు.

ఏస్త్రీలు నీ నామగానరూపమగు నమృతమును రుచిచూడరో, ఎవరు నీచరణకమల మకరందము నాఘ్రాణ మొనర్పరో, ఎవరి కర్ణములలో నీ కమనీయ కథ పడదో అట్టి స్త్రీలు మాత్రమే ఇట్టి విషయలోలుపుఁడగు బురుషునిఁ బతిగా గ్రహించెదరు. అట్టిదే వాని బాహ్యరూపము నందాసక్తినిఁజెంది వానికి దన అంగము నర్పింప నుత్సహించెదరు. ఈ శరీరమెట్టిది? దీనిపై చర్మముచుట్టఁబడినది. లోపలనుండి నిరంతరము మలములు స్రవించుచుండును. చర్మముపైనఁ గేశములు కలవు. రోమములు కలవు, మీసములు కలవు, నఖములు కలవు. లోపల మాంసము, ఎముకలు, రక్త, కృమి, విష్ఠా, వాత, పిత్త, శ్లేష్మాది మలములతో నిండి యున్నది. ఈ శరీరమెట్టిది. అపవిత్రవస్తువుల సమూహము. లోపలి వస్తువులు బయటపడెనా వమనము కలుగును. వాని

వైపున కెవరును జూడఁజాలరు. ఇట్టి అపవిత్ర దేహాము నందాసక్తినిఁజెంది దాని నాలింగనమొనర్చుకొని సుఖాను భవ మెవరొనర్చెదరో, అట్టి స్త్రీలు నీ గుణమయమగు మాయచే వంచితులైన వారగుచున్నారు. వారు దుఃఖమందు సుఖమును, అనిత్యమందు నిత్యమును, నాశవంతమైన దాని యందలి నాశత్వమును భావించెదరు. అట్టి స్త్రీలు హాత భాగినులు. అట్టి భావముగల పురుషులును మందభాగ్యులే. అట్టి మందభాగ్యులు స్త్రీల బాహ్యస్వరూపమును గాంచి ఆసక్తినిఁ జెందెదరు.

మీరాప్త కాములరు. మీరు నా యధీనులగుట యును, నారూప మందాసక్తులగుటయు సంభవింపదు. మీ రాత్మారాములరు. మీరు మీయందే రమించెదరు. కాని నాకు సర్వస్వమును మీరలే. నాకు మీ చరణారవిందము లందు సహజానురాగము కలుగునట్లు నాకు వరమొసం గుఁడు.”

కృష్ణుఁడింత వఱకు మెదలకుండెను. రుక్మిణి వ్యర్థముగ మాటలాడుచుండెను. తన పాండిత్యమును ప్రదర్శించుచుం డెను. భగవానుఁడూరక వినుచుండెను. “మీరే నాకు సర్వస్వము, మీయెడల నాకు సహజానురాగము కలదని యెప్పుడామె పలికినదో, అట్లు పలుకుటయే భగవానుని కిష్ట మగుటచే నాతఁడిట్లనె:- “ప్రియా! నీ విట్టి పలుకులేల

పలుకుచున్నావు? నేను చకోరమువలె-నీముఖారవిందమును నిరంతరము కాంచుచుందును. నే నెంతగా నీ ముఖమును గాంచినను తృప్తి జనింపదు.''

అంత రుక్మిణి యిట్లనెను :-''మీరు గుణాతీతులు. ఈ సాంసారిక గుణములతో మీ కేమి సంబంధము? అయి నను సంసార వృద్ధికొఱకు మీరుత్కట రజోగుణమును స్వీకరించెదరు. అంతఁదద్భావ భావితులై సతృష్ణ నయనము లతో నావైపు చూచుచుందురు. నీ ముఖమునుగాంచిన నాకు తృప్తి జనింపదని మీరు మాటిమాటికిపలుకుచుందురు. ఇదంతయును మీ క్రీడ వినోదము, మానవలీల లొనర్చుచుం దురు. దీనినిగూడ నేను మీ పరమ కృపయని అనుకొను చున్నాను. నన్ననుగ్రహించుటకే మీరిట్టి కౌతుకమొనర్చు చుందురు.''

సూతుఁడిట్లనెను :- ''మునులారా! రుక్మిణియొక్క శోక, భయ, శంకలన్నియును నివృత్తమైనవని భగవానుఁడు తెలిసికొని ఆమె వాక్యములను సమర్థించుచు నామె ప్రేమను బొగడ నారంభించెను ఇప్పు డా ప్రసంగమును మీకు చెప్పెదను. సావధానులరై వినుఁడు.''

---

# శ్రీకృష్ణుడు రుక్మిణి నాశ్వాసించుట

(౧౧౯)

శ్లో॥ నత్వాదృశీం ప్రణయినీం గృహిణీం గృహేషు
పశ్యామి మానిని యయా స్వవివాహకాలే।
ప్రాప్తాన్ నృపానవగణయ్య రహోహరో మే
ప్రస్థాపితో ద్విజ ఉపశ్రుతసత్కథస్య॥

—శ్రీభాగ. ౧౦. స్కం. ౬౦ అ. ౫౫ శ్లో॥

వ. నీ సమానయైన కాంత యేకాంతలందైనఁగలదె నీవివాహ కాలంబున ననేక రాజన్యవరులఁ గైకొనక భవదీయ మధు రాలాప శ్రవణాత్మకుండ నయిన నా సన్నిధికి నా శరీరం బితర యోగ్యంబుగాదు నీకు శేషంబనయి యున్నదాన నని యేకాంతంబునన్ బ్రాహ్మణుం బుత్తెంచిన నేనును జనుదెంచితి.

— శ్రీమదాంధ్ర భాగవతము.

పరిహాసములలోఁ దన యాత్మీయులు చెడ్డగాఁ దలఁచి నచో వారిని సమాధానపఱచుటకును, ఆనందింపఁ జేయు టకును బ్రయత్నమొనర్పవలసి వచ్చును. మంచిని చెడ్డగను, చెడ్డను మంచిగను చెప్పవలసి వచ్చును. ఆవలి వారానం దము చెందునట్లు వ్యవహరింపవలసి వచ్చును. వారి స్థితిని గ్రహించి కల్లయో, నిజమో ప్రసన్నతను బ్రకటించి వారిని సంతోషపఱుపవలెను. ఈ కళయందు నిపుణులు కానివారు సర్వప్రియులు కాఁజాలరు. రూక్షస్వభావము కలవారి ప్రేమ

చాలకాలము నిలువదు. ప్రేమలోఁ గఠినపు మాటలు పలు కుట దోషము. సత్యమును మధురముగఁ బలుకవలయును. మృదు మధుర వచనములచేతను, అనురాగ యుక్తమగు వ్యవహారముచేతను ప్రేమవృద్ధియగును.

సూతుఁడిట్లనెను:-''మునులారా! రుక్మిణీదేవి కృష్ణుని వాక్యములకుఁ బ్రత్యుత్తర మాధ్యాత్మికముగ నీయఁగానే యిద్దర సంభాషణము వలన మరల పూర్వమువలె ననురా గము వృద్ధిపొందెను. అప్పుడు భగవానుఁ డిట్లనెను:-''నేను నిన్నింకొక మగనిఁ జూచుకొనుమనిపలుకఁగనే నీమనస్సునకుఁ జాల బాధ కలిగినది. నేను తెలిసికొనక యీమాట నంటిని. ఏదో పరిహాసములలో నా నోటినుండి యీ మాటలు వెలు వడినవి. నిజమున కిట్టిమాటలు స్త్రీల కవమాన జన కములు.''

రుక్మిణీదేవి ప్రేమతో నిట్లనెను:-''కాదు ప్రాణ నాథా! అవమాన జనకములు కాదు. చాలచోట్ల కన్యక ఒకచోట ప్రేమ బెట్టుకొనును. బలవంతముగ నింకొకఁడు కొనిపోవును. కాశీరాజు కూతురగు అంబ శాల్వునిఁ బ్రేమిం చెను. కాని ఆమెను దన తమ్ముని కొఱకై భీష్ముఁడు బల వంతముగఁ దీసికొనిపోయెను. కాని నా వివాహమున నట్టిది సంభవింపలేదు. నేను సదా నిన్నే కోరుచుంటిని. ఆ సమ యమున మీరు వచ్చి నన్నుద్ధరింప కుండినచో నా తండ్రి

యును నన్నయును బలవంతముగ నన్నింకొకరి కిచ్చెడువారే. ఆ సమయమున నాకాత్మహత్య తప్ప ఇంకొక ఉపాయ మేమున్నది? వివాహమైన తరువాత స్త్రీ ఆతని సొత్తే కాఁగ లదు. జీవితాంతము వఱకు నాతనే అంటిపెట్టుకొని యుండ వలయును. కొందఱు కులటలగు స్త్రీలు తమ వివాహ మొక రితో కాఁగానే పరపురుషులతో సంబంధమును బెట్టుకొను చుందురు. ఇట్టి వ్యభిచారిణులగు స్త్రీలను బుద్ధిమంతులగు పురుషులెవరును విశ్వసింపరాదు. ఇట్టి పరపురుష గామిని యగు స్త్రీ వస్త్రములలో దాగిన సర్పమువంటిది. అది యెప్పుడైన ననర్థమును గావింపవచ్చును. ఇట్టి కులటలగు కామినులను బోషించుటచేఁ బురుషు లిహపరలోకములకును దూరులగుచుందురు. పతితు లయ్యెదరు."

ఇది విని శ్రీకృష్ణుఁడు పకపక నవ్వుచు నిట్లనెను:- "ప్రియా ! నీ యీ మధురాతి మధురములును, అనురాగ యుక్తములునగు పలుకులను వినుటకే నే నిట్లు పరిహాసము లాడితిని. మృదంగము మీఁద మధురశబ్దము దెబ్బకొట్టినఁ గాని రాదని నీకు దెలియును. వీణకు జెవులను మెలివైచి తీగమీఁద గొట్టినగాని దాని నుండి శుద్ధస్వరము వెలువడదు. నేను నిన్నుఁ బోటుమాట లనకుండిన నీవు తలవంచుకొని సిగ్గుతో నుండెదవు కాని మాటలాడవు. ఇప్పుడు నేను కఠిన వాక్యాలు పలుకగా వానికి యుక్తియుక్తముగ సమాధాన

మును జెప్పి పూర్ణముగ వ్యాఖ్యానించితివి. నీవు చెప్పిన దంతయును సత్యమే. నేను నీ ప్రేమను శంకింపలేదు. నీ ప్రేమయందు నాకు సందేహ మేమాత్రమును లేదు. నీవు నాకనన్య భక్తువు. సకామభావనా నివృత్తికై నీవు నామెడల నేయే కోరికలను బెట్టుకొంటివో అవన్నియును నీకు నిత్యం ప్రాప్తములే. కల్యాణీ! కుతూహల వశమున నేనీ వాక్యములనుబలికితిని. నేనిట్లు పోటుమాటలను బలికి విచలిత నొనర్ప దలచితిని. కాని నీవే మాత్రమును జలింపలేదు."

రుక్మిణీ దేవి యిట్లనెను :- "మీకీ మాటలే తోచినవా? పరిహాసమునకు మాకింకే మాటలును దోచలేదా?"

భగవానుఁ డిట్లనెను :- "నేను ప్రేమ పరీక్షను జేయఁదలఁచితిని. నీ నోటినుండి ప్రేమ యొక్కయు, పతివ్రత యొక్కయు ఉజ్జ్వల మాహాత్మ్యమును వినఁదలఁచితిని. అట్లే వింటిని. నీవు నన్ను మోక్షాధీశ్వరుఁడ నంటివి. అదిసత్యమే. అందఱును నన్నే భజించుచుండెదరు. అందఱి కర్మలకును ఫలము లొసంగువాఁడను నేనే. ఏ మానవులు కామినీ, కాంచన, ప్రతిష్ఠాకాంక్షలకు వశులై నానా విధములగు జప, తప, వ్రతానుష్ఠానములను జేయుచుందురో వారు నామోహిమాయలోఁ బడినవారగుచున్నారు. నన్ను భజించుటవలన జనన మరణరూపమగు నీ సంసార బంధమునుండి విడివడుటను గోరవలయును గాని

సమస్త సంపత్తుల కాశ్రయుఁడనై, జగదీశ్వరుఁడనైన నన్ను సేవలము సాంసారిక విషయసంబంధమగు లౌకిక సంపత్తినే కోరుచు, సంసార సాగరమునుండి విముక్తినిఁ భక్తినిఁ గోరకుండిన వారిని మందభాగ్యు లనవలయును. వారు కృపణులు, దీనులు, వంచితులగుచున్నారు. ఈ ఆహార నిద్రా, మైథునాది సుఖములు కుక్క, పంది జన్మలందును, నరకాది లోకములందును బ్రాప్తింపఁ గలవు.''

రుక్మిణీదేవి యిట్లనెను :-''ప్రభూ ! విషయ సుఖము లలో శాంతిలేదని జీవునకుఁ దెలియును. అట్టి యెడ వానిని మాటిమాటికేలకోరుకొనుచుందురు? జీవులేల యీ మాంసాస్థి యుక్తము లగు శరీరములందు రమింపఁ గాంక్షించు చుందురు.''

భగవానుఁ డిట్లనెను :- ''ప్రియా! అనేక జన్మము లందలి వాసనలచే జీవుఁడు దుఃఖమందే సుఖములను గాంచు చున్నాఁడు. భాగ్యహీనులగు వారి మనస్సు సదా విషయ జన్య పదార్థములందే ఆసక్తమై యుండును. విషపురుగునకు విషమే బాగుండును. మలములోనుండు పురుగు దానియందే రమింపఁగోరుకొనుచుండును. అదే విధముగ నెవరి మనస్సు సాంసారిక విషయములం దాసక్తినిఁ జెందియుండునో వారికి నరకప్రాప్తియే సుఖకరముగఁ దోచును.''

రుక్మిణీదేవి యిట్లనెను :- "అశరణ శరణా! మీ పాదారవిందములందు తప్ప వేఱొకటి వినకుండునట్లు నాకు వర మొసంగుండు."

భగవానుఁ డిట్లనెను :-"ప్రియా! సేవాధర్మము చాల కఠినమైనది. అందులో నిష్కామ సేవ యింకను గఠిన మైనది. సంసార బంధనమునుండి శాశ్వతముగ విముక్తిని గలిగించు నిష్కామసేవను నేఁటివఱ కత్యంత ప్రీతితో జేసితివి. కాముకులగు వారిట్టి సేవను జేయఁజాలరు. ఇంద్రియ తృప్తి కావించుకొనుటయందే ప్రవృత్తినిఁ జెందు దూషిత హృదయలగు స్త్రీల విషయము చెప్పవలసిన దేమున్నది? కామసుఖమునే సర్వశ్రేష్ఠసుఖముగ భావించు కులటలగు కామినులు నానావిధములగు మాయల నొనర్చి మోసము చేయుచుందురు. అటు నిటు నింద్రియ తృప్తికై తిరుగు చుందురు. నీవు నన్ను నీసేవద్వారా కొనివేసితివి. సేవా మూల్యముచే నన్నుఁ గొంటివి."

రుక్మిణి యిట్లనెను :- "స్వామీ! మీ కనేకులు దాసీలు కలరు. అందులో నేను నొక్కదాసిని. నే నేమి సేవ చేయఁ గలుగుదును. మీ చరణ ధూళితోనైనను సమా నము కాను."

భగవానుఁ డిట్లనెను :- కాదు ప్రియా! నేను సత్య మును జెప్పుచున్నాను. నాకు పదునాఱువేల నూటయెని మిది యిండ్లలో నొక దానికంటె నింకొక తె మించిన సంద కత్తెలున్నారు. కాని వ్యవహారము చేతను, నిశ్చల ప్రేమ చేతను, అనుపమ అనురాగముచేతను, నిష్కామసేవ చేతను

నీవు నన్ను వశ మొనర్చుకొనిన ట్లింకెవరును నన్ను వశపఱచుకొనఁ జాలకపోయిరి. నీవంటి ప్రణయిని యగు గృహిణి నాకింకెవరును గనఁబడలేదు. నీ యెడలను నాకు సహజానురాగము కలదు. అట్లుకాకున్న నీ వివాహ సమయమున నా వృద్ధ బ్రాహ్మణునిఁ బంపి నన్నెందులకు పిలిపించెదవు? ఏల గొప్పగొప్ప రాజులను వదలి నన్ను వరించెదవు? నీవా బ్రాహ్మణ దూత నెప్పుడు పంపితివో అప్పుడే నీకు నాయెడల నిశ్చల హార్దికమగు గూఢానురాగము కలదని తెలిసికొంటిని. అందు వలన నాకు సమాచారము తెలియఁగనే మీపురమునకుఁ బరువిడి వచ్చి, నిన్నందఱును జూచుచుండఁ దీసికొని వచ్చితిని.''

రుక్మిణి యిట్లనెను :—''స్వామీ! ఇందులో నాగొప్పతన మేమున్నది? నీ సౌందర్య మాధుర్యమును, గుణాకర్షణమును నట్టిది. అట్టి నిన్నే కన్యలు పతిగాఁ గోరరు? ఇదంతయును మీ యాకర్షణము యొక్క ఫలము.''

శ్రీకృష్ణుఁ డిట్లనెను :—''సరే, అది నా యాకర్షణ ఫలమైనఁ గావచ్చును. కాని నీయిచ్ఛను నాయిచ్ఛలోఁ గలుపుట సామాన్యవిషయము కాదు. తన యిష్టమునందు దోషమును జూడకుండుటయును, అనన్యతకును నిదియే సర్వోత్కృష్టోదాహరణము. వివాహ సమయమున నీయన్న నాతోఁ బోరాడవచ్చెను. నేను వానిని జయించి నీయెదుటనే

వానిని విక్రృతిని గావించితిని. నీవు నే నేమైన నను కొందు నని యేమియును మాటలాడ లేదు. తరువాత ననిరుద్ధుని వివాహ సమయమున ద్యూత క్రీడయందు బలరాముడు వానినిఁ జంపెను. అట్లయినను నీ వేమియును మాటలాడ లేదు. ఇంతటి సహన శీలత యింకే స్త్రీయందైన నుండునా? నీ విట్లాలోచించుకొని యుండవచ్చును:-"నేను మాటలాడి నట్లైన గృహకలహములు రాఁగలవు" అని భావించి నీవా దుఃఖమును లోలోన మెదలక సహించితివి. దీని కెదురాడ నైన లేదు. ఇట్టి నీయుదార తాపూర్ణమగు వ్యవహారము చేత నే నేను నీకువశుఁడ నైతిని. నీవు నీ మృదుమధుర స్వభావముచేత నే నన్నుఁగొని వైచితిని."

రుక్మిణీదేవి యిది విని లజ్జిత యయ్యెను. శ్రీకృష్ణుఁడాగ లేదు. ఆతఁ డింకను బలుకుచునే యుండెను. నీకు నాయెడల గల అనురాగము అనుకరణీయమైనది. ఒకనొక రాజకుమారి కిట్టి సాహసముండుట ప్రశంసనీయ మగు విషయము. నీపెండ్లికి పెండ్లివారు వచ్చుటకు రెండుమూఁడు దినములే వ్యవధి కలదు. వివాహ ప్రయత్నము లన్నియును జరిగినవి. అయినను నీవు నీనిశ్చయము నుండి ఒక్క అణుఁ మాత్రమైనను విచలితురాలవు కాలేదు. సుమేరువువలెనీసంకల్పముందే దృఢముగ నిలిచితివి.నీవు నీతల్లిదండ్రుల నడుగకయే నాకడకు ఉత్తరమును వ్రాసి పంపితివి. నేను వచ్చుట కొంచె

మాలస్యము కాఁగానే నీకీ ప్రపంచమంతయును శూన్య ముగ, గనిపించినది. దేవీ పూజనము వేళకు నేను రాకుం డినఁ బ్రాణములను త్యజింపవలయునని నిశ్చయించితివి. నీ యీ ప్రేమకు నే నేమి ప్రత్యుపకార మొనర్పఁ గలనో చెప్పుము. నీ ఋణము నెట్లు తీర్చుకొనఁ గలుగుదును? అట్లు ఋణ విముక్తిని గూడ నేను కోరను. ఎల్లప్పుడును నీకే ఋణపడి యుండఁ గోరుదును. దానిలోనే నాకు సుఖము కలదు. ఋణపడి యుండినచో నీ యీ యద్భుత ప్రేమ సదాస్మరణకు వచ్చుచునే యుండును. దాని నెల్లప్పుడును స్మరించుచునే యుందును. నీ ప్రగాఢ ప్రేమను నిరంతర మభినందించు కొనుచుందును."

సూతుఁ డిట్లనెను :- "మునులారా! స్నేహాభరిత ములును, అనురాగ యుక్తములును, ప్రేమార్ద్రయుక్త ములు నగు వాక్యములను విని రుక్మిణీదేవి లజ్జతయై యేమి యును మాటలాడఁ జాలకపోయెను. తన శిరస్సును భగ వానుని పాదపద్మము లందుంచెను. శ్రీకృష్ణుఁడు తన ప్రకం పిత కరములతో నామెను లేవనెత్తి ప్రేమ భరిత హృద యముతోఁ గౌఁగిలించుకొనెను. మునులారా! ఈ విధ ముగ భగవానుఁడు మిగిలిన భార్యలతోడను సరస వినోద, పరిహాసములను గావించెను."

శౌనకుఁ డిట్లనెను :–"సూతా! ఇతర భార్యలతో శ్రీకృష్ణుఁ డేమి పరిహాసములు గావించెనో వానిని గూడ మాకు జెప్పవలయును."

సూతుఁడు నవ్వి యిట్లనెను :– "అయ్యా! స్వామీ! పరిహాసములకంతు లేదు. పదునాఱువేలమంది భార్యలుకలరు. ఎంతని చెప్పగలను? సరే, సత్యభామతోఁ జరిగిన ప్రేమమయసంవాదమును జెప్పి, యీ విషయమును బూర్తి చేసెదను.

— ౮ —

## శ్రీకృష్ణ సత్యభామా సంవాదము

(౧౧౨౦)

శ్లో॥ తథాన్యాసామపి విభుర్గృహేషు గృహవానివ।
ఆస్థితో గృహమేధీయాన్ ధర్మాంల్లోక గురుర్హరిః॥
శ్రీభాగ. ౧౦ స్కం. ౬౦ అ. ౫౯ శ్లో॥

వ. ఇవ్విధంబున దేవకీసుతుండు నరలోక విడంబనంబుగ గృహస్థుని భంగి నిజగృహకృత్యంబు లాచరించుచుండెనని శుకుండు మఱియు నిట్లనియె.

—శ్రీ మదాంధ్రభాగవతము.

గొప్పవారియొక్క పరిహాసమును నిరర్థకము కాదనియు, దానియందును గొప్ప గూఢ జ్ఞానమిమిడి యున్నదనియు

శాస్త్రకారులు చెప్పుచుందురు. వారు నవ్వుచునే మనము సులభముగ నుద్ధరింపఁబడు పలుకులు పలుకుచుందురు. ఊరక నుపదేశించు వ్యసనముకలవారును, వక్తృత్వముచేఁ దన జీవికను వెడలఁబుచ్చుకొనువారును, నెచ్చటనుండియో వెదకి వెదకి విషయములను గంఠస్థ మొనర్చుకొని చిలుకల వలెఁబలుకుచుండెదరు. కానియుపదేశించు నభ్యాస మొనర్పని వారి ప్రతి చేష్టయందును నుపదేశము సన్నిహితమై యుండును. ఆతఁడు లేచుట, కూర్చుండుట, నవ్వుట, ఆడుట మొదలగునవన్నియును నుపదేశ మయములుగనే యుండును అందువలనఁ దమకంటెఁ బెద్దవారి సేవలొనర్పవలయును. గొప్పవారి జీవితము మూర్తీభవించిన ఉపదేశమే కాఁగలదు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! భగవానుఁడు గృహస్థాశ్రమపాలన మొనర్చుచుఁ బదునాఱువేల నూటయెనిమిది రాణుల గృహములందు వేఱువేఱుగ నుండి, వారితో ననేక పరిహాసవినోదము లొనర్చుచుండెను. భార్యకు సర్వోత్కృష్ట సుఖము భర్త తనతో నవ్వుచు మాటలాడుటయే. అప్పుడప్పుడు పరిహాసమునకు సంబంధించిన వినోదము లొనర్చ చూడవలయును. ఏ భర్త చేతిలోఁ గొఱడాను దీసికొని, భార్యకు గురువగునో, ఆమెకు ఉపదేశముల నొనర్చు చుండునో, దానిచేత నింటిలో నొక విధమగు భయావరణ మేర్పడును. భార్యాభర్తలు హృదయపూర్వక

ముగ మాటలాడుకొన కుండినను, బరస్పరము విశుద్ధ హృద యముతో నిర్ముక్త హాస్యమొనర్ప కుండినను, పరస్పరము నవ్వులలో నొకరినొకరు కసరుకొనకుండిన వారి దాంపత్య జీవనము నీరసమైపోఁగలదు. మనశ్యామసుందరుఁడు గొప్పకౌతుక మొనర్చుచుండును. ఈతని ముఖమందు సర్వదా చిఱునవ్వు లొలుకుచుండును. ఆతఁడు నిద్రించుచుండఁగాఁ జూచినను నాతఁడు నవ్వుచున్నట్లు తోఁచుచుండును. మాటలాడుట యును నవ్వుచునే మాటలాడును. భోజనముచేయుచుండినను నవ్వుచునే యుండును. ఆతఁడు నిత్యప్రసన్నుఁడుగ నుండును. ఏడ్చుచుండినను నాతనిలో హాస్యమే దాగియుండును. అందు వలననే ఆతఁడు షోడశ సహస్ర ధర్మపత్నుల హృదయము లందు హారమై వెలయుచున్నాఁడు. రాణు లాతనితో నెల్ల ప్పుడును మాటలాడ నువ్విళ్ళూరు చుందురు. ఈతఁడును హృదయము ప్రఫుల్లమగునట్లు విచిత్రములగు గథలను జెప్పు చుండును. సత్యభామ కొంచెముగ మానిని. అందువలన నామెతో నాతఁడు చనువుగ మాటలాడు చుండును. ఆమెతో మాటలాడునపుడామెను మన్నించుటలో మాధవున కానందము కలుగును. అందులకే ఒక్క పారిజాత పుష్పము కొఱకై ఆతఁ డామె కొఱకు స్వర్గమునుండి పారిజాత వృక్షమును దెచ్చి, ఆమె దొడ్డిలో నాటెను. దాని సుగంధముచే ద్వారకాపురియంతయును సుగంధితము కాఁగ

లదు. శ్యామసుందరుఁడు సత్యభామనే యెక్కువగఁ బ్రేమించునని మిగిలిన రాణులందఱకును విశ్వాసము. సత్యభామకును ఈ విషయమున గర్వము కలదు. చూడుఁడు నా సంతోషమునకై నందనందనుఁడు నాకమునుండి నవ్య పారిజాత వృక్షమును దెచ్చి నా అంగణమున నాటినాఁడని ఆమె గర్వము.

తీపిదగ్గఱకు చీమలు చేరునట్లును, పుష్పము చుట్టును దుమ్మెద తిరుగునట్లును, ద్వారక చుట్టుప్రక్కలందు నారదుఁడు తిరుగుచుండును. అటునిటుఁబోయి మరల ద్వారకకు వచ్చుచుండును. ఆతని రాకపోకలు నిరంతరమును జరుగుచుండును. ఒక దినమున నారదుఁడు వచ్చి సూటిగా సత్యభామ యింటికిఁబోయెను. భగవానుఁడా సమయమున రాజసభకుఁబోయెను. సత్యభామ నారదునకు మిక్కిలి ఆదర సత్కారములను గావించి ఆతనిని సువర్ణ సింహాసనమునఁ గూర్చుండఁబెట్టెను. విధ్యుక్తముగఁ బూజించి సత్యభామ యిట్లనెను:—"స్వామీ! మీరు కృపతో దర్శన మొసంగితిరి. మీ దర్శనము ప్రాణిమాత్రుల కానందమును బ్రసాదించును. కాని స్వామీ! నా కొఱకు మీరు కేవలము సాక్షాత్తుగ మంగళ స్వరూపులు. మర్త్యలోక ప్రాణులకు దర్శన మర్ల. భమగు గల్పవృక్షము మీ యవ్యాజ కృపచేతనే మా యింటిలోఁ గల్పవృక్షము నాటఁబడినది. స్వయముగ సాక్షా

జ్జగదీశ్వరుఁడగు శ్రీకృష్ణునిఁ బతిగాఁ గలిగిన నాకంటె సౌభాగ్యవంతు లింకెవరుండఁగలరు? ఇంకను మర్త్యలోక మున నుండియును దేవతల గృహాంగణములందుండ వలసిన కల్పవృక్షము మాయింటి నుండిటయును, మా వంటి సాధు మహాత్ములు మాయందు బూర్ణానుగ్రహముంచుటయును నా సౌభాగ్యమే-స్వామీ? నేను మిమ్ముల నొక్కటి యడుగఁ దలఁచుచున్నాను. ఆజ్ఞయైనచో నడిగెదను.''

నారదుఁ డిట్లనెను:-''మహారాణీ! అడుగుము. నీవడి గినదానికి నేను బ్రత్యుత్తర మొసంగెదను.''

సత్యభామ యిట్లనెను:-''స్వామీ! నేనడుగ దలఁచిన దిది. నేను జగదీశ్వరుఁడగు శ్యామసుందరునిఁ బతిగాఁ బడయుటకు బూర్వజన్మమున నే నేమిపుణ్యము నొనర్చితినో కదా! అదియును కాక జన్మజన్మాంతరములందును నా భగ వాను నే పతిగాఁ బడయుటకై యిప్పుడు నే నేమివ్రతము లేక కర్మ నొనర్పవలయునో?''

ఇది విని నారదుఁ డిట్లనెను :- ''పూర్వజన్మమున నీవు తులాపురుష దాన మొనరించితివి. దాని ఫల స్వరూప ముగ నీకీ పురాణపురుషుఁడగు ప్రభువు పతిరూపమున లభించినాఁడు. నీవిప్పుడును నీ ప్రభువును దూచి, యీతనికిఁ దుల తూగు ధనమును రత్నదానము లొనర్చినచో, నీ కీతఁడే పతిగాఁ గలఁడు. ఈతనికిని నీకును నెన్నటికిని వియో గము సంభవింపదు,''

ఇది విని అత్యంతానందమును బ్రకటించుచు సత్యభామ యిట్లనెను :- ''నారదా! నీవు నాకు చాల ఉత్తమమగు విషయమును జెప్పితివి. మా యింట రత్నములకును, ధనమునకును గొదువ లేదు. నేను నేఁడే తులాదాన మొసంగెదను. కాని ఒక్క చిక్కున్నది. అపాత్ర కొసంగిన దానము నిష్ఫలమగుటయే కాదు. అట్లొసంగిన వారికి దోషమును సంభవింపఁ గలదు. మఱుసటి జన్మమున నాతఁడు దరిద్రుఁడగును. దరిద్రుఁడైనచో నాతఁడు పాపమునందు బ్రవృత్తినిఁ జెందును. పాపమును జేయుటచే మరల మరల దరిద్రుఁడగును. మరల మరలఁ బాపము లొనర్చుచుండును. అందువలన దానమునకు సత్పాత్ర అత్యంతావసరము కాఁగలదు. దైవ వశమున దయచేసితిరి. నీ కంటె సత్పాత్ర నా కెచ్చట లభింపఁగలదు? దయచేసి నీవు నా తులాదానమును స్వీకరించినచో నా కోరిక నెఱవేరఁ గలదు.''

నారదుఁ డిట్లనెను :-''మహారాణీ! నేను దక్షిణలను గొనిపోవుటకు రాలేదు; కాని నీవు కాదనినచో, బలవంత మొనర్చినచో అట్లే తీసికొందును. సాధువుల శరీరము పరోపకారము కొఱకేకదా! కావున నన్నియును సిద్ధమొనర్చుకొనుము.''

ఇది వినఁగానే సత్యభామ యొక్క ఆనందమునకు మేఱ లేకుండెను. ఆమె యుత్సవమును గూర్చి ఆలోచించెను.

ఇంటిలోఁ దోరణ పతాకములను గట్టించెను. మేళతాళము లన్నియును వాయింపఁ బడుచుండెను. ఇంతలోనే భగవానుఁ డచ్చటికి వచ్చెను. భగవానుఁ డిట్లడిగెను :- ఏమిది, నేఁడేమి జరుగుచున్నది? ఇది ఏయుత్సవము ?"

సత్యభామ యిట్లనెను :- "స్వామీ! నేను నేఁడు దాన ధర్మము లొనర్ప దలఁచుచున్నాను."

కృష్ణుఁ డిట్లనెను :- "నేఁ డేమియును బర్వము పండుగు కాదే. ధర్మములు, దానములు చేయవలయునను గోరిక యెట్లు కలిగినది ? ఇంతలోనే పెద్ద బొట్టును ధరించి, వీణను భుజమునకుఁ దగిలించుకొని నారదుఁడు కనఁబడెను. పక పక నవ్వుచు భగవానుఁ డిట్లనెను :- "హాహాహా! వాహా! నారదుఁడు వచ్చి నాఁడా యేమి ? ఇవ్వేళ ఉత్సవమేమా యని నే ననుకొనుచుంటిని. వైద్యునిఁ జూడఁగనే రోగము లేకపోయినను రోగులు ప్రత్యక్షమగుచుందురు. ఏవైన నంద మైన వస్తువు లమ్ము వారు కనఁబడిరా, అవసరము లేకపో యినను స్త్రీలు వానినిఁ గొనిపోవుచుందురు. మంచి తినుబండారములును, రుచి గలుగు వస్తువులు వచ్చినచో నాఁకలి లేకపోయినను జనుల కాకలివేయును. అదే విధ ముగ బ్రాహ్మణులు వచ్చినచో నుత్సవ పర్వము లేమియు లేకున్నను క్షణక్షణమును నుత్సవ పర్వము లేర్పడును. దాన ధర్మములు చేయవలయునను ప్రవృత్తి కలుగును."

నవ్వి నారదుఁ డిట్లనెను :- "స్వామీ! మీా యింటి నుండియును మేము రిక్త హస్తములతోఁ బోయినచోఁ బ్రపంచమున మమ్ముల నడుగువారే యుండబోరు. లోకులు మా వెంటఁబడి గేలిచేయుదురు. మేము మీా వెంట గంతులిడుచు, నిర్భయులమై తిరుగుచుందుము. మీాకు బ్రహ్మణ్య దేవుఁడను బేరు కలదుకదా! మీారు గోబ్రాహ్మణుల హితము కొఱకు ధరపై నవతరించుచుందురు."

ఇది విని నవ్వుచు భగవానుఁ డిట్లనెను :- "నారదా! నీ పనికి నే నడ్డమురాను. నీ యజమానిని కడ కొల్లగొట్టుకొనుము" అని పలికి అచ్యుతుఁడు తన విశ్రాంతి గృహము లోనికిఁ బోయి కూర్చుండెను. అన్నిటిని సిద్ధమొనర్చి సత్యభామ వచ్చి యిట్లనెను :- "స్వామీ! నేను మీా కభ్యంగన స్నాన మొనరింపఁ జేసెదను."

భగవానుఁడిట్లనెను :- "దానమొసంగెదవా? నా కభ్యంగన స్నాన మెందులకు? దానమొసంగు దానవునీవు, పుచ్చుకొనువాఁడు నారదుఁడు. నన్ను మధ్యలోఁ జలిలో నేల బాధించెదవు?"

సత్యభామ యిట్లనెను:- "స్త్రీ భర్తలేక దానపుణ్యాదు లెట్లు చేయగలదు."

నవ్వి భగవానుఁ డిట్లనెను :- "నారదుఁడు స్త్రీ కాదు కదా! ఆతఁడును బురుషుఁడే"

సత్యభామ విదిలించుకొని యిట్లనెను:- "మీకెల్ల ప్పు డును బరిహాసములే. ఱెంకు, ఱెంకు చాల ప్రౌఢ్దిక్కినది."

కృష్ణుఁడు నవ్వుచు వెడలెను. సత్యభామ స్నానాదులను జేయించి, ఆతని నొక సుందరమగు నాసనమునఁ గూర్చుండఁ బెట్టెను. విధ్యుక్తముగ నాతనిఁ బూజించెను. అంతఁ ద్రాసులోఁగూర్చుండఁ బ్రార్థించెను. కృష్ణుఁడిట్లనెను:- "నేను ద్రాసులోఁ గూర్చుండుటెందులకు? తూచువాఁడు తూచువస్తువును ద్రాసులోఁ బెట్టునట్లు నన్నెత్తుకొనిపోయి త్రాసులోఁ గూర్చుండబెట్టుము."

సత్యభామ యిట్లనెను:- "ఇప్పుడు మిమ్మెవరెత్తఁ గలరు? మిమ్ము నెత్తుట అట్లుంచి, ఎత్తుట కూహింపనైన నూహింపఁజాలరు."

కృష్ణుఁడిట్లనెను:-"మీ తండ్రి మామీఁద మణిని దొంగిలించిమనుతి దోషము నాపాదించినాఁడు. ఆయన యూహాలో మేము ధనలోభులమైతిమి."

కోపముతో సత్యభామ యిట్లనెను :- "మీరు మరల పాతసంగతుల నెత్తుచున్నారు. మా తండ్రి చేసినది పొర పాటు మానవులకు పొరపాట్లుండును."

భగవాఁడిట్లనెను :-"అది పొరపాటుకాదు. మంచిదే యైనది. ఆతఁడా కళంకము నాపాదింపకుండిన నీవు నాకెట్లు లభించియుందువు? అట్లు కాకున్న నీవు కృతవర్మకో, శత

ధన్యునకో, అక్రూరునకో పత్ని వయ్యేదు దానవు. నీ దర్శ
నమే దుర్లభమయ్యెడిది. మమ్ముఁజూడఁగనే మేలిముసుఁ
గును వేసుకొనెదు దానవు.''

చిరుకోపముతో సత్యభామ యిట్లనెను :-''మీరెల్ల
ప్పుడును లేనిపోని మాటల ననుచుందురు.పదండి, నాకాలస్య
మగుచున్నది. నేను నీచేతులు పట్టుకొందెను. నారదున
కాలస్యమగు చున్నది.

భగవానుఁడు నవ్వుచునిట్లనెను :-''నారదున కాలస్య
మగుచో నారదుఁడే యెత్తవచ్చును. ఇందాతని స్వార్థమును
గలదు కదా! నీవు దానమును జేయుదానవు, ఆతఁడు దాన
మును గ్రహించువాఁడు. నేను తూచఁబడువాఁడను గదా!
నీకు పుణ్యము లభించును. నారదునకు ధనము లభింపఁగలదు.
నాకేమున్నది ?''

నారదుఁడిట్లనెను:- 'స్వామీ! ఒకవేళ సత్యభామ
యెత్తగలదేమో కాని అది నావలన నగునదికాదు.
నేనిచ్చట కెత్తుటకును ధరించుటకును రాలేదు. ఏదైన దాన
దక్షిణలు దొరికినచోఁ దీసికొని పోయెదను. లేకున్న జయ
జయ సీతారామయని వెడలిపోయెదను. నేను నావీణను జం
కను వేసికొని పొయెదను.''

సత్యభామ యిట్లనెను : ''స్వామీ! చాల పరిహాస
ములు జరిగినవి. పదండి. వేళ చాల మించినది.''

ఇది విని కృష్ణుఁడు నవ్వుచు త్రాసులో నొకప్రక్కనఁ గూర్చుండెను. త్రాసు రెండవ ప్రక్కపైకి లేచిపోయెను. శ్యాముఁడు కూర్చుండిన త్రాసు నేలకంటుకొనెను. సత్యభామ రెండవత్రాసులో సువర్ణ మణి, రత్న మాణిక్యముల నెన్నింటినో తెచ్చియుంచెను. కాని కృష్ణుఁడు కూర్చుండిన త్రాసు కదలనే లేదు. ఇప్పుడు సత్యభామ చాల చింతలోఁ బడిపోయెను. ఆమె తన ఆభరణముల నన్నిటిని దీసి అందుంచెను. కాని అంతయును వ్యర్థమయ్యెను. ఇంటిలోఁగల నన్నివస్తువుల నందుంచెను. ఆమె కిప్పుడు చాల దుఃఖము కలిగెను. కృష్ణుఁడు నవ్వుచు నిట్లనెను:-"రాణి దివాలా తీసినది" దీనిచే నామె యింకను లజ్జిత యయ్యెను. అంత నామె యిట్లనుకొనెను:- "ఈ కల్పవృక్షమును నాదే కదా! దీనినందేల వేయరాదు?" అని యాలోచించి ఆమె కల్పవృక్షము సమీపమునకుఁబోయి, దానినిఁ బ్రార్థించెను. అప్పుడు మెదలక నారదుఁడు వచ్చి యిట్లనెను:-"మహారాణీ! నీవిట్టి కల్పవృక్షములను లక్షవైచినను త్రాసు లేవదు. అనంతకోటి బ్రహ్మాండము లుదరమున నున్నవాని నేవస్తువుచేఁ దూచఁగలవు? ఈతనిని భక్తుఁడే వశమొనర్చుకొనఁగలరు. కావలె ననిన నేనొక యుపాయమును జెప్పెదను. వెంటనే త్రాసుపైకి లేచును."

సత్యభామ యిట్లనెను :- "అయ్యో! నారదా! నీ వింతవఱ కా యుపాయము నేల చెప్పలేదయ్యా? చెప్పు మయ్యా చెప్పుము. నా సంకటమును దూర మొనర్పుము."

నారదుఁ డిట్లనెను :- "నీ వొక్కపనినిఁ జేయుము. ఒక్క తులసీదళముపైఁ గృష్ణనామమును వ్రాసి, యీ త్రాసునం దుంచుము. త్రాసేల పైకిలేవదో చూతము. కృష్ణుఁడుండిన త్రాసు పైకిలేచును. నామముతోఁ గూడిన తులసీదళ ముండినవైపు క్రిందకు బోఁగలదు. తులసి భగ వానునిఁ దనవశ మొనర్చుకొనినది. నీవు ఛప్పన్నారు పిండి వంటల నైవేద్యమిడినను వానిమీఁదఁ దులసీదళము నర్పింప కుండిన భగవంతుఁడు దానిని స్వీకరింపఁడు."

ఇది వినఁగానే సత్యభామ సంతోషమునకు మేఱలే కుండెను. ఆమె తులసీదళముమీఁద కృష్ణనామమును వ్రాసి దానియం దుంచెను. చూచుచుండఁగనే భగవానుఁ డుండిన త్రాసు పైకిపోయెను. తులసీదళముండినది క్రిందకుఁబోయెను. అప్పుడు సత్యభామ యిట్లనుకొనెను :- "నే నింతవఱకు భగ వానునకు నేనే ప్రియురాలి ననుకొనుచుంటిని. ఇది నా మిథ్యాభిమానమే కాఁగలదు. యథార్థమునకు హరిప్రియ తులసియే."

దీనినిఁగాంచి భగవానుఁడు నవ్వి యిట్లనెను :-"యజ మానిని, పురోహితుఁడును ఇద్దరును గలిసి నన్నోడించిరి."

నారదుఁ డిట్లనెను :-'స్వామీ! మీ రపరాజితులు. మీ రెవ్వరికిని నోడరు. కాని నీ కనన్యభక్తులగు వారికడ మీకుమీరే ఓడిపోవుదురు. ఇది మీకుగల సనాతన స్వభావము.' ఇట్లు పలికి నారదుఁడు వెంటనే త్రాసులోనుండి తన ధనమును ప్రోవుచేసికొని; పొట్లముకట్టుకొని, తన చంకలోఁ బెట్టుకొని వెంటనే బ్రహ్మలోకమునకుఁ బోయెను. తరువాత నొక్కక్షణమైనను నాతఁడచ్చట నిలువలేదు. బ్రాహ్మణుఁడు తన దక్షిణ తనకు దొఱకిన తరువాత నిలుచుట వ్యర్థము.

నారదుఁడు వెడలిపోఁగానే సత్యభామ భగవానుని చరణకమలములకుఁ బ్రణామమును గావించి, అనురాగ భరితదృష్టితో శ్యామసుందరుని వైపునకే చూచుచుండెను. కృష్ణుఁడును నామె నత్యంత ప్రేమతోఁ జూచుచుండెను. ఆతఁడు నవ్వుచు నిట్లనెను :- 'ఏమి యాలోచించుచున్నావు ప్రియా!'

ప్రేమాశ్రువులను దుడిచికొనుచు సత్యభామ యిట్లనెను :-'ప్రభూ! పూర్వజన్మమున నే నేమి పుణ్యముల నొనర్చి, వాని ఫలస్వరూపముగ నేను పరమేశ్వరునిఁ బతిగాఁ బొందితినో యని యాలోచించుచున్నాను. నాథా! స్వామీ! నేను బూర్వజన్మమున నెవతెనో చెప్పుఁడు. నే నింతటి సౌభాగ్యశాలి నగుట కేమి పుణ్యమొనర్చితినో గదా!

మర్త్యలోకములో నున్నను నే పుణ్యప్రభావముచే నా యింటి లోనికిఁ గల్పవృక్షము వచ్చినది ?'

ఇదివిని భగవానుఁ డిట్లనెను :- "ప్రియా! పూర్వ జన్మమున నీవు భగవన్మందిర సమ్ముఖమున నొక తులసీ వృక్షమును నాటితివి. ఆ పుణ్యకారణమున నీ యింటిలోఁ గల్పవృక్షము నాటఁబడినది. ఎల్లప్పు డుండఁగలదు."

అంత సత్యభామ యిట్లనెను :- "నేను పూర్వజన్మమున నెవతెను ? నే నింతటి సౌభాగ్యశాలిని యగుటకు నే నేమి శుభకర్మ లొనర్చితిని ?"

ఇది విని భగవానుఁడు కొంచెము మౌనముగనుండి యిట్లనెను :- "ప్రియా! వినుము. నీ సుకృతమును గూర్చి చెప్పెదను. కృతయుగాంతమున కనఖల (హరిద్వార) ప్రాంతమున దేవశర్మయను బ్రాహ్మణుఁడు కలఁడు. ఆతఁడత్రికులమునఁ బుట్టినాఁడు. సమస్త వేదవేదాంగములందు పాండిత్యమును సంపాదించియుండెను. నిత్యమును నియమముతో నగ్నిహోత్ర మొనర్చుచు, సదా గాయత్రీజప తత్పరుఁడుగ నుండెను. త్రికాలములందు శ్రద్ధాభక్తులతో సూర్యున కర్ఘ్య మొసంగుచు, సూర్యనారాయణ వ్రతము నొనర్చుచుండెడి వాఁడు. ఆతనికడ నున్న విద్యార్థులగు బ్రహ్మచారులకు బాగుగాఁ బ్రేమతో విద్యను గఱపెడువాఁడు. ఆతని ధర్మపత్నియును సతీసాధ్వి, ధర్మపరాయణ. ఇద్దఱకును బరస్పర

ప్రేమకలదు. కాని వారికి సంతానము లేదు. ఆతని కిదే దుఃఖము, కాని యిది దైవేచ్ఛయని భావించి సంతోషమును జెందుచు, ధర్మకర్మలయందు లగ్నమై యుండెడువాఁడు. భక్తుల హృదయమందు కోరిక పుట్టుటయు నది నెఱవేరక పోవుటయు నసంభవము. అది శీఘ్రముగనైన నెఱవేర వచ్చును. లేక ఆలస్యముగనైన నెఱవేరవచ్చును. ఈ జన్మములోనైనఁ గావచ్చును, రాఁబోవు జన్మమున నైనఁ గావచ్చును. భగవంతుఁ డాతని కెట్లు చేసిన మేలో అట్లు నెఱవేర్చును. వృద్ధావస్థలో దేవశర్మయొక్క కోరిక నెఱవేరెను. ఆతనిభార్య ఒక ఆడపిల్లను గనెను. పిల్ల అమితసుందరి. తల్లిదండ్రు లామెను గాంచి మిక్కిలి యానందమును జెందుచుండిరి. వారామెను ప్రాణములతో సమానముగఁ బ్రేమించుచుండిరి. మిక్కిలి జాగ్రత్తతో నామెను బెంచుచుండిరి. తండ్రి ఆమెకు గుణవతియను పేరిడెను. గుణవతి వాస్తవమునకు రూపగుణనిలయ. శుక్లపక్షశుపాకరుని వలె నామె దేవశర్మ యింటిలో దినదినప్రవర్ధమానముగఁ బెరుగుచుండెను.

మునికిఁ జాలమంది శిష్యులుండిరి. అందులోఁ జంద్రుఁ డను శిష్యుఁడొక్కఁడుండెను. ఆతఁడు మిక్కిలి సుందరుఁడు, సుశీలుఁడు, మేధావి, ధర్మాత్ముఁడు. ఆతఁడు శ్రద్ధాభక్తులతో గురుని సేవించుచుండెను. ఆచార్యుఁడును నాతనిఁ

బుత్రునివలెఁ బ్రేమించుచుండెను. గుణవతి వివాహయోగ్య కాఁగానే ఆమె తండ్రి భార్యతో నాలోచించి తమపుత్రిక నాతని కొసంగి వివాహమొనర్చెను. ఇద్దరును యువావస్థలో నుండిరి. ఇద్దరును సుందరులే. సుశీలురే. ఈ వివాహము వలనఁ దల్లిదండ్రులకు మిక్కిలి యానందము కలిగెను. చంద్రుఁడును తన యదృష్టమును గూర్చి ప్రశంసించుకొను చుండెను.

వివాహమైన మఱునాఁడు ఆచార్యుఁడగు దేవశర్మ తనప్రియశిష్యుఁడు లేక అల్లునితోఁ గలిసి ఫల, మూల, కుశ, సవిధాదులను గొని వచ్చుటకై వనమునకుఁ బోయెను. వారు కుశలను దెచ్చికొనుటకై హిమాలయములకు క్రింద గహనవనమందు గంగాతీరముననే పోయిరి. ఆ ఘోర వనమున వారికి కాలునివలె నున్న నొక భయంకర రాక్షసుఁడు కనఁబడెను. వానినిఁ గాంచి వీరిద్దరును బరువిడిరి కాని తప్పించుకొనఁజాలక పోయిరి. రాక్షసుఁడు వీరినిఁ గొట్టఁగా నిద్దరును మరణించిరి.

ఇద్దరును ధర్మాత్ములు. ఇద్దరు నుపాసకులు ఇద్దరును గంగాతీరమునఁ గుశావర్తక్షేత్రమున మరణించిరి. అందు వలననిద్దరకును వైకుంఠము లభించెను. వారిద్దరును విష్ణువునకుఁ బ్రియపార్షదులై వైకుంఠమున నివసించుచుండిరి. విష్ణు, శివ, శక్తి, సూర్య, గణపతులను నీ యైదుగురు నొక్కరే.

ఒకే భగవంతుఁడు భక్తులకొఱకై అయిదురూపములతో వ్యక్త మగుచుండును. వీరిలో నెవరి నుపాసించినను సద్గతిప్రాప్తిం చును. సూర్యోపాశన మొనర్చిన దేవశర్మకును వైకుంఠ లోకము ప్రాప్తించినది.

ఈ విషయమును గుణవతి వినఁగానే శోక సంతప్తయై మూర్ఛను జెందెను. ఆమెకుఁ బ్రపంచమంతయును శూన్య ముగఁ దోచెను. ఆమె బిగ్గఱగఁ గేకవైచి కురరీపక్షివలె నేడ్వ నారంభించెను. ఆమె తల్లి ఆమెకు ధైర్యమును జెప్పు చుండెను గాని ఆమె కేమియును దోచకుండెను. స్త్రీలకు వైధవ్యమునకు మించిన దుఃఖము లేదు. బాల్య వైధవ్యము కలిగి, పతిముఖమును జూడని దాని దుఃఖమును గూర్చి యింకఁ జెప్పవలసిన దేముండఁగలదు? చెప్పవలసిన పనియే లేదు.

గుణవతి ధైర్యమును ధరించెను. అమె యింటిలోఁ గల పాత్రాది సామగ్రులు నమ్మి తండ్రికిని, భర్తకును శ్రాద్ధాది క్రియలొనర్చెను. అంతఁ బరమేశ్వరునే తన పతిగా భావించుచు నాతని నారాధించుచుండెను. కొంత కాలమునకామె తల్లియును నీ లోకమును వీడిపోయెను. ఇప్పుడీమె ఒంటరిగా నుండెను. ఆమె గ్రామమును వీడి యెచ్చటికినిఁ బోయియుండలేదు. అచ్చటనేయుండి యామె నాభక్తితో జీవితమును వెడల బుచ్చుచుండెను.

శ్రీకృష్ణభగవానుఁడు సత్యభామతో నిట్లు చెప్పు చుండెను :- "ప్రియా ! విధవయగుట చాల గొప్ప దౌర్భాగ్యవిషయము. విధవయై తన మనస్సును బోఁగొట్టు కొనిఁ విషయభోగములలోఁబడియుండినచో నామెకు ఉద్ధారము కలుగుట మిక్కిలి కష్టము. ఏలననఁగా స్త్రీలుకానిండు, పురుషులుకానిండుఘోరసాధన చేయనిది విషయములనుమఱచుటసంభవింపదు. మృత్యుసమయముననే యే పురుషులవలన నేమేమి చేయఁబడినవో అవన్నియును మరణ సమయమున జ్ఞాపకమునకు రాఁగలవు. మరణసమయమున నేది జ్ఞాపకమునకు వచ్చునో, అవశ్యమట్టి జన్మము లభించి తీరును. ఈ విధముగ నట్లు విషయములలోఁ బడినది మఱు జన్మమున వేశ్యగనో, వ్యభిచారిణిగనో కావలసివచ్చును. అందువలన వైధవ్యమునకు మించి స్త్రీల కింకొక దౌర్భాగ్యమేమి యుండఁగలదు ? కాని యీ దౌర్భాగ్యమును సౌభాగ్యముగఁ బరిణమింపవచ్చును. ఎప్పుడు ? ఆ విధవ తన మనస్సును భగవంతునిపై లగ్నము చేసినప్పుడే, ఆతనిఁ జింతించుచు, నాతని కొఱకై వ్రతోపవాసము లొనర్చుచు, నాతని సేవలోనే సదా సంలగ్నమైనపుడే ఇట్లుచేసిన విధవ మఱల నెన్నటికిని విధవ కాదు. ఆమె యెల్లప్పుడును సౌభాగ్యవతిగనే యుండును. ఆమె అమరుఁడను, అవినాశినగు నన్నే పొందును గుణవతి తన దౌర్భాగ్యమును

సౌభాగ్యరూపమునఁ బరిణితయయ్యెను. ఆమె నిరంతరము నన్నే చింతించుచుండెను. ఆమె పరపురుషునితోఁ బొరపాటుననైన మాటలాడదు. ఇంటిలో యుండి యామె భజన పూజనములందుఁ దన కాలమును గడుపుచుండెడిది. ఆమె సాధారణముగ నన్ని వ్రతములను జేసియుండెను; కాని జీవితములో నామె రెండు వ్రతములను వదలలేదు. ఒకటి ఏకాదశి వ్రతము, రెండవది కార్తీకవ్రతము, ఆమె రెండు పక్షములందలి ఏకాదశీవ్రతము లొనర్చెడిది. దశమీ దినమున నామె ఒక్కపూట తేలికగ నాహారమును గైకొనెడిది. ఏకాదశియందు నిర్జలోపవాసమును, ద్వాదశినాఁడు బ్రాహ్మణునకు భోజనమునుబెట్టి పారణమొనర్చుచుండెడిది. ఆమె ఏకాదశీదినము రాత్రియంతయు జాగరణమొనర్చి ద్వాదశీదినమునను పగలు నిద్రించెడిది కాదు. ఈ విధముగ కార్తీకమాసము రాఁగానే ఆమె సూర్యోదయమునకుఁ బూర్వమే గంగకుఁబోయి స్నానమొనర్చి, తులసీపూజన మొనర్చి, దీపదానమొనర్చెను. ఒంటిపూట ఉప్పులేని హవిష్యాన్నమును దినుచుండెడిది. ఈ వ్రతములను జేయుచుండ నామెకు వృద్ధావస్థ ప్రాప్తించెను. అయినను నామె ఏకాదశీవ్రతమును గార్తీకవ్రతమును వదలలేదు.

నియమానుసారముగఁ గార్తీక మాసము వచ్చెను. శుక్లదశమీ దినమున నామెకు కొంచెముగ జ్వరము తగి

లెను. అయినను నామె ఏకాదశీదినమున గంగకు స్నానము నకుఁ బోయెను. కార్తీకమాసములో నెక్కువగ మంచు పడుచుండును. పైఁగా హరిద్వారమున గంగాజల మధిక శీతలముగ నుండును. జ్వర కారణమున నామెకు శీతము వచ్చెను. కాని యామె కార్తీక స్నానమెట్లు వదులఁగలదు? కఱ్ఱ యాధారమున నామె గంగాతీరమునకుఁ బోయెను. ఆమె శరీరము శీతముచేఁ గంపించుచుండెను. ఆమె బొడ్డు లోతు నీటిలోనికిఁ బోయెను. ఆ సమయమున నాకాశము నుండి ప్రకాశమయమగు నొక విమానము వచ్చుచుండెను. దానిలో భగవానుని పార్షదులు చతుర్భుజములతో వచ్చు చుండిరి. విమానముపై గరుడధ్వజముండెను. దానిని జూడఁగనే గుణవతి అది భగవానుని విమానమని గ్రహించెను. ఆమె తలను వంచి విష్ణుపార్షదులకుఁ బ్రణామమును గావించెను. పార్షదులామెను విమానముపైఁ గూర్చుండు మనిరి. ఆమె తన పాంచభౌతిక శరీరమును గంగయందే వదలి, దివ్యరూపమును ధరించి, అగ్నిశిఖవలె జాజ్వల్య మాన రూపముతో నప్సరలచే సేవింపబడుచు విష్ణులోకమును బొందెను. ఆమె జీవితకాలమంతయును నన్నే చింతించు చుండెడిది. నా కొఱకై ఏకాదశీ కార్తీకవ్రతముల నొనర్చినది. అందువలన నామెకు నా సన్నిధి లభించినది.

భూభారము కాఁగా బ్రహ్మాది దేవతలు భూమిపై నవతరింపవలయునని నన్నుఁ బ్రార్థించిరి. నేను నాగణము లతో నవతరించితిని. దేవశర్మయును, చంద్రుడును నాలోక మున నాకు పార్షదులై యుండిరి. నే నవతరింపఁగనే వీరంద ఱును శరీరములను ధరించిరి. ఆ దేవశర్మయే నీతండ్రియగు సత్రాజిత్తైనాఁడు ఆ చంద్రుడే అక్రూరుఁడైనాఁడు. ఆ గుణ వతివే నీవు. నీవు నన్ననన్యభావముతో నారాధించితివి కావున నాకు పత్నివైతివి. ఇప్పుడు నీవు నీసేవలచే నన్ను వశము చేసికొంటివి. అందువలన నిఁక శాశ్వతముగ నాదా నవే. ఇఁక నెన్నటికిని నీవునాకు దూరము కాఁబోవు. ప్రియా! ప్రపంచమున నాకొఱకై కర్మల నెవరు చేయుదురో, వారిని నే నక్షయుల నొనర్చెదను. నీవు నాద్వారమునఁ దులసినిఁ బెంచితివి. ఆ ఫలమున నీకక్షయమగు గల్పవృక్షము ప్రాప్తించి నది. నీవు కార్తీక మాసమున దీపదానమొర్చుటచే, దాని ఫలస్వరూపముగ నీకక్షయ లక్ష్మి ప్రాప్తించినది. నీయిల్లు సదాధనధాన్యములతో నిండియుండును. నీవు జీవితమంత యును నన్నుఁ బ్రేమించితివి. నీవు చేసిన వ్రతోపవాసము లను నాకర్పించితివి. ఆ ఫలముచే నీవు నాకు బత్నివైతివి. నీవు జీవితాంతమువఱకు వ్రతము విచ్ఛిన్నముగ జరిపితివి. అందువలన నీకఖండైశ్వర్యమును, సౌభాగ్యమును బ్రాప్తించి నది. యజ్ఞ, యాగ, జప తప, దాన, వ్రతాది పుణ్యము

లేవియును కార్తీక వ్రతమునకును, ఏకాదశీవ్రతమునకును గొఱకావు.''

ఇది విని సత్యభామ యిట్లనెను :-''స్వామీ ! మీరు చాల అద్భుతమగు విషయమును చెప్పితిరి. ఒక్కొక్కప్పుడు మీరు పరిహాసము లొనర్చుచుండిన నాకు విసుగు పుట్టుచుండెడిది. మఱియొకప్పు డిట్టి అద్భుత విషయములను జెప్పుచుండిన నాకానందము కలిగి శరీరము పులకరించుచుండును. సరే, ఒక్క విషయమును చెప్పుఁడు. కార్తీక మాసమునకును, ఏకాదశికిని నిట్టి మాహాత్మ్య మేల వచ్చినది ? ఈ వ్రత మొనర్చువారి యెడల మీరు గాని, దేవతలు గాని యేల ప్రసన్నులగుచుందురు ?''

భగవానుఁ డిట్లనెను :- ''ఈ విషయమున నొక ఇతిహాసముకలదు. దానినిఁ జెప్పెదను వినుము. ప్రాచీన కాలమున శంఖాసురుఁ డను నొక దైత్యుఁడుండెడు వాఁడు. ఆతఁడు మిక్కిలి బలవంతుఁడు. దేవతలను స్వర్గమునుండి దేవతల నందఱను వెడలఁ గొట్టెను. ఆతఁడే సమస్త దేవతా కార్యముల నొనర్చుచుండెను. దేవతలందఱును శరణార్థులై భూమిపై నటు నిటుఁ దిరుగుచుఁ గాలమును గడుపుకొనుచుండిరి అప్పుడు దైత్యుఁ డిట్లాలోచించుకొనెను:-''ఇప్పుడు నేను దేవతలను జయించితిని. కాని వారెచ్చట బలవంతులైరో, వారచ్చటకు వచ్చిస్వర్గముపై నధికారమును వహించె

దను. అప్పుడు నన్నుఁ దఱిమివేయుదురు. వీరు బలవంతు
లగుటకు గారణము యజ్ఞయాగాదులే. అవన్నియును వేద
ముల ద్వారా జరుగుచుండును. నేను వేదములను నాశ
మొనర్పవలెను. వ్రేళ్ళు నరకఁబడుచో నింక శాఖలెట్లు
విస్తరింపఁ గలవు.'' అని యాలోచించి ఆతఁడు సత్యలోక
మునకుఁ బోయెను. నే నప్పుడు క్షీరసాగమున శయనించి
యుంటిని. తమ్ము నేను నాశన మొనర్చి దుర్గతినిఁ గలిగింపఁ
గల నేమోనని, అవి వేఱు వేఱై జలములలో దాఁగెను.
దైత్యుఁడు జలములలోనికిఁ బోయి వానిని వెదుక నారంభించి
పాతాళము వరకు పోయి వెదుకు చుండెను. ఇంతలో సమ
యము చూచుకొని దేవతలందఱును గలిసి నావద్దకువచ్చిరి.
నేను నిద్రించుచుంటిని. వారు శంఖ, ఘంటా శబ్దము లొన
ర్చుచు 'జయజయ' శబ్దము లొనర్చుచుండిరి. అప్పుడు నేను
గన్నులను దెఱచి 'ఏమది'' యని యంటిని. అందఱును భయ
ముతో నిట్లనిరి :- ''స్వామీ! శంఖాసురుఁడు చాల యుప
ద్రవ మొనర్చుచున్నాఁడు, దయచేసి నిద్ర నుజ్జగింపుఁడు.''

నే నిప్పుడేమి నెల యని అంటిని.

దేవతలు కార్తీక మాసమనిరి.

మరల నేను తిథి యే మంటిని?

అందఱును శుక్ల ఏకాదశియనిరి.

భగవానుఁ డిట్లనెను :- "సరే, నేఁటినుండి యీ ఏకాదశి హరి ప్రబోధినీ ఏకాదశి కాఁగలదు. దీనిలో సాయంకాల సమయమున శంఖ ఘంటాదులనెవరు వాయించి నన్ను లేపుదురో వాని కన్నియు సమృద్ధిగనుండఁ గలవు. నేఁటినుండి కార్తీకము, ఏకాదశి శ్రేష్ఠము కాఁగలవు. ఈ వ్రత మొనర్చినవారు నాకు ప్రియులగుదురు."

ఇట్లు పలికి నేను సమీపమున నుండిన దేవతలతో నిట్లంటిని :- "దేవతలారా ? ఈ విషయమును గుర్తించు కొనుఁడు. నేఁటినుండి నేనొక నెల కార్తీక మాసమంత యును, జలములలో నుందును. మీరందఱును నా వెంట నుండవలయును. ఈ వేదము లన్నియును నంగములతో జల ములలో లుండఁగలవు. స్త్రీపురుషులు సూర్యోదయమునకు జలములందు స్నాన మొనర్చెదరో, వారి సమస్త మనోరథ ములు పూర్ణములఁగును."

అంత నేను వేఱువేఱు దేవతలను బిలిచి యిట్లంటిని: "దేవరాజా! ఎవరు కార్తీక స్నాన మొనర్చెదరో వారు శరీరమును వీడినతరువాత నాలోకమునకు జేర్చవలయును, వరుణా! వారడుగకుండినను వారికిఁ బుత్ర పౌత్రాదుల నొసంగ వలయును. మఱవవలదు." "కుబేరా! నీవును వినుము. ఇట్టి స్నానమొనర్చువారికి ధనలోపమును గావింప వలదు. తెలిసినదా?" యమ ధర్మరాజా! నీవు జాగ్రత్తగా

నుండవలెను. కార్తీక స్నానమొనర్చు వారినిఁ గటువచన ములను బలుకవలదు. వారిని లేచిపోయి ఆదరింపవలెను.'' అని యిట్లందఱ నాజ్ఞాపించి మత్స్యరూపమును ధరించిజలము లలోఁ బ్రవేశించితిని. శంఖాసురునిఁ జంపి వేదముల నుద్ధ రించితిని.''

అంత సత్యభామ యిట్లనెను.– ''స్వామీ! మీరు మత్స్యరూపమును ధరించితిరా? నానారూపములను ధరించి నారే!''

కృష్ణుఁ డిట్లనెను:– ''వేఁపరూపమేమి? తాఁబేలు, పంది, సింహము మొదలగు రూపముల నెన్నిటినో ధరించి తిని. నాభక్తులు దేనినిఁ గోరుదురో ఆయా రూపముల నన్నిటిని ధరించెదను. చాలమంది అసురులు సమస్తమును శరీరమే అనుకొనుచుందురు. ''వేదములు లేవు. యజ్ఞములు లేవు, దానాదులు లేవు, ధర్మమును లేదు. ఉన్నదేమో శరీరమే. దీనిని బాగుగాఁ బోషించుకొని సుఖముగ నుండ వలయు ననుచుందురు. వారికి నేనట్లే అయి అట్టి యుప దేశమునే యొసఁగుచుందును. వేదములను, యజ్ఞ, దాన, ధర్మాదులను ఖండించెదను. సమస్తమును శరీరమే కావున ''ఋణం కృత్వాఘృతం పిబేత్ అప్పుచేసి (నేయి తాగు) పప్పుకూడు తిను.'' అని చెప్పుచుండెదను. సారాంశ మేమనఁగా నాకే రూపమును ధరించుటకును సంకోచము

లేదు. నాభక్తులు నన్నే భావముతో భజించెదరో వారికి నేనట్టి ఫలములనే యొసంగెదను.''

సత్యభామ యిట్లనెను:- ''అయితే నాథా! మీరు దేనిలోనైనఁ బొరలాడెదరు, మీ యిష్టము వచ్చిన చోటు నకుఁ బోవుచుందురు. మీ యీ రూపములకు నమస్కా-రము. నా కెల్లప్పుడును నీ మదనమోహన రూపమునే చూపింపుఁడు. పులి, పాము, తేలు రూపములు మాత్రము కావలదు.''

ఇది విని భగవానుఁడు నవ్వెను. సత్యభామయును నవ్వెను. ఆదినమునుండి ఆమె కార్తీకమాసమును వదల లేదు, ఏకాదశిని మానలేదు.''

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! ఈ విధముగఁ గృష్ణుఁడు రాణు లందఱితో వినోదమొనర్చుచు నవ్వుచునే వివిధములగు నీతులను గఱపుచుండెను. అనేకములగు నద్భుతములగు నితిహాసములను వినిపించుచుండెను. దీనివలన నందఱకును నానందము కలుగుచుండెను. ఆతని నెఱిఁగియు స్త్రీ లాతని స్వరూపమును మఱచిపోవునట్లుగను, ఆతనిఁ బ్రాకృతపురుషునిఁగ భావించునట్లుగను నాతఁడు వర్తించు చుండెడువాఁడు. కృష్ణుఁడు తమ వశమున నుండెనని వారు భావించెడువారు. స్త్రీల సంగతి నట్లుంచుఁడు. సాక్షా

చ్చినుఁడే ఆతని స్వరూపమును మఱచి ఆతనితో యుద్ధమొన ర్చెను.''

శౌనకుఁ డిట్లనెను:- ''శ్యామ శంకరులేల యుద్ధ మొనర్చిరి? ఎప్పుడొనర్చిరి? కృపతో మాకీ ప్రసంగమును దప్పక చెప్పవలయును.''

సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! అనిరుద్ధుని వివాహ సమయమునఁ జేసిరి.''

శౌనకుఁ డిట్లడిగెను:- ''సూతా! అనిరుద్ధుని వివాహ మును గూర్చి వర్ణించియుంటివి. అది భోజకటమున రుక్మి యొక్క మనుమరాలితో నైనదికదా! అప్పుడే బలరాముఁడు రుక్మినిఁ జంపివైచినాఁడు. దానిలో శంకరుని యుద్ధవిషయము రాలేదే.''

సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! అది అనిరుద్ధుని మొదటి వివాహము. రెండవ వివాహము బాణాసురుని పుత్రియగు నుషతోనైనది. అప్పుడే యీ యుద్ధము జరిగి నది.''

శౌనకుఁ డిట్లనెను:- ''సూతా! అసురుని పుత్రికతో ననిరుద్ధుఁడేల వివాహము చేసికొనినాఁడు? శంకరుఁడు కృష్ణు నితో నచ్చట నేల యుద్ధమొనర్చినాఁడు. దయతో మాకీ వృత్తాంతమును జెప్పుము.''

సూతుఁ డిట్లనెను:- "మంచిది, స్వామీ! ఇప్పుడు నేనా ప్రసంగమునే చెప్పెదను. మీరందఱును సమాహిత చిత్తులరై వినుఁడు."

---

## అనిరుద్ధుఁడు-ఉష

౧౧౨౧

శ్లో॥ బాణస్య తనయామూషా ముపయేమే యదూత్తమః
తత్రయుద్ధమ భూద్ఘోరం హరిశంకర యోర్మహాత్
ఏతత్సర్వం మహాయోగి న్సమాఖ్యాతుం త్వమర్హసి॥
శ్రీభాగ. ౧౦స్కం. ౬౨అ. ౧శ్లో॥

వ. బాణుని పుత్రికయగు నుషాదేవి యదూత్తమునిఁ బెండ్లాడెను. అప్పుడు హరిహరులకు ఘోరయుద్ధము జరిగెను. ఇదంతయును ఓమహాయోగీ! మాకు జెప్పవలయును.
—శ్రీమదాంధ్ర భాగవతము.

మన మెన్నడు నెఱుఁగని వారిని స్వప్నమందైనను జూడఁజాలమని కొందఱు చెప్పుచుందురు. కాని యిది సత్యము కాదు. మనమెన్నడును జూడని వారిని, చూడని నగరములను స్వప్నములలోఁ జూచుచుందుము. దీనినిఁబట్టి యీజన్మములోఁ జూచినదే చూచినట్లుకాదు. జన్మాంతరములందు మనము చూచినను, పూర్వజన్మమున మనకు

సాంగత్యముండినను, అది సంస్కార వశమున మనకీజన్మము నను స్మృతికి వచ్చుచుండును. వానిని స్వప్నములందును జూచుచుందుము. స్వప్నమందీ జన్మలోని సంఘటనములు వచ్చుననుమాట లేదు. జన్మజన్మాంతరముల విషయము లును స్వప్నములోనికి వచ్చుచుండును. ఒక్కొక్కప్పుడవి సత్యములగుచుండును. ఒక్కొక్కప్పుడు స్వప్నములో ఫలాని చోట ధన నిక్షేపమున్నట్లు కనఁబడిన జాగ్రత్తలో సరిగా నచ్చటనే త్రవ్వినఁ నది దొఱకుట సంభవించుచుండును. ఆ ధన నిక్షేప మీ జన్మములోనిది కాదు. పూర్వజన్మము లోనిది. అది యీ జన్మమునఁ బాతిపెట్టినది కాదు. లభిం చిన ధనమూ పూర్వజన్మములోఁ బాతిపెట్టఁబడినది.

సూతుఁడిట్లనెను :- ''మునులారా! ఇప్పుడు నేను మీకు అనిరుద్ధబాణాసుర పుత్రి ఉషయొక్క సమాచార మును జెప్పెదను. దైత్యవంశమందు కశ్యపుని వలన హిర ణ్యాక్ష హిరణ్యకశిపులను నిద్దరు వీరులగు పుత్రులుదయిం చిరి. హిరణ్య కశిపునకుఁ బరమ భక్తాగ్ర గణ్యుఁడగు ప్రహ్లాదుఁడుదయించెను. ప్రహ్లాదుని కుమారుఁడు విరోచ నుఁడు. విరోచనుని కుమారుఁడు జగత్ప్రసిద్ధ దాతయగు బలిచక్రవర్తి. ఆతఁడు వామనునకు సమస్త భూమండల మును దానమొసంగెను. అట్లు భూమండలమంతయును దాన మొసఁగి, భగవదాజ్ఞ చేఁ బరివారముతోఁ గూడి పాతాళము

నకుఁబోయెను. బలిచక్రవర్తికి నూర్గురు కుమారులు. అం దులో బాణుఁడను. పుత్రుఁడు జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడునై యుండెను. బాణాసురుఁడు శంకరునకుఁ బరమ భక్తుఁడు. ఆతఁడుదార చరితుఁడును, బుద్ధిమంతుఁడును, సత్య ప్రతిజ్ఞుఁ డును, దృఢవ్రతుఁడను, పరమ మనస్వియునై యుండెను. నిరంతరమును శంకరుని భక్తిలో మునిఁగి యుండును. తండ్రి సుతలలోకమునకుఁబోయినను నాతఁడు శంకరుని భక్తి కొఱకు భూమండలమున నుండెను. ఆతఁడు సమతుల భూభా గమును వదలి హిమాచల పర్వతమునకుఁబోయెను. అచ్చట పర్వతముల మధ్య శోణితపురమును పురము నునిర్మించుకొని నివసించుచుండెను. శివుఁడాతని భక్తికి సంతసించెను. శివుఁడు బోళాశంకరుఁడు కదా! బాణాసురునకు వేయిబాహువు లుండెను. ఒక దినమున నాతఁడు తన సహస్ర బాహువు లలో సహస్రవాద్యములను గైకొని వాయించుచు నద్భుత తాండవనృత్యమొనర్చి, శంకరు నత్యంత సంతోషపెట్టెను. ఆతని నృత్య, గాన, వాద్యములకుఁ బ్రసన్నుఁడై శంకరుఁ డిట్లనెను :-"రాజా! నేను నీభక్తికి మిక్కిలి సంతసించితిని. నీవు కావలసిన వరమును గోరుకొనుము. భక్తులకు నేనీయ రానిదేదియును లేదు. నీవేది అడిగిన దాని నొసంగెదను."

బాణాసురుఁడు చేతులను జోడించుకొని డిట్లనెను :- "ప్రభూ! నీవే నాకారాధ్యదైవమని నమ్మితిని. నీవే నాకా

శ్రేయము. నీకు నామీఁద ప్రసన్నత కలిగినచో నీ వెట్లు కాశీయందుండెదవో, అట్లే నా పురమందుండి శత్రువులనుండి నా పురమును రక్షింపవలెను.''

శివుఁడు భోళాశంకరుఁడగుటచే, వరమొసంగు సమయమున నాతఁడు వెనుక ముందులు చూడఁడు. ఆతఁడిట్లనెను: ''సరే, రాజా! నేను సర్వదా నీవు నీసనివాసమున నే నివసించెదను. పూర్వమందు కాశీక్షేత్ర మెట్లో అట్లే నీ పుర ద్వారమున గుప్తకాశీని నిర్మించుకొని యుండెదను. నే నుండిన నీ పురము నెవరును ప్రహరింపజాలఁడు.''

ఈవరమును బొంది బాణాసురుఁడు పశుపతి పాద పద్మములకు నమస్కరించి, నిర్భయుఁడై తన పర్వతిపురమున నివసించుచుండెను. మొదట నాతఁడు నిత్యమును కేదార నాథమునకుఁ బూజలొనర్చుటకై పోవుచుండెడు వాఁడు. ఇప్పుడు గుప్త కాశీ నేర్పఱచుకొని శివుఁడు ద్వారముననే నుండెను. అందువలన నాతఁడచట పూజించుకొనుచుండెను. ఆతని నగరమును జాల గట్టిగఁ గట్టుకొనెను. అసలా పురము నాలుగువైపులను బెద్దపెద్దయెత్తైన పర్వతములు కలవు. పైగా నాతని విశాలమగు కోటలోనుండి కేదార గంగయును మందాకినియును బ్రవహించుచుండెను. ఇఁక మూఁడవ విషయము శివుఁడు దానిని స్వయముగ రక్షించుచుండెను. ఈకారణములన్నిటిని బట్టి, యెట్టి శత్రువైన

లోనఁ బ్రవేశింపఁజాలకుండెను. ఆతని కెన్నఁడును యుద్ధావసరము కలుగలేదు. బలవంతులకు యుద్ధావసరము లేకుండిన వారికి చేతులు గులపుట్టును. తాను గొప్పబలవంతుఁడనని అతఁడు గర్వపడుచుండెను. తన భయముననే శత్రువుకూడ వచ్చుటలేదని ఆతఁడు గర్వపడుచుండెను. ఈవిధముగ బాణాసురునకు మిక్కిలి గర్వము కలిగెను.

ఒక దినమున నాఁతడు తన బలగర్వముతో గుప్తకాశీయందున్న శంకరుని దర్శనము కొఱకుపోయెను. విధ్యుక్తముగ నాతని బూజించెను. అంతఁదన సూర్య సదృశమును, దేదీప్యమానమునగు ముకుటముచే నాతని పాదపద్మములకుఁ బ్రణామము కావించి యిట్లనెను :-''ప్రభూ! అందఱకును నీవు రెండురెండు చేతుల నొసంగితివి. నా కొక్కసారిగా వేయిచేతుల నేల యొసంగితివి?''

వృషభధ్వజుఁడిట్లనెను :-''రాజా! నీవు నాభక్తుడవు. నీకు కోరికలు నెరవేరకుండ రాదు. నీవు సహస్ర బాహువులతో సమస్త సుఖసమృద్ధినిఁ జెంది భోగింపవలయును. అందువలననే నేను బ్రసన్నుఁడనై నీకు సహస్ర బాహువుల నొసంగితిని.''

బాణాసురుఁడిట్లనెను :-''నీవు భక్తవాంఛా కల్పతరువను విషయము నాకుఁ దెలియును. నీవు సకల భువనాధీశ్వరుఁడవు. లోకగురువవు. ఆశుతోషుఁడవు. ఎచ్చటను

నెఱవేరని కోరికలు నీదర్శన మాత్రముచేతనే నిన్ను శరణు వేడుట చేతనే అవి నెఱవేఱితీరును. కావున నీవు నాకోరికను గూడ నెఱవేర్పవలయును.''

శివుఁ డానందమును బ్రకటించుచు నిట్లనెను :- ''చెప్పుము నీ కోరిక యేమియో? దానినిఁ దప్పక నెఱవేర్చెదను.''

బాణాసురుఁడు కపట వినయమును బ్రదర్శించుచు నిట్లనెను :- ''స్వామీ! రాజబాహువులు యుద్ధము కొఱకే. యుద్ధమొనర్పని రాజు బాహువులు వ్యర్థములు. అందఱకును రెండు రెండు చేతులే కలవు నాకు వేయిచేతులు కలవు. వీని వలన నాకేమియు నుపయోగము కనఁబడుట లేదు. కేవలము బరువుచేటు. నేను బృథివి యంతయును యుద్ధము కొఱకై తిరిగితిని. నాతో యుద్ధమొనర్చువాఁ డొకఁడును దొఱకలేదు. ఇఁక మీరు మిగిలి యున్నారు. నాదాటి కాఁగఁగలవారు మీ రొక్కరే.''

శివుఁడీ గర్వయుక్తములగు వాక్యముల అభిప్రాయమును గ్రహించెను. ఈతని కభిమానము కలిగినదని- ఆతఁడు గ్రహించెను. వీఁడు నాతోడనే పోరాడఁదలఁచుచున్నాఁడు. నేను దలఁచుకొనిన వీని పీచమడఁప వచ్చును. ఎముకలను విఱుగఁగొట్టఁగలను. కాని సుకృత పురుషుల నిశ్చయమును జివరవఱకు పాలింపవలయును.'' అని యాలోచించి యిట్లనెను :- ''రాజా! మనకిద్దరకును బోరుశోభింపదు.''

గర్వయుక్తుఁ డగు బాణాసురుఁ డిట్లనెను :- "నాకు మీతో యుద్ధము చేయవలయునను నుద్దేశ్యము లేదు. స్వామీ! ఇప్పుడు నేను యుద్ధము చేయకుండఁజాలను. నా చేతులు గులపుట్టుచున్నవి. నా చేతుల కధికముగ యుద్ధ కండూతి పుట్టినప్పుడు, నేను చేతిలోనికి గదను దీసికొని నాతోఁ బోరాడఁ గల యోధుని కొఱకై అన్వేషించుచుందును. ఎవరును దొఱకనుండిన నష్టదిగ్గజముల పర్వతములను జూర్ణ మొనర్చుకొనుచు వాని కడకు బోయి యిట్లంటిని :- "మీరు సమస్త పృథివిని ధరించితిరి. నాతో యుద్ధ మొనర్పుఁడు. నా యీ మాటలను వినఁగానే అవి పాఱిపోయెడివి. అవి నాయెదుటనైన నిలువ గలిగెడివికావు ఇప్పు డేమి చేయుదును. నా యుద్ధ కండూతిని నివారింప గలవా రెవరు ?"

ఇది వినఁగానే రుద్రునకుఁ గోపము వచ్చెను. వానినిఁ గసరుచు నిట్లనెను :- "ఓరీ మూఢా! ఇంత గర్వ మేలరా? తలను దన్నువాఁ డుండినఁ దాటినిఁ దన్నువాఁ డుండఁ గలఁడు. ఇంట లేకుండిన బయట పదివేవురు." ఒకానొక దినమున నిన్నణఁచువాఁడు రాఁగలఁడులే. నీ పీచమును నేనే అణఁచి యుందును. కాని మన కిద్దరకును స్వామి సేవక సంబంధము కలదు. స్వామి సేవకునితోఁ బోరాడుట అనుచితము. కాని నీవు కొన్నాళ్ళు ధైర్యమును ధరించి

యుండుము. ఒకానొక దినమున నాతో సమానుఁడగు శూర వీరుఁడు నీకు లభింపఁగలడు. ఆతఁడు నిన్ను యుద్ధమున సంతోషపెట్టఁగలఁడు. ఆతఁడు వృద్ధి పొందిన నీ గర్వమును ఖర్వ మొనర్పఁ గలఁడు''

ఇది విని యామూఢుఁడు పరమ ప్రముదితుఁ డయ్యెను. శివుఁడు కోపముతో నిట్లనుచున్నాఁడని ఆతఁడు గ్రహింపఁ జాలక పోయెను. ఆతఁ డుత్సాహముతో నిట్లనెను:- ''స్వామీ! నాతో యుద్ధ మొనర్పఁగల బలవంతుఁడు నాకెచ్చట లభింపఁ గలఁడు?''

శివుఁ డిట్లనెను:- ''నీ వింటిలోనున్నప్పుడే నీ పురము నకే రాఁగలడు''

బాణాసురుఁ డిట్లనెను :- ''ఎప్పుడు రాఁగలఁడు. ఎంత కాల మాతనిఁ బ్రతీక్షింపవలయును ?''

శివుఁ డిట్లనెను :-'' నీ ధ్వజము దాని కదియే విఱిగి క్రింద నెప్పుడు పడిపోవునో, అప్పుడు నీ శత్రువు నీపురము లోనికి వచ్చినాఁడని భావింపవలయును.''

ఇది విని యా మందమతి మిక్కిలి సంతసించి, శివుని పాదపద్మములకు బ్రణామము కావించి తన పురమునకుఁ బోయెను. అంత నాతని ప్రతిస్పర్ధియగు శత్రుని కొఱకు ఉత్కంఠతతో నిరీక్షించుచుండెను.

బాణాసురునకు ఉషయను పేరుగల పరమసుందరి యగు నొక కన్యక కలదు. క్రమక్రమముగ నామె బాల్యమును

పీడియువావస్థలోఁ బ్రవేశించెను. రాజుల యిండ్లలోఁ బిల్లలు పెద్దవారు కాఁగానే వారికి వేఱొక యంతఃపురము నేర్పఱచెదరు. అందులోనికి చెలికత్తెలు, సహచారిణులు, దాసీలు తప్ప యింకెవరును బ్రవేశించుటకు వీలులేదు. ద్వారపాలకులుగ వృద్ధులగు వారి నుంచెదరు. పెద్దది కాఁగానే ఉషయొక్క అంతఃపురమును వేరుగా నేర్పఱుపఁబడెను. కోటలోనే కేదారగంగ, మందాకినుల కావలి యొద్దను నివాసస్థాన మేర్పఱచెను. దానిలో మంత్రిపుత్రికలతోఁ గూడి రాజకుమారి నివసించుచుండెను. వృద్ధులగు ద్వారపాలురు మిక్కిలి జాగ్రత్తగ నంతఃపురమును రక్షించుచుండిరి.

ఒక దినమున నుష తన సుందర సుఖద శయ్యపై సుఖముగ శయనించి యుండగా, హఠాత్తుగ నామె యులికిపడి కేకవైచెను :- "హా కాంతా! నీ వెచ్చట నున్నావు? నన్ను వీడి నీ వెచ్చటికిఁ బోయితివి?"

ఆమెకు దగ్గఱలోనే చిత్రలేఖయను నీమె సఖయొకతె శయనించి యుండెను. ఆమె బాణాసురుని మంత్రియగు కుంభాండకుని పుత్రిక. ఆమె ఒక యోగివలన యోగసిద్ధుల నన్నిటినిఁ బడసెను. పైఁగా నామె చిత్రలేఖనమం దతి ప్రవీణత కలిగినది. ఆమె చూడక పోయినను ఊహించి అట్టే చిత్రమును గీయఁగలదు. ఆమె రాజకుమారియొక్క

కేకను వినఁగానే, తన శయ్యమీఁదనుండి లేచి వచ్చెను. మిగిలిన చెలికత్తెలును నా శబ్దమును విని పరువిడి వచ్చిరి. అందఱును నామె చుట్టును జేరిరి. అంతఁ జిత్రలేఖ యిట్లనెను :- "రాజకుమారీ! నిన్ను వదలి పోయిన దెవరు? నీ వెవరినిఁ బిలుచుచున్నావు? ఎవరిని 'కాంతా' యని పిలుచుచున్నావు? నీ కింకను బెండ్లి కాలేదు కదా! అట్టి యెడ నీవు ప్రణయ కల్పన యెట్లు చేయుచున్నావు? ఎవరితో మాటలాడుచున్నావు?"

ఉష కన్నులు నులుముకొనుచు శయ్యనుండి లేచెను. తన చుట్టును సఖులుండుటను గాంచి ఆమె మిక్కిలి లజ్జించెను. సఖులు ప్రశ్నలపైఁ బ్రశ్నలను గురిపింప నారంభించిరి. ఆమె ప్రశ్నలకు విసుగుజెంది యిట్లనెను :-"నా చిత్తమిప్పుడు స్వాస్థ్యముగ లేదు. మీరంద ఱిచ్చటినుండి వెడలి పొండు. కేవలము చిత్రలేఖయే నావద్ద నుండవలయును."

సరేనని సఖులందఱును దమ తమ స్థానములకుఁ బోయిరి. కేవలము చిత్రలేఖమాత్ర మచ్చట నుండెను. అప్పుడు రాజకుమారి యిట్లనెను:- "అక్కా! నే నిప్పుడొక యద్భుత స్వప్నమును గాంచితిని. దానివలన నా కిప్పటికిని శరీరము పులకరించుచున్నది. గుండె కొట్టుకొనుచున్నది శరీరము కంపించుచున్నది. చిత్తము చంచల మగుచున్నది. దానినిఁ జెప్పుటకును నాకు లజ్జ కలుగుచున్నది."

అత్యంత ప్రేమతో చిత్రలేఖ యిట్లనెను:- "కుమారీ! నీవారికడను లజ్జకలుగునా? నీవు నీ స్వప్న వృత్తాంతమును నాకు జెప్పుము నీకేదైన సహాయమొనర్ప వీలున్న సహాయ మొనర్చెదను."

సిగ్గుతో రాజకుమారి యిట్లనెను :- 'సోదరీ! నేను స్వప్నమున నొక పురుషునిఁ గాంచితిని. ఆతని వర్ణము నూతన జలధరమువలె నున్నది. కమలములవలె విశాల నేత్రములు. సుందరముగ మెఱయుచుండిన పీతాంబరమును కట్టుకొని యుండెను. ఏనుఁగు తొండములవలె బలిష్ఠములై పొడుగైన బాహువులుండెను. ఆతఁడతిసుందరుఁడు. ఆతనిఁ గాంచఁగనే నామనస్సచ్చట లగ్నమైనది. ఆతఁడు నా కత్యంత సుఖము నొసంగెను; కాని మధ్యలోనే అతృప్తావస్థలో నన్నువదలి వెడలిపోయినాఁడు. సోదరీ! నేను నిజము చెప్పుచున్నాను. ఆతఁడు లభింపకుండిన నేను బ్రతుకఁ జాలను. అది సాధారణ స్వప్నము కాదు. యథార్థమువంటి సంఘటనము. నే నాతనినే కాంతా! కాంతా! యని పిలుచు చుంటిని, ఆతనినే అన్వేషించుచుంటిని.'

చిత్రలేఖ అత్యంతోల్లాసముతోనిట్లనెను:-"ఇదెక్కడి మాట? ఈతఁడెవఁడైనఁ బ్రపంచమునఁ బ్రసిద్ధపురుషుఁడై యుండిన నేను దీసికొని రాఁగలను."

దీనతాస్వరమునఁ జిత్రలేఖను గాఁగిలించుకొని ఉష యిట్లనెను :- 'సోదరీ! నీవు నా యీ మనోరథమును నెఱవేర్చినచో నేను జీవితాంతమువఱకు నీ యుపకారమును మఱవను. సదా నీ గుణగాన మొనర్చెదను.'

మమతాస్వరమునఁ జిత్రలేఖ యిట్లనెను :-'కుమారీ! మన దాసీలతో నీ సంగతిని జెప్పివచ్చెదను. అతఁడు దేవతయా, మానవుఁడా?'

ఉష యిట్లనెను:-'అతఁడు దేవతయో, మానవుఁడో నేను నిర్ణయింపఁజాలకున్నాను. యక్షుఁడో, గంధర్వుఁడో, మఱెవరో చెప్పలేను.'

చిత్రలేఖ యిట్లనెను :- 'మంచిది, ఫరవాలేదు. నేను త్రిలోకములలోఁ గల ప్రసిద్ధపురుషుల చిత్రములను లిఖించెదను. నీవు వారిలో నీ ప్రియతముని గుర్తింపుము.'

ఉష యిట్లనెను:-'సరే, లిఖించుము.' ఇది విని చిత్రలేఖ తన పట్టికను దెచ్చెను. ఆ పట్టిక వెంటనే ఆ చిత్రసంకేత మొనర్చి చెఱగిపోవును. మరల దానిమీఁద నింకొకటి వ్రాయవచ్చును. అట్లెన్నిటినైన వ్రాయవచ్చును.

చిత్రలేఖ చిత్రములను లిఖించుటలోఁ జాల నిపుణ. ఆమె ఆ పట్టికయందు ముందుగా నింద్ర, వరుణ, కుబేర, యమ, అశ్వినీకుమారాది ముఖ్యాముఖ్య దేవతల చిత్రములను లిఖించెను. వారిలో నెవరును గారని ఉష చెప్పెను.

తరువాత జన్మసిద్ధులగువారి చిత్రములను వ్రాసెను. వారు కూడ నచ్చలేదు. సిద్ధ, చారణ, పన్నగ, దైత్య, విద్యాధర యక్ష, రాక్షసాది ఉపదేవతల చిత్రములను లిఖించెను. ఉష వారినిఁ గాదనెను. చిత్రలేఖ మరలఁ గొందఱను వ్రాసెను. ఆమెకు వ్రాయుటలో శ్రమలేదు. మనస్సులో ధ్యానమొనర్చినచోఁ గంటియెదుట కనఁబడును. వెంటనే విశ్వకర్మయును నచ్చెరువు చెందునటుల లిఖించును. దేవతలు, ఉపదేవతల చిత్రములు కాఁగానే పృథివిపై రాజకుమారుఁ డెవఁడైన నైయుండవలయు నని రాజకుమారి యనెను. ఆతఁడు కనుఱెప్ప వేయుచుండెననీ రాజకుమారి చెప్పెను.

నవ్వి చిత్రలేఖ యిట్లనెను :- 'ఈ విషయమును నీవు నా కిదివఱలో నేల చెప్పలేదు? ఇప్పుడు చూడుము. పృథివి యందలి రాజకుమారుల యొక్కయు, రాజుల యొక్కయు చిత్రములను వ్రాయుదును.''

అని పలికి ఆమె ముందుగా సూర్యవంశ మందలి ప్రసిద్ధులగు రాజులయొక్కయు, రాజకుమారుల యొక్కయు చిత్రములను లిఖించి, తర్వాత ఇతర రాజకుమారుల చిత్రములను లిఖించెను. చంద్రవంశమందలి ప్రసిద్ధరాజకుమారుల చిత్రములను లిఖించెను. అంత నుగ్రసేన, వసుదేవుల చిత్రములు లిఖించెను. ఇప్పుడు ఉషయొక్క నేత్రములు మెఱయు

నారంభించెను. అంత బలరామకృష్ణుల చిత్రములను లిఖించెను. కృష్ణుని చిత్రమును జూడఁగనే ఆమె పరమ లజ్జిత యయ్యెను. ఆమె తల వంచుకొనెను. చిత్రలేఖ యిట్లనెను:– "ఏమమ్మా వీరేనా యేమి?"

లజ్జించుచు నుష తల నూపెను. చిత్రలేఖ ఆమె భావమును గ్రహించి వీరి వంశములో నెవరో అయియుండ వచ్చుననుకొనెను. అంతఁ బ్రద్యుమ్నుని చిత్రమును లిఖించి యిట్లనెను:– "రూపాకృతిలో నీతనివలె నుండ లేదా? ఈతఁడు కాదుకదా!" అంతఁ జిత్రలేఖ అనిరుద్ధుని చిత్రమును వ్రాసెను. ఆ చిత్రమును జూడఁగనే ఉష ఉలికిపడి, ఈతఁడే, ఈతఁడే యని నోటఁ బలుక నారంభించెను. ఆతనినే తన కాంతుడనుకొనుచుఁ బిలుచుచుండెను. అతఁడే నాచిత్తమును హరించినాఁడు."

అంతఁ జిత్రలేఖ చిత్రములను వ్రాయుటను మాని యిట్లనెను:– "ఈతఁడే శ్రీకృష్ణునియొక్క పౌత్రుఁడు. కామావతారుఁడగు బ్రద్యుమ్నుని ప్రథమపుత్రుఁడు. ఈతనిఁ బొందుట చాల కష్టము. నీపురము పర్వతములతో నెట్లు చుట్టుకొనఁబడినదో, ఆతని పురము సముద్రముచేఁ జుట్టుకొనఁబడినది. మీ పురమును బురాంతకుఁ డెట్లు రక్షించుచున్నాఁడో, ఆతని పురమును బురుషోత్తముఁ డగు శ్రీకృష్ణుఁడు రక్షించుచున్నాఁడు. నీపురములోనికి శివునాజ్ఞ

లేనిది వాయువైన నెట్లు చొరఁజాలదో, ఆ పురములోనికి కృష్ణునాజ్ఞ లేనిది మనస్సైనఁ జొరఁజాలదు.''

ఉష నిరాశా స్వరమున నిట్లనెను:- ''అట్లైన నింక నా జీవిత మింతటితోఁ బూర్తియైనదని భావింపుము. ఈ పురుషుఁడు నాకు లభింపకపోయినచో నేను జీవింపఁజాలను'' అని పలుకుచు నామె మూర్ఛిత యయ్యెను.

చిత్రలేఖ ధైర్యమును జెప్పుచు యిట్లనెను:- ''రాజపుత్రీ! నీవధీరురాలవు కాకుము. నేను నీ మనోరథమును బూర్తి కావించెదను. నీవు శీఘ్రముగ నీనాథు నిచ్చట జూడఁగలవు. నేను నా యోగశక్తిచే నీ ప్రద్యుమ్నానందవర్ధనుఁడగు ననిరుద్ధు నిచ్చటికిఁ దెచ్చెదను.''

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! ఇట్లు పలికి యోగిని యగు జిత్రలేఖ ఆకాశమున కెగిరి, అల్పకాలములోనే ద్వారకాపురినుండి అనిరుద్ధు నేవిధముగఁ దెచ్చినదో, ఆ కథాప్రసంగమును మీకు జెప్పెదను. సావధాన చిత్తులరై వినుఁడు.''

---

# చిత్రలేఖ ద్వారా అనిరుద్ధుని దెప్పించుట

౧౧౨౨

శ్లో. చిత్రరేఖా తమాజ్ఞాయ పౌత్రం కృష్ణస్య యోగినీ !
యయౌ విహాయసా రాజన్ ద్వారకాం కృష్ణపాలితాన్॥
తత్ర సుప్తం సుపర్యంకే ప్రాద్యుమ్నిం యోగమాస్థితా।
గృహీత్వా శోణితపురం సఖ్యై ప్రియమదర్శ యత్॥

—శ్రీ భాగ ౧౦స్క. ౬౨అ. ౨౨ ౨౩ శ్లో.

వ. హంస తూలికా తల్పంబున నిజాంగనా రతి శ్రమంబున నిద్రాసక్తుండై యున్న యనిరుద్ధుం జేరి, తన యోగ విద్యా మహత్త్వంబున నతని నెత్తుకొని మనోవేగంబున శోణపురంబునకుం జని బాణాసుర నందన యగు నుషా సుందరీ తల్పంబు నం దునిచెను.

—శ్రీమదాంధ్ర భాగవతము.

పూర్వజన్మ యందలి ప్రేమ సంబంధ మొక్కసారిగా నిద్దర హృదయములం దుద్భవించును. ప్రారబ్ధము వారి నిద్దరి నొక్కటిగ నొనర్చును. ఎవ రెవరి కెంతెంత సంబంధము వ్రాయఁబడి యున్నదో, అంతఁవఱకు కలసి యుందురు. అది తీరిపోఁగానే ఎవరికివారు వెడలి పోయెదరు. ఎవరైనను సమయమునకు ముందును రాఁజాలరు. సమయమైన తరువాత నొక్క నిమిషమైనను నిలువఁజాలరు. అన్నిటికిని సమయము నిశ్చితమై యున్నది. ఎవరైన నింకొక

రితోఁ గలిసికొను సమయము రాఁగానే వారిని బంధించి యేఁడు తాళములు వైచి యుంచినను వారు కలిసికొని దీరె దరు. సమయము రాకున్న నిండ్లుఁ ప్రక్కప్రక్కనే నుండి నను గలిసికొనఁజాలరు. సంయోగ వియోగములు పూర్వఁ జన్మ సంబంధమున సంభవించును.

సూతుఁ డిట్లనెను:-"మునులారా! చిత్రలేఖ మన స్వంతయును శ్రీకృష్ణుని పౌత్రుఁడగు ననిరుద్ధుని యందుఁ లగ్నమైనదని తెలిసికొని చిత్రలేఖ ఆకాశమున కెగిరి ద్వార కాపురికిఁ బోయెను. అచ్చట నామె చిత్రసారి వైన సుందరసుఖద శయ్యపై శయనించిన ననిరుద్ధునిఁ గాంచెను. ఆతని సర్వాంగములు సుందర సుగంధిత పుష్పములచేతను, మాలలచేతను, నలంకృతమై శరీరము చందన చర్చితమైఁ యుండెను. ఆతఁడొక సన్నని పీతాంబరమును ధరించి యుం డెను. దివ్య, పుష్ప, గంధాదులచే నాతని శయ్య సుగంధి తమై యుండెను. ఆతఁ డేదో చింతలో నర్ధ నిమీలిత నేత్రుఁడై యేదియో ప్రలాపించు చున్నట్లుండెను. వికల తతోఁ గొట్టుకొను చుండెను. ఈతఁడును నెవరికొఱకో వికల తను జెందియున్న ట్లాతని ఆకృతిప్రకృతులను బట్టి చిత్రఁ లేఖ గ్రహించెను. బహుశః ఈతఁడు నుషకొఱకై వికల తను జెందియుండినట్లు తోఁచుచుండెను. ఈ సంగతిఁ దెలిసి కొని శయ్యతో సహా అనిరుద్ధు నెత్తి, ఆకాశమార్గమునఁ

దీసికొనిపోయి శోణితపురమునకుఁ జేర్చెను. గణపతి ద్వారమున నున్నను, శివుఁ డాపురమును రక్షించు చున్నను, వారికి తెలియక గాలివైనను బురమునఁ జొరజాలకున్నను వారు చిత్రలేఖ మార్గమునకు విఘ్నమును గలిగింపఁ లేదు. చిత్రలేఖ సకుశలముగ ననిరుద్ధునిఁ దెచ్చి, ఉషయొక్క అంతః పురమునకు వచ్చెను.

ఉష అనిరుద్ధుని చింతలో వ్యాకులయై పడియుండెను. ఆమెకు శరీర స్పృహ లేదు. ఆమె దీర్ఘనిశ్వాసములను విడుచు చుండెను. చిత్రలేఖ ఆమెను తెలివిలోనికిఁ దెచ్చెను, అనిరుద్ధునితో నామెను గలిపెను. ఉష అనిరుద్ధునిఁగాంచి పరమానందమును జెందెను. అనిరుద్ధుఁడు దన ప్రియురాలిని గుర్తించి పరమానందమును జెందెను. ఇద్దరును బరస్పరము ఒకరి నొకరు ప్రేమించుకొని, శాస్త్రవిధిచే గాంధర్వ వివాహమును గావించుకొనిరి. వారిద్దరును సుఖముగ నానంద విహార మొనర్చు చుండిరి."

శౌనకుఁ డిట్లడిగెను :–"సూతా! మాకిందు కొన్ని శంకలు కలవు. మొదటి శంక యేమనఁగా – సర్వజ్ఞుఁ డగు భగవానుఁడు ద్వారకలో నుండగా నా చిత్రలేఖ రాత్రిఁ వేళ నాతని పౌత్రుని దెచ్చుట కేమి సామర్థ్యము కలదు ? రెండవ శంక యేమనఁగా – అనిరుద్ధుఁడు తన ప్రియురాలిని గుర్తించె నంటివి. ఇంతవఱకు అనిరుద్ధుఁడు ఉషను జూడనే

చూడలేదు కదా! అతఁడు గుర్తించె నంటిరేల? మూడవ శంక యేమనగా బాణాసురుని పురమును పశుపతి రక్షించుచుండ, పార్వతీ గణపతులును నచ్చటనే యుండ రహస్యముగఁ జిత్రలేఖ యెట్లు తేఁగలిగినది? ఇట్టి అధర్మము జరుగుచుండఁ బశుపతి యేల నిరోధింప లేదు? ఈ సంగతిని బాణాసురున కేలఁ జెప్పలేదు?''

ఇది విని సూతుఁడిట్లనెను :- ''స్వామీ? మీ మూఁడు ప్రశ్నలకును బ్రత్యుత్తరమిది-భగవంతుని యిచ్ఛ లేక ఒక్క ఆకైనను గదలదు. భగవానుఁ డే కార్యమును జేయఁదలఁచినాఁడో, దానిని నిరోధింపఁగలవాఁడెవ్వడును లేఁడు. ఇఁక ద్వారకయందును, శోణితపురమందును కృష్ణ శంకరులేల అడ్డగింపలేదను విషయము మిగిలినది. వీరుండఁగా దొంగతన మేల జరిగినది. దొంగవస్తువు శోణిత పురమున కెట్లువచ్చినది?'' స్వామీ? దొంగతనమొనర్చు వాఁడును, కావలివాఁడును గలిసినచో దొంగతనము జరిగి తీరును. యథార్థమున కీవిషయమంతయును శ్రీకృష్ణ శంకరుల యిచ్ఛచేతనే జరిగినది. ఈ విషయమున నొక పౌరాణికేతిహాసమున్నది. దానిని నేను మీకుఁ జెప్పెదను. దీనివలన మీకు సమస్త శంకలకును సమాధానము కుదరఁ గలదు.

ఒకనాఁడు హిమాలయ పుణ్యశిఖరమందు పార్వతితోఁ బరమేశ్వరుఁడు సరసక్రీడలొనర్చుచుండెను. అదే సమయ

మున దైవయోగముచే సఖులతో నుపవనమునఁ దిరుగుచు బాణతనయయగు నుష వచ్చెను. అచ్చటికిఁ బురుషు లెవరును వచ్చుటకు వీలులేదు. ఏలననఁగా నది స్త్రీల క్రీడాస్థలమే కాని శంకరుఁడు కేదారఖండమున కంతకును నీశ్వరుఁడు. అది ఆతని క్రీడాభూమి. ఆతని నచ్చట ఎవ రడ్డగింపఁగలరు? పార్వతీ పరమేశ్వరులు రమించుటను గాంచఁగనే ఉషకును మనస్సులోఁ బతిఁ బొందవలయునను కోరిక కలిగెను. ఆమె మిక్కిలి సుందరుఁడగు పతిని లభింపవలయు నని జగదంబిక నారాధించెను. పార్వతి బాణపుత్రికయగు నుష యొక్క భక్తికి ప్రసన్నయై యిట్లు వరమొసంగెను :- "నీకు మిక్కిలి సుందరుఁడగు పతి త్వరలో లభింపఁగలఁడు."

సాక్షాత్తుగ మన్మథాంశుఁడగు ననిరుద్ధుఁడే అందఱ కంటె సుందరుఁడని పార్వతికిఁ దెలియును? ఆతనితో నీమెకు వివాహము జరుగవలసియుండును. కాని బాణుని కోట అతి దుర్గమమైనది. దానిలోఁ బ్రవేశించుట కెవరికిని శక్తిలేదు. పైఁగా నాపురమును బురహరుఁడగు శివుఁ డొనర్చుచున్నాఁడు. కావున నేదైన యుక్తినిఁ గావింపవలయును. అని యాలోచించి ఆమె అనిరుద్ధునకు స్వప్నము కలుగున ట్లొనర్చెను.

ఒక దినమున ననిరుద్ధుఁడు తన సుసజ్జిత శయ్యపై నిద్రించుచుండెను. ఆతఁడానాఁడు స్వప్నము నత్యంత

సుందరియు, సుకుమారియు నగు రాజకుమార్తె తన శయ్యా సమీపమున నిలుచుండుటను గాంచెను. ఆమె శరీర మంతయును సువాసిత చందనములఁదిమిడీయుండెను. అంగ ప్రత్యంగములనుండి సౌహార్ద్రము వెలువడుచుండెను. ఆమె అమూల్యరత్నాభరణ విభూషితయై యుండెను. మణిమయ కుండల కాంతులచే నామె గండస్థలముల్లసితయై యుండెను. అత్యంత సూక్ష్మవస్త్రమును ధరించి, పాదములందలి మంజీర ధ్వనులచే ఝుణఝుణ శబ్దములొనర్చుచుండెను. కొప్పున గుప్పుమను పుష్పమాల తురుముఁబడియుండెను. మస్తక మునఁ గస్తూరీ కుంకుమ యుక్తమగు తిలకము శోభనొనఁ గూర్చుచుండెను. విశాల నేత్రములతో నామె చూచు చుండెను. ఆమె గోళ్ళను పాదములను పారాణిచే సులంజి తమై యుండెను. ఆమె అనురాగభరితదృష్టితోఁ గ్రీడా సహితముగ ననిరుద్ధునిఁ గాంచుచుండెను.

అనిరుద్ధుఁడిట్లనెను :– "దేవీ ! నీవెవతెవు. నీవు స్వర్గ మందలి అప్సరసవా ? లేక మర్త్యలోకమందలి మానవ స్త్రీవా ? లేక విద్యాధర, కింపురుష గంధర్వులలో నొక తెవా ?"

ఆ యువతి యిట్లనెను :– "ప్రభూ ! నేను దేవతను గాను, కింపురుషనుగాను, గంధర్వనుగాను. నేను శోణిత పురాధీశ్వరుఁడగు బాణాసురుని పుత్రికను. నన్ను ఉష

యందురు. వీరారు నాతో స్నేహమొనర్పఁదలఁచి యుండి నచో విధ్యుక్తముగ నన్ను వివాహమాడుఁడు. ఏలననఁగా నధర్మముగఁజేయబడిన సంబంధమున స్త్రీపురుషు లిరువురును ఘోర నరక యాతనలలోఁ బడవలసివచ్చును. కావున మీరు నన్నుఁ బ్రేమించుచుండు నెడల, మాతండ్రిని యాచించుఁడు. లేదా శంకరునడుగుడు.'' అని యా కన్యక అంతర్ధానమయ్యెను. వెంటనే అనిరుద్ధునకు మెలకువ వచ్చెను. అతఁడా కన్యకను స్మరించుచు మూర్ఛితుఁడయ్యెను. ఆహార పానీయములను మఱచెను.

దీనినిఁగాంచి రుక్మిణియు, దేవకియును, అనిరుద్ధుని తల్లియగు రుక్మినియును మిక్కిలి భయమును జెందిరి. భగవానుఁడందఱి నోదార్చెను. ఏమియును లేదు, పిల్లవాఁడు కదా! రెండు మూఁడు రోజులలో నెమ్మదించఁగలదు.'' అని పలికి అందఱినోదార్చెను. ఏకాంతమున రుక్మిణితో నిట్లనెను –''పార్వతీదేవి మన పౌత్రుని పిచ్చివానినిఁగాఁ జేసినది. ఇప్పుడు నేనును బాణాసురుని పుత్రికయగు నుషను బిచ్చివానినిగా నొనర్చెదను.'' అని పలికి భగవానుఁడు ఉషాస్వప్నమున ననిరుద్ధుని దర్శింపఁజేసెను. ఆమె యీతనిఁ గాంచి పిచ్చిదయ్యెను. వారిద్దరిమధ్య చిత్రలేఖనుంచెను. రెండువైపులను సమ్మతి యయ్యెను. అందువలన ననిరుద్ధునిఁ దెచ్చు సమయమున శ్రీకృష్ణుఁడును మాటలాడలేదు. శివుఁ

డును శివగణములును ప్రవేశించు సమయమున నభ్యంత రము పెట్టలేదు. వధూవధు లిరువురును గలిసికొని, ఆనం దముతోఁ జదరంగ మాడసాగిరి. అనిరుద్ధుఁడు తన ప్రియను బొంది ఆనందమును జెందెను. కృష్ణునకు లక్షలకొలఁది పుత్రులును బౌత్రులును గలరు. వారి కేమియును సూచి యును లేదు. ఎవడెక్కడికిఁ బోఁదలఁచినఁ బోవుదురు. స్వయంవరమని యెచ్చటనైన విననచోఁ బరువిడుచుందురు. ఎవ్వరైన భగవానునితోఁ జెప్పినచో స్వయంవరమునకుఁ బోయిన జింత యెందులకనును. అప్పుడందఱును మెదలకుం దురు. భగవానున కన్నియును దెలియును గావున నిశ్చిం తగానుండెను. బాణాసురుఁడును నిశ్చింతుడై యుండెను, శివుఁడు మనపురమును రక్షించుచున్నాఁడు గదాయని యతనిధైర్యము. ఈ విధముగ ననిరుద్ధునకు వర్ష కాలము నాల్గునెలలును సుఖముగ గడిచెను. ఆతఁడు ప్రేమ మగ్నుఁ డగుటచే నిల్లు వాకిళ్ళన్నియును మఱచిపోయెను. ఆతని కెప్పుడు తెల్లవారుచున్నదో ఎప్పుడు ప్రొద్దుపొడుచుచున్నదో కూడ తెలియదు. ఆ పరమ సుందర సుకుమార, మనోజ్ఞుఁ డగు వరునిఁ బొంది ఉషయును నత్యంత హర్షించెను. అనిరుద్ధుని శీల, స్వభావ, సౌందర్య క్రీడాప్రియత్వము వలన నామె అనురాగ మాతనియందు శుక్లపక్ష క్షపాకరునివలె నిరంతరము వృద్ధి బొందుచుండెను. ఏ యంతఃపురమునఁ

బురుషునియొక్క నీడమైనను రాదో అట్టి అంతఃపురమున ననిరుద్ధుఁడు రాత్రింబవళ్ళు నివసించుచుండెను. ఉష ఆతనికి బహుమూల్యములగు వస్త్ర, మాల్య, చందన, ధూపదీప, సుందర ఆసనాదు లర్పించుచు, వివిధములగు షడ్రసోపేత ములగు భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, పేయాది పదార్థ ముల నారగించుచు సంతుష్టిఁ జెందుచుండెను. ఆతనితో నవ్వుచుఁ బ్రేలుచు మనోహర వాక్కులతో సంభాషించుచు నిరంతరము సేవాశుశ్రూష లొనర్చు చుండెను. ఈ సేవ జడపాషాణములకును జైతన్యమును గలిగించు నట్టిది. కావున యదుశ్రేష్ఠుఁడగు ననిరుద్ధుఁ డామెయొక్క సేవా సమ్మానములచే వశుఁడయ్యెను.

ఏ విషయమునైనను యత్నపూర్వకముగ దాచినను నేదోఒక దినమున నది ప్రకటముగాక మానదు. ఉష యొక్క అంతఃపురమునఁ జాల వృద్ధులును, విశ్వాసపాత్రులు నగు కావరి వారుండిరి. వారు లోపలికి వచ్చుచుండినపుడు వారికి సందేహము కలుగుచుండెడిది. ఏలననఁగాఁ గుమారి వ్రతమునుండి స్ఖలితమైన చిహ్నములు స్పష్టముగ గోచ రించు చున్నవి. అవి దాచెదమన్నను దాగవు. నిరంతరము దగ్గఱనున్నవారివద్ద దాచుట చాల కష్టము. ఒక్కొక్క ప్పుడు ద్వారపాలకులకు మగవాని నవ్వులు వినఁబడుచుండె డివి. స్త్రీ నవ్వునకును, బురుషుని నవ్వునకును భేదము కనఁ

బడుచుండును. అవశ్యము కన్యాంతఃపురమున నెవఁడో పురుషుఁడున్నట్లు విశ్వాసము కలుగుచుండెను. ఈ విషయము మహారాజునకుఁ దెలిసినచోఁ దమ్ము శూలమున గ్రుచ్చుదు రని భయపడుచుండిరి. అందువలన వారే ముందుగాఁబోయి బాణునకు విన్నవింపఁ దలఁచిరి. మరల వారిట్లనుకొనిరి :- ''ఒకవేళ నిది అసత్యమైనచో పైగా నిది మనమీఁదనే తప్పుపడును. కావున ముందుగా నీ విషయమును గూర్చి ఆలోచింపవలయును.'' అని అనుకొని వారిప్పుడన్వేషింప నారంభించిరి. ఒక దినమున వారు స్పష్టముగ ననిరుద్ధునిఁ గాంచిరి. ఆ సమయముననే పరుగెత్తుకొని పోయి భయ పడుచు నిట్లనెను :- ''ప్రభూ! మమ్ములను క్షమింపవలయును మాకొక అశుభసమాచారము తెలిసినది.''

బాణాసురుడిట్లనెను :- ''ఏమది ? మీరు వెంటనే నాకు వృత్తాంతము నంతను జెప్పుడు.''

అత్యంత భయభీతులై గడగడ వణఁకుచు నొకవృద్ధ ద్వారపాలకుఁ డిట్లనెను :-''ప్రభూ ! అవివాహితయగు రాజ కుమారి యొక్క ఆచరణము మనకు మన కులమును గళం కిత మొనర్చునట్లుగఁ గనఁబడుచున్నది.''

ఇది వినఁగానే బాణాసురుఁడు నిర్ఘాంతపోయెను. ఆతఁడు శీఘ్రముగ నిట్లనెను :-''ఏమేమి ? ఏమైనది ? ఏమై నది ? నాకు స్పష్టముగ వృత్తాంతము నంతయును జెప్పుడు.''

ద్వారపాలకుఁడిట్లనెను :- "ఏమి చెప్పుదును స్వామీ! కన్యకయొక్క అంతఃపురమున నెవఁడో పురుషుఁడు ప్రవేశించినాఁడు."

రోషస్వరమున గద్దించుచు బాణాసురుఁడిట్లనెను:- "మీ రందఱు చచ్చుటకై పోయితిరా? మీరుండఁగా నీయనర్థ మెట్లు జరిగినది?"

భయపడుచు ద్వారపాలుఁ డిట్లనెను :- "ప్రభూ! మేము మిక్కిలి జాగ్రత్తగాఁ గన్యకాంతఃపురమునరక్షించుచున్నాము. మేముండఁగా కన్యకవైపు అల్లుఁచుడు. ఆమె యింటివైపునైనఁ జూచుటకైన శక్తిలేదు. అట్టియెడ నీతఁడెట్లు ప్రవేశించినాఁడో తెలియకున్నది. మాకేమియును దోచుటలేదు."

బాణాసురుఁడిట్లనెను :- "ఎవఁడు ప్రవేశించినను ద్వారమునుండియే ప్రవేశింపవలెను గదా! మీరాతనిఁ జూడలేదా?"

ద్వారపాలకుఁడిట్లనెను :-"ప్రభూ! ద్వారముకుండా యెవఁడైనఁ బ్రవేశించినచో మమ్ముఁ బ్రతికియుండఁగనే పాతిపెట్టుఁడు; లేదా మీకేది యుచితమని తోచిన నాదండము నొసఁగుఁడు. ద్వారము కుండా మనుష్యుఁడే కాదు పక్షియైనను దూరఁబడఁజాలదని మేము దృఢముగఁ జెప్పఁగలము."

ఇది విని బాణాసురునకు మిక్కిలి విస్మయము కలిగెను. ఆతని కాశ్చర్య క్రోధములొక్కసారి కలిగెను. ఆతఁడు ద్వారపాలురతో నిట్లనెను:–"మంచిది, మనమిప్పుడే పోయి చూచెదముగాక! ఆ సాహసి యెవఁడో చూడవలయును."

సూతుఁడిట్లనెను :– "మునులారా! ఇట్లు పలికి బాణాసురుఁడు చేతిలోనికి శూలమును గైకొని, ద్వారపాలురతోఁ గన్యకాంతఃపురమునకుఁ బోయెను. ఇప్పుడసురులలో నేమి గుసగుసలు జరిగినవో ఆవర్ణనమును జెప్పెదనువినుఁడు."

---

## బాణాసురుఁ డనిరుద్ధుని బంధించుట

౧౧–౨౩

శ్లో. తం నాగపాశైర్బలినందనో బలీ
ఘ్నంతం స్వసైన్యం కుపితో బబంధహ ।
ఊషా భృశం శోకవిషాద విహ్వలా
బద్ధం నిశమ్యాశ్రు కలాక్ష్య రౌదిషీత్ ॥
శ్రీ భాగ. ౧౦ స్కం. ౬౨ అ. ౩౫ శ్లో.

క॥ క్రుద్ధుండై యహిపాశ ని
బద్ధుం గావించె నసురపాలుఁడు రణ స

న్నద్ధున్ శరవిద్ధు న్నని
రుద్ధున్ మహిత ప్రబుద్ధు నూపసమృద్ధున్॥

వ. ఇట్లు కట్టి క్రోశించిన సుషాసతి శోకవ్యాకులిత చిత్తయై యుండెనంత.

శ్రీ మదాంధ్ర భాగవతము

బాల్యకాలమందు తల్లియెడల ప్రేమ అధికముగ నుండును. కొంచెము పెద్దైన తరువాత తోఁబుట్టువులయందు ప్రేమయుండును. వృద్ధావస్థలోఁ బుత్రికలందుండును. అందువలనఁ బిల్లలు తమ తల్లులను మిక్కిలిగ గౌరవించెదరు. ఆతని తల్లివిషయమున నేదైనఁ గువాక్యములు పలికినచో నాతఁడు చచ్చుటకును జంపుటకును సిద్ధపడును. యువావస్థయందు సోదరియెడల నాసక్తముండును. ఎవరైన సోదరి విషయమున నేదైన ననినచో నది గొప్ప అవమానముగఁ దలఁచును. వృద్ధుఁడైన తరువాత పుత్రికయొక్క కీర్తి ప్రతిష్ఠలయందు మిక్కిలి ధ్యానముంచు చుందురు. పిల్లకు వయస్సు రాఁగానే ఆమె అందఱ కన్నులలోఁ బడును. ఏదోవిధముగ నామె సమ్మానపూర్వకముగఁ దనయింటికి పోవలయునని చింతిల్లుచుండును. ఆమె కేదైన నప్రతిష్ఠ వచ్చినచో మర్మాంతిక పీడ కలుగును. ఈ క్రోధావేశమున నేమైనఁ జేసిన జేయవచ్చును.

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! కుమారిగా నున్నప్పుడు తన పుత్రిక గర్భిణియని వినఁగానే బాణాసురుని యొక్క క్రోధము రోమ రోమములందు వ్యాపించెను. సుందర మృదులాసనమున శరీర మంతటను జందన మలఁదు కొని, సుందర పుష్పములను ధరించి, తాంబూల చర్వణ మొనర్చుచుఁ దన ప్రియతోఁ జదరంగ మాడుచుండుటను గాంచెను. బాణాసురుఁడు హఠాత్తుగ లోనఁ బ్రవేశించెను. తన తండ్రిని జూడఁగనే ఉష లజ్జితయయ్యెను. ఆమె వెంటనే అచ్చటినుండి లేచి యింకొక యింటిలోనికిఁ బోయెను. క్రోధమున గ్రుడ్లెఱ్ఱగ నొనర్చి బాణాసురుఁ డిట్లనెను:- "నీచా! కులాంగారా! కపటీ! ధూర్తా! నీవెవఁడవురా ? నీ వెట్లిచ్చటికిఁ జేరితివిరా?"

ఇది వినఁగానే అనిరుద్ధునకును గోపము వచ్చెను. ఆతఁడిట్లనెను:- "నేను నీయల్లుఁడను. నేను చంద్రవంశజుఁ డను. యాదవ శ్రేష్ఠుఁడగు వసుదేవుఁడు నావృద్ధ ప్రపితా మహుఁడు. శ్రీకృష్ణ భగవానుఁడు నా పితామహుఁడు. కామావతారుఁడగుఁ బ్రద్యుమ్నుఁడు నాతండ్రి. నన్ను అని రుద్ధుఁడందురు."

ఇదివిని అసురుఁ డవహేళనముతోడను, నేవగింపు తోడను నవ్వి యిట్లనెను:- "యాదవులే యిట్టి నీచమును ధర్మవిరుద్ధమునగు కార్యము నొనర్పఁగలరు. నీవంశములోని

వారి చేష్టలు లోకప్రసిద్ధములు. ముందుగా నిట్టి నీచకులాంగారుఁడవును, గామినియు, నధార్మికుఁడవుగా నుండిన నీ తండ్రి చేసిన పనులను గూర్చి వినుము. శంబరాసురుని పత్ని మాయావతి నీ తండ్రినిఁ బెంచి పోషించెను. ఆమెతో నా దుష్టుఁ డనుచితసంబంధము నేర్పఱచుకొనెను. ఛలమున నా యసురునిఁ జంపి ఆమెను హరించుకొనివచ్చెను. కామియును, విశ్వాసఘాతుకుఁడు నగు నట్టివానికి నీవంటిపుత్రుఁడు పుట్టుటలో నాశ్చర్యమేమియును లేదు. నీ తాతసంగతి లోకమంతకును దెలియును. ఆతఁడు జారచోరశిఖామణి అను సంగతి అందఱకును దెలిసినదే. ఆతని తండ్రు లెవరికినిఁ దెలియదు. మధురలో నాతఁడు తాను క్షత్రియుఁడ నని చెప్పుకొనుచున్నాఁడు. బృందావనమున నాతఁడే వైశ్య వృత్తిచే జీవించు నహీరనందనుఁడుగఁ బ్రసిద్ధి కెక్కినాఁడు. ఇప్పటికిని ఆతని నందనందనుఁ డనియు, యశోదానందనుఁ డనియుఁ బిలువబడుచున్నాఁడు. కొందఱు దేవకీనందనుఁడను చున్నారు. కొందఱు వాసుదేవుఁడను చున్నారు. బృందావనమున నున్నప్పుఁడాతడు నందుని గోవులను గాయుచుండెడువాఁడు. ఆతఁడచ్చట గోపికలతోఁ జేసినది నీకు దెలియక పోలేదు. లోకమునకును దెలియక పోలేదు. అచ్చటనుండి మధురకు రాఁగానే మేనమామను జంపివైచినాఁడు. ఒక గూనిదాసి యుండెడిది. దానితో ననుచిత

సంబంధమును బెట్టుకొనినాఁడు. దుర్బలుఁడగు నరకాసురుఁ డనువాఁడు కలఁడు. ఆతని మోసమునఁ జంపి, అచ్చటి నుండి రాజకన్యకలను హరించినాఁడు. భీష్మకుని, అల్పవీర్యుఁ డగు రుక్మిని బంధించి రుక్మిణిఁ దెచ్చినాఁడు. నరకాసురుఁ డాతని కొడుకే. స్త్రీలోభమున నాతనిఁ జంపినాఁడు. సత్రాజిత్తు సూర్య భక్తుఁడు. ఆతనిఁ జంపి, ఆతని మణిని హరించినాఁడు. ముసలివాఁడగు జాంబవంతుని బంధించి ఆతని కుమార్తెను దెచ్చినాఁడు. ఇంద్రుఁ డాతని అన్నయే. కాని స్త్రీవశుఁడై ఆతనితోఁ బోరాడి కల్పవృక్షమును హరించెను. ఆతనితండ్రి దొంగతనముగఁ గృష్ణుని గోకులమునకు జేర్చెను. ఆతఁడతి భీరువు. తన పుత్రులను జంపించెను. ఆతని చెల్లెలు కుంతి బాల్యావస్థలోనే పుత్రునిఁ గనెను. భర్తయుండఁగా నితరులవలనఁ బుత్రుఁ గనెను ఆ యైదుగురును గలిసి ఒక్క స్త్రీని వివాహమాడిరి. వసుదేవుని ఒకపుత్రుఁడు సర్వత్ర గోపీజన వల్లభుఁడని ప్రసిద్ధిని జెందెను. రెండవవాఁడు నిరంతరము కల్లునుద్రాగు బలరాముడు, ఆతఁడు తన తమ్ముని భార్యయగు యమునను క్రీడకై పిలిచెను. నీ వంశమంతయు నిట్టిదే కాని యీ సమయమున నీవు చెడ్డస్థానములోనికి వచ్చి యిరుకుకొంటివి. ఇచ్చట నేను నిన్నుఁ జంపను. నిన్ను బంధించెదను. నీ పక్షమున వచ్చు యాదవులెవరు వచ్చినను వారి నందఱను యమసదనమునకుఁ బంపెదను.

నీచా! నీవు నాకీర్తికి గళంకము నాపాదించితివిరా? నా నెత్తినఁ గాల్మోంచి, రహస్యముగ దాగి నీవు నా కవమానమును గావించితివి. నేను నిన్ను నీ పరివారమును నాశన మొనర్చెదను.''

ఇది విని గంభీరముగ ననిరుద్ధుఁడిట్లనెను :-''అసుర రాజా! నీవీ మాటల నన్నిటిని అజ్ఞానముచే, మూర్ఖముగఁ బలికితివి. నాతండ్రి నిన్నెఱుఁగఁడు. ఆతడు బ్రహ్మపుత్రుఁడగు మన్మథుఁడు. శివుని శాపమున నాతఁడనంగుఁడైనాఁడు. ఆతని పత్ని ప్రార్థింపఁగా శివుఁడు మరల వరముచే సశరీరుఁడయ్యెను. నీవు శంబరుని పత్ని మాయావతి యను చుంటివే, వాస్తవమున నామె కాముని పత్ని రతీదేవి. ఆమె తన యథార్థరూపమునగాక గుప్తముగ నున్నది. ఆమె తన ఛాయారూపమున శంబరుని భవనమున వానిని మోహితు నొనర్చుటకై యుండెడిది. మాయసీత రావణునిచే హరింపఁబడినది. యథార్థపుసీత అగ్నిలో దాగినది. ఆమె చివరకు రావణుని హరించినది. అట్లే రతీదేవి తన శత్రువునుజంపించి తనయథార్థపు పతి కడకు వచ్చెను.

నీవు మాతాత శ్రీకృష్ణచంద్రున కనేక దోషముల నాపాదించితివి. అవన్నియును మిథ్యలు. ఆతఁడు పరమేశ్వరుఁడు, పురాణపురుషుఁడు, భక్తుల కొసంగిన వరములను యథార్థమొనర్చుటకై ఆతఁడు భూమిమీఁదకు వచ్చినాఁడు.

భక్తులాతని నేమి యాచించెదరో వారికా వరముల నొసఁగు చుండును. ఆతని కీయరాని వస్తువేమియును లేదు. ఆతనికి విధినిషేధములు లేవు. ఆతనిని గర్మలు బంధింపవు. ఆతనికి బంధముక్తులు రెంటికినిఁ బరుఁడే. ఆతనికి శత్రువును లేఁడు. మిత్రుఁడును లేఁడు. ఆతని అన్న కల్లు ద్రాగునంటివి. అది వాస్తవమునఁ గల్లుకాదు, పుష్పరసము. నీవు కుంతీ, ద్రౌపదీ సంబంధమునఁ బలికినదంతయును మిథ్యలే. ఆమెకు గన్యాత్వము నష్టము కాలేదు, ఈమెకు సంబంధము ధర్మ సాక్షులగు దేవతలతోఁ గలిగెను. అందులకే వీరు ప్రాతః స్మరణీయులైరి. భగవానుఁడు స్వయముగ సాక్షాత్తుగ గోలోకమునుండి విజయ మొనర్చినాఁడు. కోట్లకొలఁదిగ గోపగోపీజనములును, గోవులును నాతని వెంట వచ్చెను. ఆతఁడందఱ కధీశ్వరుఁడు. స్వామీ. ఆతని అచింత్య లీలలను నీ వసుర ప్రకృతికి సంబంధించిన వనుకొనుచున్నావు. నీ తండ్రికిఁ దెలియును. మీతాతకు పరమేశ్వరుని, మహాత్త్వము తెలియును. ఈఉష నాకునిజముగ ధర్మపత్ని. నేను శాస్త్రాజ్ఞ చేతను, ఈమె యనుమతి తోడను నీమెను గాంధర్వవివాహ మొనర్చుకొంటిని. ఇందులో నధర్మము నన్యాయ మే మున్నది ?''

సూతుఁడిట్లనెను :- ''మునులారా! అనిరుద్ధ బాణా సురుల కీమాటలు జరుగుచుండఁగనే బాణుని మంత్రియగు

కూష్మాండుఁడు గొప్ప సేనను దీసికొని క్రోధముతో వచ్చి, పండ్లు పటపట కొఱుకుచు మిక్కిలి క్రోధముతో నిట్లనెను:- "రాజా! ఈ దుర్వినీత బాలకుఁడు మనవంశమున కవమానమును గావించినాఁడు. ఇట్టి వానితో మీరిట్లు సంభాషణ మేల చేయుచున్నారు. వీనిని వెంటనే పట్టుకొని చంపవలయును" ఇట్లు పలుకఁగానే బాణుఁడాతనికి యుద్ధమొనర్చుట కనుమతించెను. అంత సైనికులు 'కొట్టు, తన్ను, చంపు, బ్రదికియుండఁగనే పట్టుకొనుఁడు. పోనీయ వలదు.' అని యీ విధముగఁ బలుకుచు వారు శూల, పరిఘ, భుసుండి, బాణాద్యస్త్ర శస్త్రములను వర్షించిరి.

వారందఱును బ్రహార మొనర్చుటను గాంచి ప్రద్యుమ్నతనయుఁడగు ననిరుద్ధుఁడేమాత్రమును విచలితుఁడు గాక ఒక్క పరిఘను దీసికొని శత్రువులపై విరుచుకొని పడెను. ఇప్పుడు సైనికుల తిక్కకుదిరెను. చాలమంది చచ్చిపోయిరి. కొందఱకు చేతులును గాళ్లును విరిగిపోయెను. అనిరుద్ధుని ప్రహారములకు దట్టుకొనఁ జాలక సమరమును వదలి పాఱిపోయిరి. సైనికు లాతనిఁ బట్టుకొనుట కుపక్రమించుచుండెను; కాని ఆతఁడెవరికినిఁ జిక్కలేదు. గొప్ప యేదుపంది కుక్కలమూఁకను ముట్టెతోఁగొట్టి తరుమునట్లుగ నాతఁడు బాణాసురుని సైనికుల నందఱను దఱిమెను.

బాణాసురుఁ డనిరుద్ధుని యుద్ధ చాతురినిఁ గాంచి అత్యంత విస్మితుఁడయ్యెను. అతఁడు లోలోనఁ దనకూఁతు

రికిఁ దగినవరుఁడే యని సంతోషించుచునే యుండెను. ఇప్పుడు యుద్ధము చేయక బలప్రదర్శన మొనర్పక కన్యక నిచ్చినచో సర్వత్ర తనకు అపయశము కలుగఁగలదని సైనికులు పాఱిపోగానే బాణాసురుఁడు స్వయముగ వచ్చి, నాగపాశముచే ననిరుద్ధుని బంధించెను. అనిరుద్ధుడును సమ్మానార్థము బంధించెను ఈ విధముగఁ బ్రద్యుమ్న పుత్రుని బంధించి అసురుఁడు తనకడకు దీసికొనిపోయెను. అంతఃపురములోనికిఁ గొనిపోయి అత్యంత సురక్షిత స్థానమున సుఖముగ నాతని బంధించి యుంచెను.

అనిరుద్ధుని నాగపాశబద్ధు నొనర్చి బాణుఁడు తీసికొనిపోవుచుండఁగా, నుష కిటికిలోనుండి చూచి మిక్కిలి వ్యాకులమును జెందెను ? ఆతఁడామె చూపుమేఱకు తప్పుకొనఁగానే అత్యంత విషాదమున నేడ్చుచు, విహ్వలయై, అచేతనయై క్రిందఁబడెను.

ఇచ్చట ననిరుద్ధుఁడును వర్షాకాలము నాలుగు నెలలు గడిచిపోఁగానే తిరిగి ద్వారకకు రాలేదు. అప్పుడాతని బంధుబాంధవు లందఱును శోకింప నారంభించెను. అందఱును ననిరుద్ధుని రాకకెదురు చూచుచుండిరి. అంతలో వీణను మీటుచు, హరిగుణ గాన మొనర్చుచు నారదుడు ద్వారకకు వచ్చెను. ఆతఁడు వర్ష కాలమంతయును స్వర్గమునకు పైలోకములలోను భ్రమణమొనర్చుచుండెను. చాతుర్మాస్యలలో

ద్వారకకు రాలేదు. నారదునిఁగాంచఁగనే అందఱకానందము వైచెను. ఆతని చుట్టును జేరి అందఱిట్లనిరి:- "స్వామీ! అనిరుద్ధుని జాడ తెలియలేదు. మీకేమైన సమాచారము తెలిసిన చోఁ జెప్పుఁడు."

నారదుఁ డిట్లనెను:- "అదియా? బాణాసురుఁడు కేదారినాథుని సన్నిధిలో శోణితపురమున బంధించినాఁడు."

సూతుఁడిట్లనెను - "మునులారా! ఇది విని యాదవులకు మిక్కిలి కోపమువచ్చెను. వారు వెంటనే శోణితపురమునకు బోవుటకు వ్యగ్రతను గలిగియుండును. ఇప్పుడెట్లు వారు శోణితపురమునకు వచ్చిరో ఆ ప్రసంగమును జెప్పెదను వినుఁడు."

— ౯ —

## బాణాసురుని కొఱకు హరిహరుల యుద్ధము

శ్లో. బాణార్థే భగవాన్ రుద్రః ససుతైః ప్రమథైర్వృతః।
ఆరుహ్య నంది వృషభం యుయుధే రామకృష్ణయోః.
—శ్రీ భాగ. ౧౦స్కం. ౬౩అ. ౬ శ్లో.

చ. వరదుఁడు దార భక్తజన వత్సలుఁడైన హరుండు
బాణునిం, గరమనురక్తి నాత్మజుల కంటె దయామతిఁ
జూచుఁ గాన తా, దుర మొనరించు వేడ్కఁ బ్రమథుల్

గుహుఁడున్ నిజభూతకోటియున్, సరసభజింప నుజ్జ్వల
నిశాత భయంకర శూల హస్తుఁడై.

—శ్రీమదాంధ్ర భాగవతము.

భగవానుఁడు తన భక్తుల కానందమును గలుగఁ జేయుటకై సరస వీరతాపూర్ణములగు లీల లొనర్చుచుండును. వానినిఁ జదివి ఆతని భక్తులు ప్రేమ విహ్వాలులై గోదన మొనర్చుచుందురు. అజ్ఞులు మాయామోహితులై వారి చరిత్రములను సందేహించి నిందించుచుందురు. అద్దమునందు బాలకుఁడు తన ముఖమునే చూచుకొని, వానితో మధుర, హాస్య, భయానక, రౌద్ర, వీరతాపూర్ణములగు సంకేతము లొనర్చి క్రీడించు నట్లు, భగవంతుఁడును దన విభిన్నరూపములతో విభిన్న క్రీడల నొనర్చుచుండును. వానిలో రాగ ద్వేషము లుండవు. రాగ ద్వేషము లజ్ఞానుల చిహ్నములు. శ్రీహరి నిత్య జ్ఞాన స్వరూపుఁడు.

సూతుఁ డిట్లనెను :– ''మునులారా! అనిరుద్ధుఁడు బాణాసురుని కారాగృహమున బంధింపఁబడినాఁడని తెలియఁగానే యాదవు లందఱకును గోపము వచ్చెను. వారందఱు అస్త్రశస్త్రములను ధరించి చతురంగబలములతోఁ బర్వతములను దాటుకొని శోణితపురమునకుఁ జేరుకొనిరి. శ్రీకృష్ణుఁడును, బలరాముఁడును, ప్రద్యుమ్న సాత్యకి, గద, సాంబ, సారణ, నంద ఉపనంద, భద్రాది యాదవులందఱును

ననిరుద్ధుని విడిపించుటకై బాణాసురునితోఁ బోర నేతెంచిరి. వారి వెంటఁ బండ్రెండక్షౌహిణీల సేన కలదు. సేన యంతయును శ్రీకృష్ణుని యొక్క పుత్రులదియును, పౌత్రులదియును గలదు. వీరందఱును శోణితపురమునకు వచ్చి బాణాసురుని పురమునకు నలువైపులను ముట్టడించిరి.

యాదవులు భుశుండి శతఘ్నులతో సువృత్తమగు నా పరకోటను గూల్చి నగరములోనికిఁ బ్రవేశించిరి. అచ్చట రాజుయొక్క ఉద్యానవనములను, ఉపవనములను నష్టభ్రష్ట మొనర్ప నారంభించిరి. వారు రాజుయొక్క మేడయందలి గోపురాదులను, ప్రధానద్వారములను విఱుగఁగొట్ట నారంభించిరి. సింహద్వారమును బగులఁగొట్టిరి. ఈ సంగతిని బాణాసురుఁడు తెలిసికొని, ఆతఁడు వీరమానియగుటచే, తగిన సేనను దీసికొని, యాదవుల నెదుర్కొని పోరాడుటకై నగరము వెలుపలికి వచ్చెను. ఆతఁడు భవానీపతియగు రుద్రుని పాదపద్మములకుఁ బ్రణమిల్లి యిట్లు ప్రార్థించెను:- “ప్రభూ! నేఁడే నీతో పనివచ్చినది. నాకాధారము నీవే. నాపురమును శత్రువులనుండి రక్షింపుము. నవ్వి శివుఁడిట్లనెను:- “ఓయీ! జగద్రక్షకుని నుండి యెవరు రక్షింపఁగలుగుదురు? అయినను నేను నీపురమును రక్షించెదనని వరమొసంగి యుంటిని. కావున నామాటను యథాశక్తిగఁ బాలించుటకుఁ బ్రయత్నించెదను. నీవు నీసైనికులతో రణభూమికిఁ బొమ్ము.

నేను నాయనుచరులగు భూత, ప్రేత, పిశాచ, ప్రమథ, గుహ్యక, డాకినీ, శాకినీ, యాతుధాన, బేతాల, వినాయక మాతృగణ, కూష్మాండ, బ్రహ్మరాక్షసాదులను దీసికొని వచ్చెదను. నా పుత్రులగు గణపతి, షడాననులు మూషక మయూరవాహనముల నెక్కి యుద్ధమునకు వచ్చెదరు. నేనును నందినెక్కి వచ్చుచున్నాను. నేనుగృష్ణునితో ఘోర యుద్ధ మొనర్చెదను.'' ఇదివిని బాణాసురుఁడు పరమానందమును జెంది, రణశంఖమునూది బయలుదేరెను. విశాలమగు యాదవసేనను గాంచగనే ఆతని కిన్నాళ్ళకిట్టి అవకాశము చిక్కినదని సంతసించెను. తన సేనను దీసికొనివచ్చి యాదవసేన కెదురుగ నిలిపెను. యాదవసేనను సాత్యకి నడుపుచుండెను. తన సేనను స్వయముగ బాణాసురుఁడే నడుపుచుండెను. గరుడునపై నెక్కి కృష్ణుఁడు తనశార్ఙ్గ ధనుస్సునెక్కుపెట్టి యుద్ధమునకు సిద్ధమయ్యెను. ఇంతలోనే శంకరుడును దన పుత్రులతోడను, ప్రమథగణములతోడను రణభూమికి వచ్చెను. బాణాసురుఁడు వినయభావముతో భవునితో నిట్లనెను:- ''విభూ! మీరు శ్రీకృష్ణచంద్రునితో యుద్ధమొనర్ప వలయును. నేను సాత్యకినిఁ జంపి యాదవ సేనకు నాయకుఁడు లేకుండఁ జేయుదును.''

శివుఁడిట్లనెను:-''నేను నీ వెవరితోఁ బోరాడుమనిన వారితోఁ బోరాడెదను. నేను స్వతంత్రుఁడును గాను. భక్త

పరాధీనుఁడను. భక్తు లెట్లాడించిన నట్లాడెదను.'' అని పలికి శంకరుఁడు శార్ఙ్గధ్వనియగు కృష్ణునితోఁ బోరాడ నారంభించెను. శంకర పుత్రుఁడగు కుమారస్వామి కామావతారుఁడగు ప్రద్యుమ్నునితో యుద్ధమునకుఁ దలపడెను. బాణాసురుని ప్రబల పరాక్రమ పుత్రులగు కుంభాండ, కూపకర్ణులు బలరామునితోఁ దలపడిరి. బాణాసురుని పుత్రుఁడు, కృష్ణపుత్రుడగు సాంబునితోఁ దలపడెను. సాత్యకి బాణాసురులు పోరాడు చుండిరి. ఈ విధముగ వారు తమ ఉర్జీల నెన్నుకొనిరి. ఈ విధముగ వారు తమతమ బలపరాక్రములను జూపించుచుఁదుముల యుద్ధమును రోమాంచమగునట్లు చేయుచుండిరి. ఇరువైపులను నభూత పూర్వమగు యుద్ధము జరుగుచుండెను. హరిహరాత్మక యుద్ధమును గాంచుటకై దేవగణమును, సిద్ధ, చారణ, గంధర్వాప్సర, ఋషిముని యక్షరాక్షసులు విమానముల నెక్కి వచ్చిరి. విమానములచే నాకాశమంతయును నిండిపోయెను.

శివుఁడు పర్వతాకారముగనున్న దన నందిపై నెక్కి నందనందమునితో బోరాడుచుండెను. ఆతనికి వెనుక భూత, ప్రేత పిశాచ, గుహ్యక, రాక్షస, డాకినీ, శాకినీ, యోగినీ మొదలగు ప్రమథ గణములును రేకలు వేయుచుండిరి. అభవుఁడు తన అజగం ధనుస్సు నెక్కుపెట్టి కృష్ణునిపైఁ గొట్టఁగా గృష్ణుఁడును గన శార్ఙ్గధనుస్సున బాణమునెక్కిడి పినాకపాణి బాణములను వ్యర్థము గావించెను. అంత నింక ననేక బాణము

లను ప్రయోగించి భూత ప్రేత పిశాచాదులను బారద్రో లెను. అప్పుడు క్రోధమున రుద్రుఁడు గరుడధ్వజునిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. కృష్ణుఁడును బ్రహ్మాస్త్రమును ప్రయోగించి దానిని వ్యర్థము గావించెను. అప్పుడు శివుఁడు వాయవ్యాస్త్రమును ప్రయోగించెను. వాసుదేవుఁడు పర్వతాస్త్రమును ప్రయోగించి దానిని శాంతింపఁజేసెను. అంతఁగుపితుఁడై సదాశివుఁ డాగ్నేయాస్త్రమును ప్రయోగింపఁగా సర్వత్ర ప్రచండాగ్ని జ్వాలలు లేచి సమస్త బ్రహ్మాండమును భస్మమొనర్చు నట్లుండెను. అంతఁ బద్మాక్షుఁడు పర్జన్యాస్త్రమును ప్రయోగించి, వర్షముచే దాని నార్పెను. బ్రహ్మాస్త్ర, వాయవ్యాస్త్ర, ఆగ్నేయాస్త్రములు వ్యర్థములు కాఁగా శివుఁడు తన పాశుపతాస్త్రమును ప్రయోగించెను. వెంటనే భగవానుఁడు తన నారాయణాస్త్రముచే దానిని శాంతింపఁ జేసెను. తన అస్త్రము వ్యర్థమగుటను గాంచి శివుఁడు కొంచెము తటపటాయించెను. అప్పుడు కృష్ణుఁడు జృంభణాస్త్రమును ప్రయోగించెను. ఇప్పుడు శివునకు విడువకుండ నావలింతలు రా నారంభించెను. అతఁ డస్త్ర శస్త్రములను ప్రయోగించుటను మఱచిపోయెను. శివుఁడిట్లే ఆవలింతలతో నుండనిమ్మని శ్రీకృష్ణుఁడు తన గదా ఖడ్గాదులను గైకొని అసుర సేనను సంహరింప నారంభించెను. కృష్ణుని దెబ్బలకుఁ దాళజాలక బాణాసురుని సేన

వికలమై చెదరిపోయెను. ఇచ్చటఁ బ్రద్యుమ్నుని బాణము లచేఁ గార్తికేయుని శరీరము క్షతవిక్షతమయ్యెను. అతఁడు తన నెమలినెక్కి యెగిరిపోయెను. అసురసేనలోఁ బ్రసిద్ధులగు కుంభాండ, కూపకర్ణుల నిద్దరను బలరాముఁడు తన హలముచే లాగి రోకలితో బాది అచేతనులను గావించెను. తమ నాయకులు మూర్ఛపడిపోవుటను గాంచి మిగిలిన సైనికులు రణరంగమును వీడి పలాయనము గావించిరి. తన సేన పాఱిపోవుటను గాంచి బాణాసురుఁ డాశ్చర్యమును జెందెను. ఆతఁడిట్లనుకొనెను. "యాదవులకు బ్రాణ మీకృష్ణుఁడే ఈతఁ డెచ్చటికిఁ బోయిన నచ్చట వరకోత కోయునట్లు సేనను నఱకుచున్నాఁడు. కావున ముందితని నోడించ వలయు" ననుకొని క్రోధముతోఁ గృష్ణునిపైఁ బడెను. ఇప్పు డాతఁడు సాత్యకితో యుద్ధమొనర్చుటను మానివైచెను. తన రథమును గృష్ణునిముందు నిలిపెను. వీఁడు సరియైన చోటునకే చేరినాఁడని సాత్యకి గ్రహించి, ఆతఁడు బాణాసురుని వెంటఁబడక యితర యోధులతోఁ బోరాడు చుండెను.

బాణాసురునకు వేయిచేతులుకలవు. అయిదువందల చేతులలో నైదువందల ధనుస్సులు కలవు. ఆ ధనుస్సులలో నాతఁడు రెండురెండు బాణములు సంధించెను. ఈ విధముగ నాతఁడు వేయిబాణముల నొక్కసారిగాఁ గృష్ణునిపై సంధించు

చుండెను. కృష్ణుడు సిద్ధముగనే యుండెను. ఆతఁడర్ధ చంద్రాకార బాణము నెక్కిడి సంధి పఁగా నాతని బాణము లన్నియును, ధనుస్సులును ముక్కలుముక్కలయ్యెను. ఇంకను గృష్ణుఁడనేక బాణములచే బాణుని గుఱ్ఱములను, రథమును, సారథిని ముక్కలు ముక్కలుగ నొనర్చెను. అంత నుత్సాహముతోఁ బాంచజన్య శంఖము నూదెను.

రాజభవనముపై నుండి బాణాసురుని తల్లి చూచుచున్నఁ బుత్రహీనగాఁ జేయునేమోనని ఆమె దిగివచ్చి, దీర్ఘముగు దన వెంద్రుకలను విఱియఁ బోసికొని రణభూమికి వచ్చెను. ఆమె తనశరీరము మీఁదనున్న వస్త్రముల నన్నిటినిఁ దొలిగించి వైచి నగ్నయై నందనందనున కెదురుగ నిలుచుండెను. నగ్నయగు స్త్రీనిఁ గాంచుట పాపమని తెలిసికొని భగవానుఁడామెకు బెడముఖమును బెట్టెను ఆతఁడు బాణాసురుని వైపునకు జూచుటలేదు. బాణాసురునకిది అదను చిక్కుటచే నాతఁడు యుద్ధభూమి నుండి శోణితపురములోనికిఁ బోయి విశ్రాంతినిఁ దీసికొనెను.

ఇచ్చట శివుని యావలింతలు కొంత తగ్గెను. తన ప్రమథ గణములు కృష్ణుని ప్రహారమునకు విచలితు లగుటను గాంచి త్రిశిర మను నుష్ణజ్వరాస్త్రమును విడిచెను. ఆ జ్వరమునకు మూఁడు తలలు, మూఁడు కాళ్ళు. ఆ మహా ప్రబలాస్త్రము దశదిశలను దగ్ధ మొనర్చుచు దామోదరుని

పైకి వచ్చెను. అప్పుడు దానిని శాంతింపఁ జేయుటకై శీత జ్వరమును విడిచెను. ఇప్పు డా రెండు జ్వరములును గొట్టు కొని యుద్ధముచేయ నారంభించెను. అప్పుడు వైష్ణవ జ్వరము మాహేశ్వర జ్వరము నణఁచెను. ఇప్పుడు శైవ జ్వరము అఱచుట కారంభించెను. ఇప్పుడు శ్రీకృష్ణు శరణము తప్ప వేఱుపాయము లేదని తెలిసికొని, అత్యంత వినయముతో రెండు చేతులు జోడించుకొని స్తుతించుచు శ్రీకృష్ణచంద్రుని శరణు వేఁడుచు బ్రార్థింప నారంభించెను.

భయశీతమైన త్రిశిర ఉష్ణజ్వర మిట్లు ప్రార్థించెను:- "ప్రభూ! నీవనంతశక్తి సంపన్నుఁడవు. నీవు చరాచర విశ్వమంతటను బరివ్యాప్తమగు అంతరాత్మవు. నీకు సమానుఁడు గాని, మించిన వాఁడుగాని లేఁడు నీ వద్వితీయుడవు. జ్ఞానస్వరూపుఁడవు. సృష్టి స్థితి లయములకు స్వామివి. వీనికి కారణమవు అట్టి నిన్నెవఁ రెఱుగఁ గలుగుదురు? కేవలము వేదవాక్యముల చేత నే లక్షింపబడుదువు. నీవు సర్వ వికార రహితుఁడగు శుద్ధసత్యమయ పరబ్రహ్మవు. నీ పాదపద్మములకు నేను బునః పునః ప్రణామ మొనర్చు చున్నాను.

లోకములో నేది జరిగినను నీవలన నే జరుగును. ప్రపంచమున కాదికారణమవు నీవే. ఈ జగద్వృక్షమున కాది బీజమవు నీవే. కాల, దైవ, కర్మ, జీవ, స్వభావ, భూత సూక్ష్మ, శరీర, శూత్ర, అహంకార, హస్త, పాద, వాగ్గుదోపస్థ,

చక్షు, కర్ణ, నాసికా, జిహ్వా, త్వచాపృథివీ, జలాగ్ని, వాయు, ఆకాశముల సంగత మగు లింగదేహమును, ఆ లింగదేహము కర్మబీజముచే మొలకలెత్తి పెరుగును. ఇదంత యును నీమాయయొక్క పరిణామమే. ఇవన్నియు నున్నను నీవే అధిష్ఠాన మగుచున్నావు. కాని నీవు వీని కన్నిటికిని వేఱుగ నుండెదవు. నిరంతరము నిర్లేపుఁడవుగ నుండెదవు. ఇట్టి శరణాగత వత్సలుఁడవు, అశరణశరణుఁడవు. శ్యామ సుందరుఁడవునగు నీకు శరణాగతుఁడ నగుచున్నాను "

సర్వాత్మా! నీ వజుఁడవు, అవ్యక్తుఁడవు, అనాదివి, అరూపుఁడవు, అయినను లీలకొఱకు నీవే అనేకరూపములను దాల్చుచున్నావు. ఒక్కడవయ్యు ననేక మగుచున్నావు. నీవీ ప్రపంచము నడచుటకై సురగణములను, సాధువులను రక్షించుటకై, లోకధర్మమును బాలించుటకై అప్పుడప్పుడు భూమిపై నవతరించుచుందువు. ప్రపంచమునకు శాంతిమార్గ మును జూపుచుందువు. నీ యీ అవతారమును భూభార మును హరించుటకే వచ్చినది. కావున భక్తవత్సలా! తెలియనిస్థితిలో నీ జ్వరము నెడల చేసిన యపరాధమును క్షమింపుము."

ఇది విని శ్యామసుందరుఁడు నవ్వుచు నిట్లనెను :- 'మహేశ్వరజ్వరమా! నీకేమి కావలెను? నన్నింతగా స్తుతించుట యెందులకు? నీ ప్రయోజనమును దెల్పుము.

అంత మహేశ్వర జ్వాలమిట్లనెను :- 'ప్రభూ ! నేను నీ శాంత, ఉగ్ర, అతిఉల్బణ దుఃసహజ్వరముచే నత్యంత సంతప్తుండ నగుచున్నాను. ఈ శీతతాపము నన్నుఁ దాపిత మొనర్చుచున్నది. నీ యెదుట నుండుట మంచిది కాదు. దేహధారుల కాశాపాశములతో నున్నంతవఱకే తాపములు కలుగుచుండును. నీ శరణమునకు వచ్చిన వారికిఁ ద్రివిధతాపములు నశించుచున్నవి. అట్టియెడ మీ శరణమునకు వచ్చిన నా తాప మెట్లుండఁగలదు ?'

త్రిశిరామాహేశ్వర జ్వరము స్తుతించిన నీ స్తోత్రము విని మందహాస మొనర్చుచు మాధవుఁ డిట్లనెను :- త్రిశిరజ్వరమా ! నీవు ప్రాణులకు మూఁడవదినమునఁ జలితో గూడి వచ్చెదవు. నీవు రాఁగానే ప్రాణుల శరీరముష్ణమగును. నేను నీ స్తుతిచేఁ బ్రసన్నుఁడనైతిని నీకు నా జ్వరమున భయముండదు. ఇంతేకాదు. మనకిద్దఱకును జరిగిన నీ సంవాదమును నెవరు వినెదరో వారికి నీ భయ ముండఁజాలదు.''

సూతుఁ డిట్లనెను:- 'మునులారా! భగవానుని యిట్టి వరమును విని త్రిశిరమాహేశ్వర జ్వరము భగవానుని పాద పద్మములకుఁ బ్రణామమును గావించి యథాస్థానమునకుఁ బోయెను. ఇంతలోనే శోణితపురము నుండి నూతన రథముతోడను, నూతనోత్సాహముతోడను బాణాసురుఁడు మరల వాసుదేవునితోఁ బోరాడవచ్చెను. ఇప్పుడు వీరికిద్దరకును జరిగిన భయంకర యుద్ధమునుగూర్చి మీకు వర్ణించెదను.''

---

# ఉషానిరుద్ధుల చరిత్ర సమాప్తము

శ్లో॥ ఇతి లబ్ధ్వాభయంకృష్ణం ప్రణమ్య శిరసాసురః ।
ప్రాద్యుమ్నిం రథమారోప్య సవధ్వా సముపానయత్ ॥
అక్షౌహిణ్యా పరివృతం సువాసః సమలంకృతమ్ ।
సపత్నీకం పురస్కృత్య యయౌ రుద్రానుమోదితః ॥

శ్రీభాగ. ౧౦. స్కం. ౬౩అ. ౫౦,౫౧శ్లో.

క॥ కనకరథంబున నిడికొని
ఘనవైభవ మొప్పఁగన్యకా యుక్తముగా
ననిరుద్ధుని గోవిందుం
డనుమోదింపంగఁదెచ్చి యర్పించె నృపా ॥

ఉ॥ అంత మురాంతకుండు త్రిపురాంతకు వీడ్కొని బాణు
నిల్పి య, త్యంత విభూతిమై నిజబలావలితోఁ జనుదేర
నాయుషా, కాంతుఁడు మున్నుగాఁ పటహకాహళ
తూర్యనినాదపూరితా, శాంతరుఁడై వెసంజనియె నాత్మ
పురీముఖుఁడై ముదంబునన్ ॥

—శ్రీ మదాంధ్రభాగవతము.

అన్నదమ్ములిద్దరు నాటకములలో వేషములు వైచి రెండు పక్షములను వహించి పోరాడుకొందురు. ఒకరొకరు కొట్టుకొందురు. విసరి కొట్టుదురు. తిట్టుకొందురు. నాటకము పూర్తి కాఁగానే నవ్వుచుఁ బ్రేమతోఁ గలిసికొందురు. వారిలో వారు తమతమ అభినయమెట్లున్నదని అడుగుకొనుచుందురు. అదే విధముగ భగవానుఁడును బ్రహ్మ విష్ణు

రుద్ర, సురాసుర రూపములను ధరించి క్రీడించుచుఁబరస్ప రము పోరాడుకొనుచుందురు. అజ్ఞానులు వాస్తవముగఁ బోరాడు చుండి రనుకొనుచుందురు; కాని యెవని మాయ నాశ్రయించి యిదంతయును జరుగుచున్నదో, దానిలో వాస్తవికత యెచ్చటిది ? ఇది అంతయు నాతనికి వినోదము. హరి హరులు పరస్పరము భిన్నులు కారు. అభిన్నులు. క్రీడ కొఱకై వారు భిన్నులుగఁ దోచుచుందురు. పరస్పరము పోరాడుకొనుచుందురు. ఒకరొకరి నోడించుకొనుచుందురు. కాని వారికి జయాపజయము లెక్కడివి. వారజితులు, అపరా జితులు.

శుక దేవుఁడిట్లనెను :-"రాజా! భగవానుని వలన నభయమును బొంది మాహేశ్వరజ్వము పోఁగానే బాణాసు రుఁడు మరల రథముపై నెక్కి యుద్ధమొనర్చుటకై భగవా నుని సమ్ముఖమునకు వచ్చెను. ఈ సారి ఆతఁడు నూతన రథముపై నెక్కి నూతనోత్సాహముతో రణభూమికి వచ్చెను. రాఁగానే ఆతఁడు తన సహస్రభుజములతోఁ జక్రపాణిమీఁద వివిధాస్త్రములను వర్షింప నారభించెను.వర్ష ధారలకు సు మేరు పర్వతమెట్లు చలింపదో,అట్లే వాని యస్త్రములకు కృష్ణుఁడు చలింపలేదు. ఈ యసురుఁడెడతెగక అస్త్రశస్త్రములను నిరంతరము వర్షించుచున్నాఁడని తెలిసికొని భగవానుఁ డిట్లనుకొనెను :- "వీనితో నింతసేపు అస్త్రశస్త్రయుద్ధము

చేయుటెట్లు? వీని సహస్రభుజములను దెగఁగొట్టినచోఁ బీడవదలిపోవును" అని విచారించి కృష్ణుడాతని విశాలబాహువులను వేయింటిని నఱకుచుండెను. దూరమునుండి శంకరుఁడిది చూచుచుండెను. అప్పుడు వెంటనే ఆతఁడు చక్రపాణి కడకు బోయి అత్యంత నమ్రతతో నంజలిని ఘటించి ఆతని నిట్లు స్తుతింప నారంభించెను. :- "ప్రభూ! నీవు పరమజ్యోతి స్వరూపుఁడవు. సర్వవ్యాపకుఁడవు. అజుఁడవు. అనాదివి. అచ్యుతుఁడవు. నిర్వికారుఁడవు. నిర్లేపుఁడవు. నిరంజనుఁడవు. నిత్యుఁడవు. నీ సత్తాచేతనే యీ ప్రపంచమంతయును సత్యముగఁదోఁచుచున్నది." ఈవిధముగ గూఢ జ్ఞానయుక్తమగు గొప్పస్తోత్రమును జేసి చివరకిట్లనెను :- 'ప్రభూ! ఈ బాణాసురుఁడు నా భక్తుఁడు. వీనికి నేనభయప్రదానమొనర్చితిని. నీవు నామాటను దక్కింపవలెను. వీని ప్రపితామహుఁడగు ప్రహ్లాదునెట్లజరామరునిగా నొనర్చితివో అట్లే వీనికిని అభయ ప్రదానమొసంగుము. వీనినిఁజంపవలదు. వీఁడును నీకృపనుబొంది నిర్భయుఁడు కావలయును."

ఇది విని భగవానుఁడు బిగ్గఱగ పకపక నవ్వి యిట్లనెను :- "శంకరా! నీవు ధన్యుఁడవు. నీవన్యులెందులకు కావు. నీవు భోళాశంకరుఁడవు. నీ హృదయము, అనుగ్రహ, దయలచే నిండియున్నది. విభూ! నీవభయమొసఁగిన వానిని నేనెట్లు చంపగలను? నేను నీయాలోచనము ననుసరించియే

వీని గర్వము నణఁచుటకై వచ్చితిని. వీనికతి బలగర్వము కలదు. వీఁడు ప్రపంచమున నెవ్వని లక్ష్యపెట్టకున్నాఁడు. వీడు నీతోడను బోరుటకు సిద్ధపడినాఁడు కదా! వీఁడిట్లనెను వాఁడు:-"నాభుజములు భారరూపములైనవి. నాయీ చేతులు గులపుట్టుచున్నవి. నీవు తప్ప వీనితోఁ బోరాడువాఁడు లేఁడనుకొనుచుండెడువాఁడు." అప్పుడు నీవిట్లంటివి :- "నాతో సమానుఁడగువాఁడే వచ్చినీగర్వము ఖర్వమొనర్పఁ గలఁడు." నేను నీయాజ్ఞను బాలించితిని."

శివుఁడిట్లనెను :- "స్వామీ! వీఁడు మూర్ఖుఁడు. ఒక్కసారి నావాఁడని అనుకొనిన తరువాత నాతఁడపరాధ మొనర్చినను బెద్దలా యపరాధమును క్షమించెదరు."

భగవానుఁడిట్లనెను :- "అయితే మంచిది. నాకును వీనినిఁ జంపు నిచ్ఛలేదు. వీఁడు నాపరమభక్తుఁడగు విరోచనుని పుత్రుఁడగు బలిచక్రవర్తి తనయుఁడు. బలికి నేను సపరివారముగ నభయప్రదాన మొసంగితిని. అట్టియెడ నాతని పుత్రుని నేనెట్లు చంపగలను? వీని పితామహుఁడగు బ్రహ్లాదునకును నేను వానివంశములోని వాని నెవనినిఁ జంపనని మాట నిచ్చియుంటిని."

శంకరుఁ డిట్లనెను :- "స్వామీ! చంపుటెందులకు? నీవు బూరుగు కొమ్మలను నఱకినట్లు వీని చేతులను నఱకితివి."

నవ్వి భగవానుఁడిట్లనెను :- "శంకరా! నీవు బోళా శంకరుఁడవు. వెనుక ముందులాలోచింపవు. తీర్థమునకుఁ

బోయిన బోడిచేసికొనిన జాలునన్నట్లుండును. నీయెదుటకు వచ్చువారికి నీవు కన్నులను మూసికొని వరముల నొసంగు చుందువు. నీవు వీనికి సహస్రభుజముల నొసంగితివి. అవి వీనికి భారభూతములే. వీఁడు సహస్రభుజములతో నీయుప ద్రవములను గాక యింకేమి చేయఁగలఁడు ? అందువలన నేను వీని భుజములను ఖండించితిని. ఇఁక నిచ్చటనుండి వీనికి నాల్గుచేతులుమాత్రమే యుండఁగలవు. ఈతఁడు జరామరుఁడు కాఁగలఁడు. వీని నెవరును ఖండింపఁజాలరు. ఈచతుర్భుజుఁడగు బాణాసురుఁడు నీపార్షదులలోముఖ్యుఁడు కాఁగలఁడు. ఇక వీని కేభయము నుండజాలదు.''

ఇది విని శివుఁడానందమును జెందెను. ఆతఁడు బాణాసురునకొక దివ్యస్తోత్రము నొసంగెను. ఆ స్తోత్రమున నాతఁడు వాసుదేవుని స్తుతించెను. నతమస్తకుఁడై ఆతని పాదపద్మములకుఁ బ్రణామమును గావించెను. భగవానుఁ డును నాతని స్నేహాభరిత దృష్టితోఁ గాంచి, అభయ ప్రదానమొసంగెను. ఇప్పుడు సంధి జరిగినది. శంకరుని ప్రభావముచే బాణాసురుని కోర్కెలన్నియును నెఱవేరెను. తన పుత్రికకు మంచి సంబంధము లభించెను. నగరమునకుఁ బోయి, ఆతఁడు దివ్యరథమును సిద్ధమొనర్చి దానిలో స్నానమొనర్చి, దివ్యవస్త్రాభరణాదులతో నలంకరింపఁబడిన ఉషను, అనిరుద్ధునిఁ గూర్చుండఁబెట్టెను. ముందువాద్యములు

మ్రోగుచుండెను. మిక్కిలి ఆనందముతో వధూవరులను దీసికొని భగవత్సన్నిధిలోనుండిరి. అరణము క్రింద అనేకము లగు గజ, తురగ, రథ, సువర్ణ, మణి, మాణిక్య, మౌక్తిక, వస్త్రాభరణ, గంధ, చందన, వ్యాఘ్రచర్మ, కంబళ, శాల్వ, దాస, దాసీ మొదలగు గృహోపకరణముల నెన్నిటినో యొసంగెను. అతఁడు సమస్తవస్తువులను గ్రహించి, శివుని యనుజ్ఞను గైకొని, అనంతమగు యాదవసేనా పరివృతుఁడై శ్యామసుందరుఁడు తన పురమగు ద్వారకానగరమునకు రాఁగా నూతనవధువుఁతోఁగూడిన ననిరుద్ధునిగాంచిఅందఱును హర్షించిరి. నగరవాసులందఱును విజయుఁడైవచ్చిన భగవానునకును, అనిరుద్ధునకును స్వాగతసత్కారముల నొసంగిరి. పురవాసులందఱును జయజయధ్వానము లొనర్చుచు వధూవరుల వెనుక నడుచుచుండిరి. ముందు వేదఘోష నొనర్చుచు వేదజ్ఞులగు బ్రాహ్మణులు నడుచుచుండిరి. శంఖ, పణవ, దుందుభి మొదలగు వాద్యములు మ్రోగుచుండెను. అచ్చటచ్చట ద్వారములు నిర్మింపఁబడెను. అచ్చట తోరణ ధ్వజపతాకాదులు వ్రేలాడఁగట్టఁబడెను. రాజమార్గములందును, సందుగొందులందును సుగంధజలములు చల్లఁబడెను. ఈవిధముగ సమ్భృతముగ నలంకరింపఁబడిన నగరములోని కందఱును బ్రవేశించిరి.

సూతుఁడిట్లనెను :- "మునులారా! నేనత్యంత సంక్షేపముగను ననిరుద్ధుల చరిత్రమును జెప్పితిని. ఈ కథా

ప్రసంగమున శంకరకృష్ణుల యుద్ధమును వర్ణింపఁబడినది. శంకరకృష్ణులు వేఱువేఱు కారు. ఒక్కఁడే రెండురూపములను ధరించినాఁడు. వీరి యుద్ధ మజ్ఞానముచేఁగాని లోభముచేఁ గాని జరిగినది కాదు. ఇది కేవలము లోకవల్లీల. హరి హరాత్మక యుద్ధప్రసంగము నెవఁడు ప్రేమపూర్వకముగ శ్రవణమొనర్చునో వానికిఁ బరాభవ మెన్నటికిని గలుగదు. ఏ కుమారి యీప్రసంగమును వినునో, ఆమెకు సుందరుఁడును, స్వస్థుఁడునగు వరుఁడు లభింపఁగలడు. వివాహిత స్త్రీలు వినినచోఁ బుత్రులు కలుగుదురు. నిర్ధనుఁడు వినిన ధనము లభించును. భక్తుఁడు వినినచో భగవానుని యందహైతుక భక్తి కలుగును. ఏ శూర వీరుఁడీ ప్రసంగమును ప్రాతః కాలమున నిద్రలేవఁగానే వినునో వానికిఁ బరాభవ మెన్నటి కినిఁ గలుగదు.''

ఇది విని శౌనకుఁ డిట్లనెను:-''సూతా! మాధవుని లీల లన్నియును చాల మధురముగ నుండును. భగవానుఁడు ద్వారక యందుండి చేసిన ప్రసిద్ధలీల నొక దానినిఁ జెప్పుఁడు.''

సూతుఁ డిట్లనెను :-''స్వామీ ! భగవానుఁ డెట్లనం తుఁడో ఆతని లీలలును ననంతములే. భగవానుఁడు బ్రహ్మణ్యదేవుఁడు. ఆతఁడు బ్రాహ్మణులను సన్మానించు టకే భగవంతుఁ డవతరించినాఁడు. సదా ఆతని పుత్రుల

కును, భ్రాతులకును దీనినే నేర్పెదు వాఁడు. ఈ ప్రసంగ మున భగవానుఁడు నృగమహారాజు నెట్లుద్ధరించినదియును, ఆతని పుత్ర పౌత్రుల కెట్టి శిక్షణ నొసంగినదియును మీకుఁ జెప్పెదను. మీ రందఱును సమాహిత చిత్తులరై శ్రవణ మొనర్పుడు.''



## నృగోద్ధారము

శ్లో. నృగో నామ నరేంద్రోఽహ మిక్ష్వాకు తనయః ప్రభో ।
దానిష్వా ఖ్యాయ మానేషు యది తే కర్ణమస్పృశమ్.

శ్రీ భాగ. ౧౦ స్కం. ౬౪ అ. ౧౦ శ్లో.

శా. ఏ నిక్ష్వాకు తనూజుఁడన్ నృగుఁడు నా నేపారు భూపాలుఁ
డన్, దీన వ్రాతము నర్థిఁ బ్రోచుచు ధరిత్రీ నాయకుల్
గొల్చి స, మ్మానింపం జతురంత భూ భరణ సామర్థ్యం
డనై సంతత, శ్రీ నిండారినవాఁడ నుల్లసిత కీర్తి స్ఫూర్తి
శోభిల్లఁగన్.

—శ్రీమదాంధ్ర భాగవతము.

భక్తుల గొప్పదనమును లోకమునకు వెల్లడి చేయుటయే భగవానుని స్వభావము. తన ఆశ్రితులను బ్రశంసించి ప్రశంసించి ఆతఁడు తృప్తినిఁ జెందఁడు. భగవంతున కేకాదు, ఆతని భక్తులకును నిదియే స్వభావము. భక్తుఁ డందఱకును

గౌరవమును జూపించును. ఇతరుని సమ్మానింపకుండిన వాఁడు భక్తుఁడు కాఁడు. తానవమానమును బొందుచు నితరులకు గౌరవము నొసంగువాఁడు భక్తుఁడు. భగవానుఁడు జగత్పూజ్యుడు. ఆతఁడును బ్రాహ్మణులను దన దేవతలుగ భావించును.

సూతుఁ డిట్లనెను :- మునులారా! ఒక దినమున సాంబ, ప్రద్యుమ్న, చారుభాను, గదాది యాదవ రాజకుమారులు చాల మంది వనోపవనములందు విహరింపఁజాల దూరము పోయిరి. వీరు పెద్దవారైనను తండ్రులు, తాతలును, నింకను బ్రదికియుండుటచే రాజకుమారులని పిలువఁబడిరి. అందఱును యువకులు, వినోద ప్రియులు, సమవయస్కులు, పోయిపోయి వీరు చాల దూరము పోయిరి. అచ్చటికిఁ బోఁగానే వీరి కత్యంత దాహమువైచెను. అందువలన వా రటునిటుఁ బోయి జలము నన్వేషించుచుండిరి. కొంత దూరము పోఁగానే వీరికొక పెద్ద బావి కనఁబడెను. దానిలోనికి దొంగి చూడఁగాఁ బర్వతాకారముగ నుండిన నొక జీవము దానిలోఁ గనఁబడెను. ఇంతటి పెద్ద జంతువును వారెన్నడును జూడలేదు. అంద ఱిట్లనుకొనిరి - "ఈ జీవ మెచ్చటనుండియో వచ్చి యీ కూపమునఁ బడియుండును. దీని నెట్లైన బయటకు దీయవలయును" ఇట్లాలోచించి వారు నీటినిఁ ద్రాగుటను మఱచి, బయటకు దీయుటకుఁ బ్రయ

త్నించుచుండిరి. ఇది యీ రూపమున నట్లే యుండినచోఁ జావఁగలదనుకొనిరి. వారికి దానిపై దయ కలిగెను. ఇంకొక విచిత్రమేమనఁగా నది సువర్ణమువలె మెఱయుచుండెను. ఇది సాధారణమైన జీవము కాదనుకొని దానిని బావినుండి వెలికిఁ దీయుటకుఁ బ్రయత్నించిరి. ముందుగా వారు గట్టి మోఁకులను తెచ్చి కట్టి లాగ నారంభించిరి. కాని వాని వలన నది రాలేదు. అంతఁ జర్మముతోఁ జేయఁబడిన గట్టి మోకులను దెచ్చిరి. వాని వలనను నది అలవికాలేదు. బయటకు రానేరాలేదు.

చివరకు కొందఱు రాజకుమారులు భగవానునకీ విషయము నిట్లని వేదించిరి:- "ప్రభూ! ఒక అద్భుత విషయము కలదు. మేము విహారముకొఱకై వనములోనికిఁ బోయితిమి. అచ్చట బావిలో నొక విలక్షణమగు జంతువు కనఁబడినది. అది సువర్ణమయముగఁ గొండంతగా నున్నది. అది చాల విలక్షణమగు జంతువు. మేము దానిని బావినుండి బయటకు దీయుటకై అనేక ప్రయత్నము లొనర్చితిమి. కాని అది బయటకు రాలేదు. దాని శరీరము నవనీతమువలె నున్నగా నున్నది. మూఁతిమీఁద ముండ్లవలె వెంట్రుకలుండెను. అది రహస్యమయముగ నోటినిఁ గదిలించుచున్నది. ఇదే జంతువో తెలిసికొనవలయునను కుతూహలము కలుగుచున్నది."

తన పిల్లల యీ ఉత్సుకతను గాంచి భగవానుఁడు వారివెంట రథముపై నెక్కి అచ్చటికి వచ్చెను. కమల

నయనుఁడును, విస్వంభరుఁడు దానినిఁ గాంచి నవ్వెను. తమారులతో నాతఁ డిట్లనెను:- "ఛీ! ఛీ! మీరీ చిన్నజంతువును గూడ బయటకుఁ దీయఁజాలకున్నారు." అని పలికి భగవానుఁడు తన యెడమచేతిని బావిలోనికి జొనిపి వెంటనే దానిని బయటకు తీసివైచెను. భగవానుని యొక్క ఆ పావన స్పర్శ తగులఁగానే అది ఆ శరీరమును త్యజించి, అందఱును జూచుచుండఁగనే దివ్యరూపముగల దేవతయయ్యెను. ఆ సమయమున నాతని తేజః ప్రకాశముచే దశదిశలును వెలిగిపోవుచుండెను. తప్తకాంచనమువలె మిఱుమిట్లు గొలుపుచుండెను. బహు మూల్యములగు వస్త్రములను, దివ్యాతి దివ్యములగు నాభరణములను ధరించుటచే శరీరమంతయును శోభాయమానముగ నుండెను. ఆతఁ డమ్లానసుగంధ పుష్పమాలలను ధరించియుండెను. ఆతఁడు చేతులను జోడించుకొని, నతమస్తకుఁడై వినీతభావముతో భగవానుని సమీపమున నిలుచుండెను.

భగవంతునకుఁ దెలియని దేమియును లేదు. అన్నియును దెలియును. అయినను సర్వసాధారణుఁడ సమాచారమునంతను దెలిసికొనవలయును. ఆతని కిట్టిజన్మ యేల వచ్చినదో అందఱకును తెలిసిన లోకమునకు మేలుగలుగఁ గలదనుకొని భగవానుఁ డాతని నిట్లడిగెను:- "మహాభాగా! నీ వెవఁడవు? నీ వెవఁడవో శ్రేష్ఠ దేవతవుగాఁ గనఁబడు

చున్నావు. ఏలననఁగా నీ రూప మత్యంత మనోహరముగ నున్నది. నీ వింతవఱ కిట్టి అధమజన్మలో నున్నఁవాడ విట్లు హఠాత్తుగా దేవత వెట్లైతివి? నిన్నుఁజూడఁగా భవ్యుఁడవుగఁ గనఁబడుచున్నావు. ఈ యధమజన్మ నీ కే యపరాధమునఁ బ్రాప్తించినది. నీ ఓజః తేజ, రూప, సౌందర్యమును గాంచిన నీ కీ జన్మ రావలసినది కాదని తోఁచుచున్నది. నీ కీ యూసరవిల్లిగా నగుట కే పాపము సంభవించినది? ఊసర విల్లైసను సామాన్యపుదికాదు. ఇంతటి గొప్ప శరీరము గల యూసరవిల్లిని మే మెన్నడును జూడలేదు. ఇప్పుడు నీవు దేవతవై తివి. బహుశః నీవు నీ పూర్వజన్మ వృత్తాంతమును నెఱిఁగియుందువు. మాకు దాచవలసినపని లేకుండిన సమస్త వృత్తాంతమును బూర్ణముగఁ జెప్పుము.''

భగవానుఁ డిట్లు ప్రశ్నింపఁగా దేవస్వరూపుఁడగు నా పురుషుఁడు సూర్యునివలె వెలుఁగు దన కిరీటముతోఁ గూడిన మస్తకమును గృష్ణుని పాదపద్మములందుంచి, శ్రద్ధాభక్తులతోఁ బ్రణామమొనరించి, యిట్లు చెప్పఁదొడంగెను:- ''ప్రభూ! మనుపుత్రుఁడగు నిక్ష్వాకుని పేరును మీరు వినియే యుందురు. నే నిక్ష్వాకు పుత్రుఁడను. నేను జాల కాలము సప్తద్వీపవతి యగు వసుంధరను ధర్మముగఁ బాలించితిని. ఆ దినములలో నేను బ్రపంచమున గొప్పదాతనను బ్రసిద్ధిని బడసితిని. మీరు దాతలగు రాజులలోఁ బురాణము లందు నృగుని పేరును వినియుందురు. ఆ నృగుఁడను నేనే.''

భగవానుఁ డాశ్చర్యమును బ్రకటించుచు నిట్లనెను:- "మహాభాగా! నీవు రాజర్షి నృగుఁడవా? ధన్యవాదములు, ధన్యవాదములు. నీ నామమును మేము నిత్యమును వినుచుందుము. నృగునితో సమానముగ దానము చేయగలవాఁ డెవఁడున్నాఁడు? రాజా! మేము మీ దానమునుగూర్చి వినఁగోరుచున్నాము. నీ కింతటి పేరెట్లు వచ్చినది? మీ కీర్తి యింతగా నిలుచుటకై నీ వింతటి దాన మేమిచేసితివి? సూర్య, చంద్రతారకలున్నంతవఱకు నీ కీర్తి అక్షుణ్ణముగ నుండఁగలదు. నీవు నీకు సంబంధించిన విషయములను మాకు విస్తారముగఁ జెప్పుము."

భగవదాజ్ఞను బొంది, ఆతని చరణములకు మరల నమస్కారమొనర్చి నృగుఁడిట్లనెను :- "జగన్నాథా! నీవు సర్వాంతర్యామివి. సమస్త భూతాంతఃకరణములందు నీవు సాక్షిరూపముగ నిరంతరము విరాజిల్లుచుందువు. జీవుని యొక్క శుభాశుభకర్మలు నీకు తెలియని వేమియును లేవు. నీకు నేను జెప్పుట వ్యర్థము. ఏలననఁగా నీ దృష్టినిఁ గాలమును నడ్డగింపఁజాలదు. నీవు కాలస్వరూపుఁడవు. అయినను నీవాజ్ఞాపించు నెడల నేను నా పూర్వజన్మ వృత్తాంతమును జెప్పెదను. ఏలననఁగా నీ యాజ్ఞాపాలన మొనర్చుట ప్రాణులకు బరమకర్తవ్యము. సరే, ముందుగా నేను నాదానమును గూర్చి అడిగినారు కావున దానినిగూర్చి చెప్పెదను.

స్వామీ! నానోరు నా దానమును గూర్చి చెప్పఁ గొనుటవలన దాని మహాత్మ్యము తరిగిపోఁగలదు. పుణ్యము నష్టమగును. కాని నీయాజ్ఞయై నపుడిఁకఁ జెప్ప తీరవలసిన దే. ప్రపంచమున నన్నిటికంటె గొప్పదానము గోదానము. గోవుయొక్క రోమరోమమున దేవత లున్నారు. ముప్పది మూఁడు కోట్ల దేవతలు గోవు శరీరమందు గలరు. గోదానము నొనర్చిన నన్ని దానములను జేసినట్లే కాఁగలదు. నే నెన్ని గోదానముల నొనర్చితినో దానిఁ జెప్పవీలు లేదు. పృథివి యందెన్ని రజకణము లున్నవో, వర్షము కురిసెయు నపుడు వర్షధార లెన్ని కలవో, ఆకాశమున తారకాగణ మెంతయున్నదో వానిని లెక్కపెట్టుట కెట్లు వీలు లేదో, అట్లే నేను జేసిన గోదానములను లెక్కించుటకు వీలుండదు. అసంఖ్యాకములగు గోవులను నేను దాన మొనర్చితిని. గోవు లైనను ముసలవి ముతకవి కావు. బాగుగాఁ బాల నొసంగు పాడియావులను వత్సములతో నొసంగితిని. ఆ గోవు లన్నియును సుందరములు. గొడ్డుబోతు ఆవులందు లేనే లేవు. అన్నియును శీలము కలవి. సాధువులు. వాని పాలు చిక్కగ నుండును. ఆ పాలలో నుండి నాల్గవ వంతు నేయి వచ్చెడిది. నేను గోవులనైనను స్వర్ణశృంగములతోడను, రౌప్యఖురముల తోడను నొసంగితిని. అవి యెచ్చటినుండియో తేఁబడినవి కావు. న్యాయార్జిత విత్తముతోఁ గొనియుంటిని. ఆ గోవు

లపై దుశ్శాలువను గప్పితిని. వాని నెవరికో కాదు. అపా త్రుల కీయలేదు. వేదజ్ఞులును, గుణశీలములు కలవారును; సదాచారములును, తపోనిరతులును, శాంతులును, దాంతులును, వేదపాఠులును, బహుకుటుంబీకులును, శిష్యులకు విద్యను గఱపు బ్రాహ్మణులు కొసంగితిని. సుందరములగు అశ్వ, గజములను సుయోగ్యులకు గన్యకలను ధన, ధాన్య, దాస, దాసీజనములను, గృహోపయోగకరములగు నితర సామగ్రులను, తిలపర్వతములను, రజిత, సువర్ణ, శయ్యా, వస్త్ర, రత్న, రథాది సామగ్రులును నేను సదాదాన మొనర్చెడు వాఁడును. దానములను జేయుటయే కాక నేను చాల యజ్ఞయాగాదుల నొనర్చితిని. కూపములను ద్రవ్వించితిని. వనముల నాటించితిని. వాపీ తటాకములను నిర్మించితిని. సత్రములను, బాటశాలలను గట్టించితిని. ఉదారముగ నత్యంతానందమున నేనీ కర్మల నన్నిటి నొనర్చితిని. ఇన్ని చేసినను నా ప్రారబ్ధవశమున నాకొక్క అపరాధము సంభవించినది. నా దానకారణమున నొక బ్రాహ్మణుని చిత్తము దుఃఖపడినది. దాని పరిణామ స్వరూపమున నాకిట్టి నీచజన్మ ప్రాప్తించినది.''

భగవానుఁ డిట్లడిగెను:-''ఏమి జరిగినది? ఆ యపరాధ మేమి? నిట్టూర్పును విడిచి నృగమహారా జిట్లనెను :- ఏమైనది స్వామీ! ఒకానొకప్పు డొక యాజ్ఞిక బ్రాహ్మ

ణుని యజ్ఞధేనువు వచ్చి మా ఆవుల మందలోఁ గలిసినది. అప్పుడు నేను నిత్యమును లక్షల కొలఁదిగ నావులను దాన మొనర్చు చుండెడివాఁడను. సేవకులు దానమును జేయఁ వలసిన గోవుల నలంకరించునపుడు వారికి దెలియక దీనిని గూడ అలంకరించిరి. ఈ సంగతి నాకేమియును దెలియదు.

నేను నిత్యమును దానము చేసినట్లు, ఆ గోవులతో బాటుగా దీనిని గూడ దానమొనర్చితిని. ఆ బ్రాహ్మణుఁడింతటి సుందర ధేనువును గాంచి ముగ్ధుఁడయ్యెను. ఆతఁడా గోవును మిక్కిలి సంతోషముతోఁ గొనిపోయెను. ఈ గోవు యే బ్రాహ్మణునిదో, ఆ బ్రాహ్మణునకిది లేకున్న యజ్ఞము పూర్తికాదు కావున దానిని సర్వత్ర వెదకుచు నాతఁడు వచ్చెను. యజ్ఞములో నేగోవుయొక్క పాలు, నేయి ఆహుతులకై వినియోగింపఁబడునో ఆ ధేనువును గాపాడవలసిన అవసర మా యాజ్ఞకునకు గలదు. దానినిఁ బోఁగొట్టుకొన్నను, లేక అది చచ్చినను జాలపాపము సంభవించును. యజ్ఞము పూర్తికాదు. దైవవశమున దానమును గొనిన బ్రాహ్మణుఁడా యావును గొనిపోవునపుడు దారిలో నావును వెదకికొనుచు నీ బ్రాహ్మణుఁడు కనఁబడెను. తన యజ్ఞధేనువును జూచునప్పటికా బ్రాహ్మణుని రోమములు నిక్కఁబొడిచెను. ఆతని యానందమునకు మేఱలేకుండెను. ఆతఁడు మిక్కిలి స్నేహముతో గోవును గొనిపోవు బ్రాహ్మణునితో

నిట్లనెను:-"చాల సంతోషము. మీరు నా గోవును బట్టుకొంటిరి. దీని కొఱకు నేనత్యంత వ్యాకుల పడుచున్నాను."

ఇది విని దానమును దెచ్చుకొను బ్రాహ్మణుఁడు మిక్కిలి చకితుఁడై అవహేళనా స్వరమున నిట్లనెను :- "విప్రోత్తమా ! నీవు మత్తుమందు త్రాగలేదుగదా ! నా గోవును గాంచి నీగోవు అనుచుంటివేమి ?"

గోవున కధిపతియగు బ్రాహ్మణుఁ డిట్లను.-"బ్రాహ్మణుఁడవయ్యు నీవసత్యమును బలుకుచున్నావు. సిగ్గుచేటు. ఈ గోవు నీదెట్లైనది. ? నీవు దీని నెచ్చటనుండి కొని తెచ్చితివి ?"

ఆ బ్రాహ్మణుఁడు క్రోధస్వరమున నిట్లనెను:- "నేనా అసత్యమాడుచున్నది ? నీవే అసత్యములు పలుకుచున్నావు. నేనీ గోవును గొనలేదు. నాకు నృగమహారాజు దానమొసంగినాఁడు"

అగ్నిహోత్రియగు బ్రాహ్మణుఁడు క్రోధముతో నిట్లనెను:-"ఇతరుల గోవును దానమొసంగుటకు నృగుఁడెవఁడు? పద నీ వాతని దగ్గఱకు".

ఆ బ్రాహ్మణుఁడును దృఢముగ నిట్లనెను:- "పద, నెనును వచ్చుటకు సిద్ధముగ నున్నాను." అని యిట్లు పోట్లాడుకొనుచు నా దగ్గఱకు వచ్చిరి.

నృగమహారాజు కృష్ణచంద్రునితో నిట్లనెను :- "ప్రభూ! రాఁగానే దానమును గ్రహించిన నా బ్రాహ్మ

ణుఁడు క్రోధముతో నాతో నిట్లనెను:-"రాజా! సత్యమును జెప్పుము. నీవీ గోవును నాకు దానమొసంగితివా? లేదా?"

నేనెట్లు లేదనగలను? నేనిట్లంటిని :-"అవును, విప్రోత్తమా! నేనిప్పుడే విధ్యుక్తముగ, సంకల్పసహితముగ నీ గోవు నీతనికి దానమొసంగితిని."

అప్పుడా గోవుయొక్క యజమాని క్రోధమున నిట్లనెను :-"రాజా! దొంగతనంచేసి గోదానమొసంగిన నేమి పుణ్యము లభింపఁగలదు? ఇది పైగాఁ బాపము."

నేను జేతులను జోడించుకొని యిట్లంటిని:-"బ్రాహ్మణోత్తమా! మీరు శాంతించుఁడు. నాకు జ్ఞాపకమున్నంత వఱకు నేను దొంగతనము చేయలేదు."

దృఢతాస్వరమున గోవుయజమానియగు బ్రాహ్మణుడిట్లనెను :-"ఏల చేయలేదు? దీనికిఁ బ్రత్యక్ష ప్రమాణము నాగోవే దీనిని నీవు దొంగిలించి దానమొనర్చితివి."

నేను వినీతభావముతో నిట్లంటిని :-"విప్రోత్తమా! నేను బుద్ధిపూర్వకముగ దొంగతనము చేయలేదు. నీవీ గోవును నీదనుచున్నావు. నేను మీ మాటమీఁద నవిశ్వాసమును జెందుటలేదు. ఆగోవు నాగోవులలోని కెట్లు వచ్చినదో విచారించెదను." ఇట్లు పలికి నేను జాడతీసితిని. బాగుగా విచారింపఁగా యథార్థవిషయము తెలిసినది. సేవకులిట్లనిరి :-"మహారాజా! పొరపాటున నీగోవు మన

మందలోనికి వచ్చినది. మేము దీనిని మనదే అనుకొంటిమి. అందువలన నలంకరించితిమి. పొరపాటుననే యీదానము జరిగినది."

ఇది వినఁగానే నాకు మిక్కిలి భ్రమ కలిగెను. నేను గొప్ప ధర్మ సంకటమునఁ బడితిని. నేనా గోవుయొక్క యథార్థపు యజమానియైన బ్రాహ్మణునితో నిట్లంటిని :- "స్వామీ! నావలనఁ బొరపాటు జరిగినది. క్షమింపుఁడు. ఈగోవునకు బదులుగా మీకు నేను లక్ష గోవుల నిచ్చెదను"

బ్రాహ్మణుఁడు రోషమున నిట్లనెను :-"రాజా! నీవు నన్ను లోభిగా భావించితివా? నేను గోవు నమ్ముకొందునా? ఇది నా యజ్ఞధేనువు. దీనికి బదులుగా నీవు నీరాజ్యము నంతయు నొసఁగినను నేను గ్రహింపను."

ఇది విని నేను నిరుత్తరుఁడనైతిని. అంత నేనా దానము గైకొనిన బ్రాహ్మణునితో నిట్లంటిని :-"నా అజ్ఞానమున నీపొరపాటు జరిగినది. మీరిద్దరిలో నెవరైనను నా మీఁద దయఁజూప వలయును. నేను మీ శరణు వేఁడితిని. ఘోరనరకమునఁ బడకుండ నన్నుగ్రహింప వలయును.

ఇది విని యా బ్రాహ్మణుఁడిట్లనెను :- "ఇచ్చుటలో నేమియును నభ్యంతరము లేదు కాని, నాకు ప్రతిపక్షియగు బ్రాహ్మణుఁడా గోవు కొఱకై లక్షగోవుల నొసంగినను నంగీకరింపకుండఁగా నేను మాత్ర మెట్లంగీకరింపవలయును. నీవు రాజువు. నీకు గోవు కావలయునని నీవు దీసికొనవచ్చును. బదులునకు బదులుగా నీయఁదలఁచిన యెడల లక్షగోవుల నొసంగినను దీనిని నే నీయను. అంతే కాదు ఇంకను పదివేల గోవుల నొసంగినను నేను గ్రహింపను. బ్రాహ్మణ సమాజమున నే నవమానపడను. ఇదిగో, తీసికొనుము నీగోవును. నేను పోవుచున్నాను." ఇట్లు పలికి ఆతఁడు సంతుష్టుఁడై గోవును వదలిపెట్టి వెడలిపోయెను. రెండవ బ్రాహ్మణుఁడును నేమియును దీసికొనక వెడలిపోయెను. ఈ సంఘటనమువలన నాకు మిక్కిలి దుఃఖము కలిగెను. ఆ సమయమున నాకు మృత్యువు సంభవించెను. యమదూతలు నన్నుఁ గొనిపోవ వచ్చిరి. నన్నాదరముగ ధర్మరాజు సభకు గొనిపోయిరి. యమధర్మరాజు నాకు స్వాగత సత్కారము లొనర్చి, మిక్కిలి ప్రేమతో నిట్లనెను :-"రాజా! నీ వంతులేని పుణ్యమును జేసితివి. నీ వసంత కాలమువఱకు, అక్షయ దివ్య తేజోమయ లోకములను బ్రాప్తించెదవు. పుణ్యములతోఁ బాటుగా నీకును గొంచెముగఁ బాపము సంభవించినది. ఈ పాపము నీ పుణ్యములముందు సుమేరువు వద్ద నావగిం

జంతకూడ లేను. అయినను పాపపుణ్య ఫలములరెంటిని ననుభవింప వలసియుండును. ముందుగా నీవు పాపఫలము ననుభవించెదవా ? పుణ్యఫలము ననుభవించెదవా ? నీ యాజ్ఞ ప్రకారమే నే నేర్పాటు చేయఁగలను.”

నేను నా మనస్సులో నిట్లాలోచించు కొంటిని :- “ముందుగా సుఖము ననుభవించి చివరకు దుఃఖము ననుభవించుట చాల కష్టము. ముందుగా సుందర స్వాదిష్ట పదార్థములను దిని తరువాత పాసి, దుర్గంధముగను, జేదుగనుండు పదార్థములను దినుటవలనఁ జిత్తము చెడిపోవును. మిక్కిలి కష్టము కలుగును. రెండు విధములగు పదార్థములను దిన వలసియుండినను ముందుగాఁ జేదు పదార్థములను దిని, తరువాత స్వాదిష్ట పదార్థములను దినుట బాగు. అదే విధముగ ముందు దుఃఖము ననుభవించి, తరువాత సుఖము ననుభవించవలయును”అని యాలోచించి నేను యమధర్మరాజుతో నిట్లంటిని :-“దేవా! ముందుగా నేను బాపకర్మఫలము ననుభవింపఁ గోరుచున్నాను. ముందుగా నా పాపము లన్నియును ననుభవించున ట్లేర్పాటును గావింపుము.”

యముఁ డిట్లనెను :- “మంచిది. నీవు ఊసరవిల్లివి కమ్ము.”

యముఁ డీమాట నెప్పుడనినాఁడో నేను బృథివిపై కృకలాసము (ఊసరవిల్లి)నై పుట్టితిని. పాపములు రెండు

విధములు. తెలిసి చేసిన పాపములు. తెలియక చేసిన పాపములు. నేను తెలియక పాప మొనర్చితిని కావున నాకీ జన్మ యందును బాధలు కలుగలేదు. ఇంతేకాదు. నాకు పుణ్యక్షేత్ర నివాసము లభించినది. ఆఱు నెలలు నేను గఖముక్తేశ్వరమున నొక గంగాకుండమందుంటిని. ఆఱు నెలలు పరమ పుణ్యక్షేత్రమగు ద్వారకా పురిలో నుంటిని. ఈ శరీరములో నాకేమియును బాధ లేదు. మీ చరణములనే చింతించు చుంటిని. నేను బ్రాహ్మణ భక్తుండను. మీ సేవకుండను. దానధర్మ నిరతుండను. ఈ పుణ్య ప్రభావముచే నాకు స్మృతి నశింపలేదు. పుణ్యక్షేత్రవాసము లభించినది. సమస్త దాన, ధర్మ, పుణ్య, శుభకర్మల కేకైక ఫలము దేవదుర్లభమగు మీ దర్శనము ప్రాప్తించుటయే. నేను పుణ్యలోకములకుం బోయి, అచ్చట సుఖభోగము ననుభవించు చుండిననవియును నప్సరసలతో భోగించు స్వర్గసుఖములే కదా! సంసార సాగరమునుండి శ్వాతముగం దరింపంజేయు నీ పాద పద్మ దర్శనము నాకు ప్రాప్తించి యుండెడిది కాదు. ఆ దివ్య భోగముల కంటె నీ కృకలాస జన్మ కోటి రెట్లుత్తమమైనది. దీని వలన సంసారపాశమును భేదించు మీ చరణములు నాకు దొరికినవి.

భగవానుండు ఖేదమును బ్రకటించుచు నిట్లనెను:- "రాజా! ఇంతటి ధర్మాత్ముండవై నను నిట్టి కష్టము ననుభ

వింప వలసివచ్చినదా ! నిందితమగు గృకలాసజన్మలో నుండ వలసి వచ్చినది కదా !''

నృగమహారాజిట్లనెను:- "జన్మలన్నియు నొక్కటే. ఆహార, నిద్రా, మైథునము లన్నిటిలోను గలదు. వాస్తవమున మిమ్ము మఱచుటయే విపత్తు. మీ స్మృతియే సంపత్తు, సుఖమును. మీ కృపచే నాకు నేఁటివఱకును మీ స్మృతి నశింపలేదు. మీరు పరమాత్మలరు. విషయాసక్తులు మిమ్ముల నెన్నటికినిఁ బొందఁజాలరు. విశుద్ధచిత్తముకల యోగిజనులు మాత్రమే, ఉపనిషద్రూపమగు దివ్యదృష్టిచే మిమ్ముఁ బొందఁగలుగుదురు. వారే నిరంతరము హృదయ కమల మధ్యమందు మీ తేజోమయ రూపమును ధ్యానము చేయుచుందురు. అధోక్షజా ! నాకు చాల ఆశ్చర్యకరమగు విషయ మేమనఁగా మందమతినగు నా సమ్ముఖమున మీరు ప్రత్యక్షమైతిరెట్లు? నామనస్సు అనేక విషయముల మీఁదఁ గోరిక కలిగియుండుటచే సర్వదా అంధబుద్ధినై, కర్తవ్య విమూఢుఁడనైతిని. నావంటివానికి మీ దర్శనము సంభవింపదు. సంసార చక్రమునుండి బయటఁబడు వానికే నీ దర్శనము కలుగును.''

ఇది విని కృష్ణుఁడు నవ్వి యిట్లనెను:- "రాజా! నిరంతరము దానధర్మము లొనర్చుటచే నీ బుద్ధి అత్యంత విమలమైనది. అందులకే నీవంటి వినయపూర్ణములగు మాటలను బలుకుచున్నావు.''

చేతులను జోడించుకొని నృగుఁ డిట్లనెను:-" దేవాధిదేవా! నేను నీదర్శనముచేఁ గృతార్థుడనైతిని. జగన్నాథా! మీరు నన్ను మిక్కిలి కృపఁజూచితిరి. గోవిందా! నేను మీ కొఱకు ప్రతీక్షించుచుంటిని. పురుషోత్తమా! మీరు మీ కరకమలములచే స్పర్శించి నాపాపముల నన్నిటినిఁ బోఁగొట్టితిరి. నారాయణా! నీవు సత్యశుద్ధ బుద్ధస్వరూపుఁడవు. హృషీకేశా! నీవు మాయను నశింపఁజేయువాఁడవు. పుణ్యశ్లోకా! నిన్ను శరణువేఁడినచో నేవిధమగు శోక సంతాపములు నుండవు. అచ్యుతా! నీవు భక్తుల కానందమును గలుగఁ జేయుటకే అవతరించుచుందువు. అవినాశా! నీ లీలలు నిత్యములు. కృష్ణా? నీవు నీ యాశ్రితులను నీవైపున కాకర్షించెదవు. నాథా! ఇప్పుడు నేను దేవలోకమునకుఁ బోవుచున్నాను. అచ్చట నేను నాపుణ్యఫలముల ననుభవించెదను నాకు పోవుట కాజ్ఞ యిచ్చుచు, నా కొక భిక్షనుగూడ పెట్టుఁడు."

భగవానుఁ డిట్లనెను:- "ఏమివలయునో, చెప్పుము."

నృగుఁ డిట్లనెను :- "అశరణ శరణా! కర్మానుసారముగఁ జిన్న జన్మ కానిండు, పెద్ద జన్మ కానిండు, ఉత్తమజన్మ కానిండు, అధమజన్మ కానిండు, స్వర్గనరకములలో నెచ్చటనుండినను నాకు నిరంతరమును నీ చరణారవింద చింతనము కలుగు నట్లనుగ్రహింపుఁడు."

భగవానుఁ డిట్లనెను:- "ఏవమస్తు అట్లే అగుగాక!"

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఇది విని నృగ మహారా జత్యంతానందమును జెంది, సాష్టాంగ ప్రణామ మొనరించి యిట్లనెను:- జగదుత్పత్తి నిలయా! పరబ్రహ్మ స్వరూపా! అనంత శక్తిసంపన్నా! నిత్యానంద స్వరూపా! వాసుదేవా! మీా చరణారవిందములకు నా ప్రణామములు." అని పలికి దేవతయైన నృగమహారాజు భగవానునకు మూఁడు ప్రదక్షిణములను గావించి, ఆతని చరణములందు శిరస్సునుంచి, ఆతని యాజ్ఞను బొంది, అందఱును జూచు చుండఁగ దివ్య విమానము నెక్కి- దివ్యలోకములకుఁబోయెను. ఆతని యీా వృత్తాంతమును వినఁగానే అందఱకును బర మాశ్చర్యము కలిగెను. అందఱును జకిత దృష్టిచే భగ వానుని ముఖారవిందమువైపు చూచుచుండిరి. భగవానుఁడు వారందఱ భావమును గ్రహించెను. ఆతఁడీ సంఘటనమున నేమి నేర్చుకొనవలయునో, దానినిఁ దన పుత్రులకును, బరి వారమునకును నుపదేశించెను. ఆ కథాప్రసంగమును ముందు చెప్పఁబోవుచున్నాను. శ్రద్ధాళువులై వినుఁడు."

— ౬ —

# బ్రహ్మస్వాపహరణ దోషము

౧౧౨౭

శ్లో. స్వదత్తాం పరదత్తాం వా బ్రహ్మవృత్తిం హరేచ్చయః।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే కృమిః॥

—శ్రీ భాగ ౧౦స్క. ౬౪ అ. ౩౯ శ్లో.

వ. .....స్వదత్తంబైన బరదత్తంబైన నర్థలోభంబునం జేసి దుశ్శీలుండై బ్రాహ్మణ క్షేత్ర సంభూత ధాన్య ధనాదికంబు భుజించు నప్పాపాత్ముం డఱువదివేల సంవత్సరంబులు మలకూపంబులం గ్రిమిరూపంబున వర్తించు"

—శ్రీమదాంధ్ర భాగవతము.

లౌకిక పారలౌకిక కర్తవ్య మంతయును వేదములోఁ గలదు. వేదము భగవత్స్వరూపము. ఆ వేదములను ధరించినవాఁడు భగవత్స్వరూపుఁ డగును. అట్టి వేదజ్ఞుఁ డగు బ్రాహ్మణున కెవడైన నవమానమును గావించినను, ఆతనికి క్లేశమును గలిగించినను అధోగతినిఁ బొందుట అనివార్యము. బ్రాహ్మణుఁ డన్నివర్ణములకు ముఖ్యుఁ డగుటచే నవధ్యుఁడని చెప్పబడినాఁడు. ఆతఁడు విరాట్స్వరూపుఁ డగు భగవానుని ముఖమునుండి యుత్పన్నమగుటచే ముఖ్యుడనఁ బడినాఁడు. వేదమును ధరించిన నిట్టి ద్విజునిఁ దెలియక అవమాన మొనర్చినను వానికి దుర్గతి కలుగుచుండఁగా నింకఁ

దెలిసి తెలిసి అవమానము చేయువాని సంగతి చెప్ప వలసిన దేమున్నది ?

సూతుఁడిట్లనెను:-'మునులార! భగవానుని యాజ్ఞచే నృగమహారాజు స్వర్గమునకుఁ బోఁగానే, బ్రహ్మణ్య దేవుఁడగు వాసుదేవుఁడచ్చటికి గుతూహలవశమున వచ్చిన దన పుత్రులకును, బరిజనములకును, ఇతరులకును నుపదేశ మొసంగుచు నిట్లనెను:-"చూడు డెంతటి యాశ్చర్యమో! సాధారణముగఁ బాదరసము జీర్ణముకాదు, కాని వైద్యులు దాని నైనను యుక్తిచే శుద్ధ మొనర్చి జీర్ణించు నట్లొనర్పఁగలరు. సర్పముయొక్క సర్వాంగములందు విషముండదని విజ్ఞులు చెప్పుచుందురు. దాని పడఁగ యందే యుండును. "తలనుండు విషము ఫణికిని" అని కదా శాస్త్రము, ఫణమును వదలిపెట్టి దాని శరీరమాంసమును గొందఱు తినుచుందురు. కాని దాని పడగయందు గల విషపు తిత్తినిఁ దినిన నెవడును జీవింపఁజాలఁడు, కాని దానిని యుక్తితోఁ దీసివైచి, దానిని మందుగాఁ జేసినచో జనులు దానిని జీర్ణింపఁజేసికొనగలరు. మొదలగు విషముల నేకములు కలవు. వానిని వాసనఁ జూచుటచేతనే ప్రాణులు మరణించెదరు. మానవుఁడు వానినైనను జీర్ణింపఁ జేసికొన వచ్చునేమో కాని బ్రాహ్మణ ధనమును హరించి దానిని జీర్ణింప జేసికొన జాలము. సాధారణుల విషయ మట్లుంచుఁడు. చివరకు అగ్ని

హోత్రుడైనను బ్రహ్మస్వమును శాసనము మొనర్చుకొన జాలడు. అందువలన శాస్త్రకారు లిట్లనిరి:-హాలాహలవిషము కాదు. ఆ విషమునకుఁ బ్రతీకారము అనఁగా విరుగుఁడు కలదు. వాస్తవమున విషమనఁగా బ్రహ్మస్వమే ప్రపంచమున దీనిని శాసించు పదార్థ మేమియును లేదు. నిప్పంటుకొనినచో దానిని జలముచే నార్పవచ్చును. విషము నెవఁ రైనను దినినచో నట్లు తినినవాఁడే మరణించును. కాని బ్రహ్మస్వమును హరించినచోఁ గులమంతయును సమూలముగ నశించి తీరును.

అంతనొక కుమారుఁ డిట్లనెను-"స్వామీ! బ్రాహ్మణ ధనము మన మడిగి దాని నుపభోగించినను నపరాధము సంభవించునా?"

భగవానుఁ డిట్లనెను:-"లేదు. బ్రాహ్మణుఁ డానందముతో బుద్ధి పూర్వకముగ నొసంగినచో దానినిఁ బ్రసాదముగ భావించి, తప్పక గ్రహింపఁ వచ్చును. రాజు లందఱును ఋషుల ఆశ్రమములకుఁ బోవుచుందురు. ఋషిగణము వారికి అర్ఘ్యము నొసంగి, కంద, మూల, ఫల, నీవారాదులను వారు తినిన తరువాత మిగిలిన వారికందఱకు నొసంగెదరు. భరతుఁడు ప్రయాగలో భరద్వాజుని ఆశ్రమమునకుఁ బోయి యుండెను. ముని భరతునకును సమస్త పరివారమునకు నాతిథ్యము నొసంగెను. భరతుఁడు దానిని

సహార్షముగ స్వీకరించెను. కార్తవీర్యార్జునుఁడు జమదగ్ని ఆశ్రమమునకుఁ బోయెను. మహర్షి ఆతనికిని, ఆతని సైనికులకును, బరివారమునకును స్వాగత సత్కారముల నొనర్చెను. భోజనమును బెట్టెను. ఇదంతయును నాతని యిచ్ఛచే జరిగినది. కాని తరువాత కామధేనువును జూడగనే ఆతని మనస్సులో లోభముత్పన్న మయ్యెను. ఆతఁడు మునిని గోవు నీయుఁడని యాచించెను. ముని యిట్లనెను:-"రాజా! ఇది నాకు పనికివచ్చు వస్తువు. దీని వలన నాకు యజ్ఞోచితములగు వస్తువు లన్నియును లభించు చున్నవి." అనఁగా రాజు బలవంత మొనర్పగా ముని యిట్లనెను :_"నీవు రాజువు. నేను నిన్నడ్డగింప జాలను. నీవు బలవంతముగఁ గొనిపోయినచో నే నేమీ చేయఁగలను ? ఆవు వచ్చినచోఁ గొనిఁపొమ్ము."

ఈ విధముగ జమదగ్ని తీసికొని పొమ్మనెను గాని ఆతనికిఁ బూర్తిగ నిష్టములేదు. ఆతని బలవంత మొనర్చుటచే వివశుఁడై అట్లు చెప్పెను. ఈ విధముగ బ్రాహ్మణ ద్రవ్యమును నాతనియొక్క పూర్తిసమ్మతి లేక భోగించినచో నది మూఁడుతరముల వఱకుఁ అధోగతికి ద్రోయును. ఒకవేళ బలవంతమున బ్రాహ్మణులను జంపి హఠముగ వారి ధనమును భోగించినచో దాని ప్రభావము ముప్పది తరములవఱ కుండును. పది వెనుకటి తరములను, ఇరువది

లకు బంచిరి. కొందఱు తమధనమును భూమిలోఁ బాతిపెట్టిరి. క్షత్రియులకు వారికి గావలసినంత ధనము లభింపలేదు. ఎవరో రహస్యము తెలిసినవారు బ్రాహ్మణు లిండ్లలో ధనమును బాతిపెట్టారని రాజులకు చెప్పఁగా వారొక బ్రాహ్మణుని గృహమునకుఁ బోయి దానినిఁ ద్రవ్వఁగా జాలగ ధనము లభించెను. ఇప్పుడు వారికి గోపమువచ్చి భృగువంశపు బ్రాహ్మణుల నందఱను వధింప నారంభించిరి. వారి హింసా వృత్తి యెంతవఱకు పెరిగినదనఁగా వారు బ్రాహ్మణులను జంపుటయేకాదు, వారి స్త్రీ గర్భమందలి అర్భకులను గూడ వధింప నారంభించిరి. ఒక బ్రాహ్మణ స్త్రీ కొండలలోనికిఁ దప్పించుకొని పోయి, గర్భస్థుఁడగు దన శిశువును రక్షించు కొనెను. వానిని ఊరువునందు చాల సంవత్సరముల వఱకు దాచియుంచెను. ద్వేషవశమున నొక బ్రాహ్మణ స్త్రీ యీ విషయమును క్షత్రియులకుఁ దెలిపెను. వారు వచ్చి గర్భవతి యగు నా బ్రాహ్మణస్త్రీనిఁ జుట్టుముట్టి ఆమె గర్భమును నశింపఁజేయుటకై ప్రయత్నించిరి. ఇంతలో నా బాలకుఁడు గర్భమునుండి బయటపడి జన్మించెను. ఆతని దివ్యతేజము ముందు క్షత్రియు లందఱును నంధులైరి. వారు పర్వతములం దటునిటుఁ దిరుగుచు, వానినుండి క్రిందఁబడ నారంభించిరి. ఇప్పుడు వారికి బుద్ధివచ్చెను. వారా బ్రాహ్మణస్త్రీని స్తుతించిరి. ఆమె యిట్లనెను :- "వత్సలారా! నేను మిమ్ముల

నంధుల నొనర్ప లేదు. ఇదిగో ఇప్పుడే పుట్టిన నీ శిశువుయొక్క తేజముచే మీ రంధులరైతిరి. మీరు భృగువంశమును నాశన మొనర్పఁ సమకట్టఁగా నే నీ పిండమును నూఱుసంవత్సరములు నా గర్భములో దాచుకొంటిని. ఈతఁడు గర్భములోనే వేదవేదాంగముల నభ్యసించినాఁడు. మీ రీ బాలకునే స్తుతింపుఁడు.''

ఇదివిని క్షత్రియు లా బాలకుని స్తుతించిరి. ఎట్లున్నను నాతఁడు బ్రాహ్మణబాలకుఁడు. ఆతఁడు వారినందఱను గృప జూచెను. వారి దృష్టి పూర్వమువలె నయ్యెను. వారందఱును మునిపుత్రునకు నమస్కరించి తమ తమ గృహములకుఁ బోయిరి.

ఊరువునుండి ఉత్పన్నమగుటచే నీ ఋషికుమారునకు ఔర్వుఁడను పేరు వచ్చెను. ఈతఁడు క్షత్రియులమీఁదఁ బ్రతీకార మొనర్చుటకై తప మొనర్ప నారంభించెను. ఈతని తపమువలన ముల్లోకములును దపించెను. క్షత్రియుల అపరాధమున లోకములన్నిటికిని విపత్తు సంభవించెను. అప్పు డీతని పితరులు వచ్చి, ఔర్వు నిట్లు సమాధానపరచిరి :—

'నాయనా! మనము క్షత్రియులను జంపు టెందులకు? మేము దీర్ఘాయువుచే విసుగును జెందితిమి. అందువలన ధనమును దాచి మేము బుద్ధిపూర్వకముగ క్షత్రియులకుఁ గోపమునుఁ దెప్పించితిమి. మే మాత్మహత్యను జేసికొనఁజాలము. ఆత్మ

హత్యను గావించుకొనుట మహాపాపము. అందువలన క్షత్రియుల బాణములచేఁ జచ్చి మేము స్వర్గమున సుఖముగ నున్నాము. నీవు క్రోధమును ద్యజింపుము. లోకనాశనము కావింపవలయునను విచారమును మానుము."

అప్పుడు పితృదేవతలు చెప్పఁగా బ్రహ్మర్షియగు నౌర్వుఁడు తన క్రోధమును బరిత్యజించెను. అయినను బ్రాహ్మణుల ధనమును బలవంతముగ హరించుటచేతను, బ్రాహ్మణులను హత్యయొనర్చుట చేతను ఆ కృతవీర్యుని వంశజులకు దుర్గతి కలిగెను. వారీలోకములోను, పరలోకమందును దుఃఖము ననుభవింపవలసి వచ్చెను."

సూతుఁడిట్లనెను :–"మునులారా! నేను బ్రసంగవశమున నౌర్వుని కోపవృత్తాంతమును గూర్చి చెప్పితిని. శ్రీకృష్ణుఁడు తన బంధు బాంధవులతోడను, కుమారులతోడను నిట్లు చెప్పుచుండెను :–"నాయనలారా! బ్రాహ్మణుల ధనము తపస్సే. వారు తపమొనరించుటకే శరీరమును నిలుపుకొందురు. దానికొఱకే కొంచెముగ ధనధాన్యములను సేకరించుకొందురు. అట్టి ఉదార, కుటుంబ బ్రాహ్మణుల ధనము నెవఁడపహరించెదనో, ఆతని జీవనము కొఱకేర్పఱచుకొనిన వృత్తి నెవఁడపహరించునో, ఆతఁడు కుంభీపాకాది నరకములకుఁబోయి ఘోర యాతనల ననుభవించును. దుఃఖిత బ్రాహ్మణుఁడేడ్చుచుండ వాని ఉష్ణా

శ్రుకణములవలన నెన్ని రజఃకణములు తడిసినవో, అన్ని వర్షములవఱకు ఆదుఃఖమును గలిగించినవాని వంశజులు నరక యాతన ననుభవింప వలసియుండును. తానొసంగినది కాని, తనవంశము వారొసంగినదికానీ, లేక యితరు లొసంగినదికాని బ్రాహ్మణుని వృత్తిని, ద్రవ్యము నెవఁడు హరించునో, ఆతఁడు చాలదినముల వఱకు మలమునందు కీటకమై పుట్టును. లోభవశమున నెవరు బ్రాహ్మణునివృత్తి నపహరించెదరో వారల్పాయువులగుదురు. ఆతని శ్రీసంపత్తులు నాశనమగును. వారు రాజ్యభ్రష్టులగుదురు. ఈలోకమందును బరలోకమందును నానాయాతనల ననుభవింప వలసి వచ్చును.

భగవానుఁడిట్లనుచుండెను :—"నాయనలారా! మీ రీ విషయమును గట్టిగా జ్ఞాపకముంచుకొనుఁడు. ఒకవేళ బ్రాహ్మణుఁడపరాధ మొనర్చినను నాతని ద్వేషింపరాదు. ఆతఁడు కొట్టినను, తిట్లు తిట్టినను, చీవాట్లు పెట్టినను మీ రెన్నడును నాతనిఁ గటు వచనములను బలుకరాదు. ఆతనికి నమస్కరించు చుండవలయును. మీరు ప్రత్యక్షముగ నన్నుఁజూడుఁడు. నే నెచ్చటికిఁ బోయినను బ్రాహ్మణులకు నమస్కరించుచుండెదను. ఆతనికి నిరంతరము స్వాగత సత్కార, సన్మానము లొనర్చుచుందును. ఇదే విధముగ మీరును జేయుచుండుఁడు. దీనివలన మీకు ఆయుర్బలయశో

వచ్చు (శ్రీ)సంపదలు వృద్ధిఁబొందును. ఇంతదూర మెందులకు? మీ కన్నుల యెదుట ప్రత్యక్షోదాహరణము కలదు. నృగ మహారాజు పొరపాటున-తెలియక-బ్రాహ్మణునకు గోవును దాన మొనర్చి, పరమదాతయును, అఖండ యశస్వియునగు నారాజు చివరకు తొండయై పోవలసి వచ్చినది.''

సూతుఁడిట్లనెను :-''మునులారా! ఈమాటను విని అందఱును భగవానుని మాట ననుమోదించిరి. ఆతని యాజ్ఞను శిరసావహించిరి. అప్పుడు సమస్తలోకములను బావన మొనర్చు ప్రభువు తన బంధువులతో గలిసి ద్వారకా పురికి వచ్చి, సుఖముగ నంతఃపురమున నుండి రాజకార్యములను జూచుకొనుచుండెను.''

అంత శౌనకుఁడిట్లడిగెను:- ''సూతా! మాకీ నృగో పాఖ్యానము విషయమున శంకలు గలవు. వానికి మీరు సమాధాన మొసంగ వలయును. మొదటి సందేహ మేమనఁగా — నృగమహారాజు బుద్ధిపూర్వకముగ గోవును బ్రాహ్మణునకు దాన మొసంగలేదు. పొరపాటునఁ, దెలియనిస్థితిలో, సేవకుల ప్రమాదముచే నాతనివలన నీ యపరాధము సంభవించినది. ఈ చిన్న అపరాధమున కింతటి దుర్గతి సంభవించుటయా? ఇఁక రెండవ సందేహము — అధిక పుణ్య మొనర్చుటచేఁ బాపములు పోవునుగదా, అధిక పాపము లొనర్చుటచేఁ బుణ్యమును నశించునుగదా. అనంతపుణ్యము

లొనర్చిన సీతనికి దెలియని స్థితిలో నల్పాపరాధము చేయఁగా నది యేల క్షమియింప లేదు? మూఁడవది – వారిద్దరును బ్రాహ్మణులా లేక రాక్షసులా? రాజు తన తప్పునొప్పుకొనుచు నొక్క గోవునకై లక్షగోవుల నొసంగుట కుద్యుక్తుఁడైనను రాజుపై నేల కోపించినారు? ఆతని యుద్ధారమున కేదైన నుపాయమును జెప్పవలయును గదా! కన్యాదాన మొనర్చి నపుడు దానికిబదులుగా మూల్యమునొసంగి తీసికొనుట లేదా? అట్లే ఆ బ్రాహ్మణుఁడా గోవును దిరిగి యిచ్చియుండిన మరల నాతని గోవు నాతని కిచ్చియుండును గదా! నాల్గవశంక— బ్రాహ్మణులను గూర్చి భగవానుఁడింతగాఁ బ్రశంసించుట వేదజ్ఞులును, తపస్వులును శాంతులును, దాంతులునగు బ్రాహ్మణుల విషయమైన నొప్పుకొనవచ్చును గాని నామమాత్రపు బ్రాహ్మణులై నిరక్షరులును, లోభులును, చరిత్ర హీనులునగు వారితో నిట్టి వ్యవహార మొనర్చినచో సమాజమున నరాజకత వ్యాపించును. కృపతో మా యీ శంకలకు సంక్షేపమునఁ బ్రత్యుత్తర మొసంగుము.

ఇది విని సూతుఁడిట్లనెను:– "స్వామీ! నేను యథామతిగా, యథాశక్తిగా మీ శంకలకు సమాధాన మొసంగెదను. పాపమును దెలిసిచేసినను, దెలియక చేసినను అనుభవించి తీరవలసినదే. అగ్నిని తెలిసి త్రొక్కినను దెలియక త్రొక్కినను కాలితీరును. పాపములు శుష్కములనియును

నార్ద్రములనియును రెండు రకములు. తెలిసిచేయు పాపము లార్ద్రములు, తెలియకచేయు పాపములు శుష్కములు. ఆర్ద్ర పాపములను జాల దినములవఱకు అనుభవింపవలసి యుండును. శుష్కపాపము లనుభవించు టేమంత కష్టమైన పనికాదు. అందువలన రాజునకు కృకలాసయోనియందును గష్టము లేకుండెను. పూర్వజన్మ స్మృతి కలదు. గంగా, ద్వారకా పురీ వాసమును లభించెను. ఇట్టి పుణ్యక్షేత్రములందు వశించుట పాపులకెట్లు లభింపఁగలదు? నీచ జన్మలు వచ్చియు నింకను బాపములందే ప్రవృత్తి కలిగియుండినచోఁ బాపము లింకను వృద్ధియగును. రాజు పాపమును పెరుగలేదు. ఆతనికి గొప్ప పుణ్యము లభించినది. అందువలన రాజు యొక్క శుష్కపాప పరిణామము చివరకు మంచిదే అయినది.

ఇఁక రెండవప్రశ్న విషయము:- పుణ్యము వలనఁ బాపమును, పాపమువలనఁ బుణ్యమును నశించుననుట సత్యమే. కాని అంత్యకాలమునఁగల పుణ్యపాపములు నశింపవు. "అంతే యా మతి సా గతిః" అంతమున నేమతి యుండునో అట్టి గతి లభించును. ఎట్లనఁగా, జడభరతుఁడు చివరకు మృగచింతన మొనర్చుచుఁ జచ్చినాఁడు. అందువలన వానికి మృగజన్మమే లభించినది. నృగమహారాజా బ్రాహ్మణుల పోట్లాట తరువాత దానాది పుణ్యము లొనర్చి యుండిన నాతని పాపము పోయెడిదే. కాని ఆతఁడా వాద

వివాదానంతరము చచ్చిపోయెను. ఇద్దరు బ్రాహ్మణుల యొక్క అభియోగమును వినుచుండినపుడు గోవునకు సంబంధించిన బ్రాహ్మణుడు చెప్పినదానికి మహారాజు తలనూపుచు మీ మాట నిజమేయని యనుచుండెను. దానమును బుచ్చుకొనిన రెండవ బ్రాహ్మణునిఁ జూచినను దల నూపుచుండెను. అప్పుడా యాజ్ఞిక బ్రాహ్మణుఁడు కుపితుఁడై యిట్లనెను:- “రాజా! నీ విద్దఱి మాటలను వినియుఁ దొండవలెఁ దల నూపుచున్నావు. ఏదియు నిర్ణయ మొసరింపవు,” దానికి రాజునకు జాల దుఃఖము వచ్చెను. ప్రారబ్ధవశమున నాతని కంఠమునఁ దొండ జ్ఞాపకమునకు వచ్చెను. ఇదియే ఆతని చివర కర్మ. అందువలన నది నాశము కాలేదు. చివరకు తొండను స్మరించుటచేత నాతనికి తొండజన్మ వచ్చెను.

ఇఁక నా బ్రాహ్మణులిద్దర హరమును గూర్చి చెప్పెదను. స్వామీ! ఈ విషయమున మీరు శాంత చిత్తమున విచారింపుఁడు. ఇప్పుడీ కలియుగమున యజ్ఞయాగాదులొనర్చుట నశించియే పోయినది. యజ్ఞమందు యజ్ఞధేనువు నశించుట కానిండు. పోఁగొట్టుకొనుట కానిండు చాల గొప్పదోషము. మీరు ఖాండిక్య, ఋతధ్వజుల విషయమును వినియే యుందురు. ఖాండిక్యుఁడు కర్మకాండలో నిష్ణాతుఁడు. ఋతధ్వజుఁడు జ్ఞాని. ఆతఁడు ఖాండిక్యుని సర్వస్వమును హరించి, వానినిఁ బరాజితు నొనర్చి రాజ్యమునుండి వెడల

నడిపెను. ఖాండిక్యుఁడు వనములలోఁ దిరుగుచుండెను. ఇచ్చట ఋతధ్వజుఁడొక్క యజ్ఞము నొనర్చెను. వనమున యజ్ఞపశువు నశించెను. ఒకానొక సింహము దానినిఁ జంపివైచెను. యజ్ఞమున కిది గొప్ప విఘ్నము. రాజు చాల మంది ఋత్విజులను బిలిచి దీనికిఁ బ్రాయశ్చిత్త మడిగెను. అందఱును మాకు దెలియదనిన మాకు దెలియదనిరి. అప్పుడు రాజు శత్రువగు ఖాండిక్యునికడకు బోయెను. ఖాండిక్యుని మంత్రులు ఋతుధ్వజునిఁ జంపవలయునని సలహా నొసంగిరి. కాని ధర్మాత్ముఁడగు ఖాండిక్యుఁడట్లు చేయలేదు. ప్రాయశ్చిత్తమును జెప్పెను. ప్రాయశ్చిత్త మొనర్చుకొని రాజు యజ్ఞమును బూర్తిచేసికొని,ప్రాయశ్చిత్తమునుగూర్చి చెప్పినందులకుగాను ఖాండిక్యుని కావలసిన దక్షిణను గోరుకొనుమనెను. ఇంతకీ కథయొక్క సారాంశమేమనఁగా యజ్ఞీయకామధేనువును బోఁగొట్టుకొనఁగూడదనియే, దానివలనగొప్ప పాపము కలదు. ధేనువు పోవుటచే బ్రాహ్మణుఁడత్యంత క్షుభితుఁడయ్యెను. అందువలనఁ దన ధేనువును దీసికొనుటకై ఆతఁడీవాక్యములను బలికెను. రాజాతనికి సవిధిగా దాన మొసంగినాఁడని తెలిసికొనఁగానే దుఃఖము నొందుట స్వాభావికమే. రెండవ బ్రాహ్మణుఁడు చేసిన హఠమాత్మప్రతిష్ఠకొఱకే. దాన మొసంగిన వస్తువునకు బదులుగా నింకొక వస్తువు నొసంగి లేక మూల్యము నొసంగి తీసికొన

వచ్చును. కాని దానమొసంగిన గోవును విక్రయించుట నిషిద్ధము. ఇట్లైనను బ్రాహ్మణుఁడు ధైర్యముతో విషయమును గూర్చి విచారించి యుండినచో, నేదియో ఒక దారి దొఱకెడిదే; కాని భవితవ్యత అట్టిది. దైవవశమున నిద్దరును నుత్తేజితులైరి. వారి ఉత్తేజత సకారణమే అయినప్పటికిని, ధర్మరక్షణార్థమే అయినప్పటికిని, ఆ బ్రాహ్మణు లిద్దరును క్షమాధర్మమును మఱచియుండినను నిప్పుడిందులో భవితవ్యతము మీఁద తప్ప ఇంక నెవరిమీఁద నెపమును మోపఁగలము?

ఇప్పుడింక బ్రాహ్మణునత్యధికముగఁ బ్రశంసించుట విషయమిది. జ్ఞానమే ప్రపంచస్థితికి కారణము. ఆ జ్ఞానము నే బ్రాహ్మణుఁడు ధరించునో ఆతనికి బూజాప్రతిష్ఠ లావశ్యకములు. జన్మచేతను, కర్మచేతను గూడ బ్రాహ్మణుఁడైనచో నాతఁడు సర్వవిధములఁ బూజనీయుఁడే. ఆతనివలన నేదైన నపరాధము సంభవించినను దానిని క్షమింపవలయును. జన్మచే బ్రాహ్మణుఁడై, ఆతఁడత్యంత నిందిత కార్యములను, చోరత్వాదులను నొనర్చుచుండినచో రాజాతని దండింపవచ్చును. ఆతని సర్వస్వము నపహరించి, ఆతని దేశమునుండి వెడలఁగొట్టవచ్చును. ఆతనిచేత శూద్రులకువలెఁ బనులను జేయింపవచ్చును. కాని ఆతఁడు జన్మతో బ్రాహ్మణుఁడే. రాజు వివశుఁడై దండింపవచ్చును. గాని

యితరులు దండింపరాదు. స్వామీ! వేదజ్ఞులగు బ్రాహ్మణులను, భగవంతుని నాదరింపకుండిన నీలోకమజ్ఞానాంధకారమునఁబడి నశించును.''

శౌనకుఁడిట్లనెను :- ''సూతా! మా సందేహములు తీరినవి. ఇఁక నిప్పుడు భగవానుని అన్యచరిత్రలనుజెప్పుము. వ్రజవాసులు భగవానుని యందెంతో ప్రేమను జూపుచుందురు కదా! వారినిఁగలిసి కొనుటకెన్నఁడైనను వ్రజమునకుఁ బోయినాఁడా? లేదా''

సూతుఁడిట్లనెను :- ''స్వామీ! అవశ్యము పోయి యుండవచ్చును. ద్వారకావాసులగు స్త్రీపురుషులు భగవానుఁడు హస్తినాపురమునకును వ్రజమునకును బోయిరని చెప్పుచుందురు; కాని నాకాతని వ్రజయాత్రకు సంబంధించిన విశేష జ్ఞానము లేదు. బలరాముఁడు మాత్రము వ్రజమునకుఁ బోయినాఁడు.

శౌనకుఁడిట్లనెను :-''సూతా! మాకు బలభద్రుని వ్రజయాత్రను గూర్చి చెప్పుము. బలరాముఁడును భగవంతుని అవతారమే కదా! దశావతారములలో నాతని లెక్కయున్నది. ఆతని విశేష చరిత్రమును జెప్పనే చెప్పలేదు. ఇప్పుడు కొంచెమాతని మధుర చరిత్రమును జెప్పుఁడు.''

సూతుఁడిట్లనెను :- ''మంచిది. స్వామీ! ఇప్పుడు నేను బలరాముని చరిత్రను జెప్పెదను. ముందుగా నాతని వ్రజయాత్రకు సంబంధించిన విషయమును వినుఁడు.''

---

# వ్రజమున బలరాముఁడు

శ్లో॥ బలభద్రః కురుశ్రేష్ఠః భగవాన్ రథమాస్థితః ।
సుహృద్దిదృక్షురుత్కంఠః ప్రయయౌ నందగోకులమ్॥

—శ్రీ భాగ. ౧౦ స్కం. ౬౫ అ. ౧ శ్లో॥

సీ॥ నరనాథ వినుమొకనాఁడు తాలాంకుండు
చుట్టాల బంధులఁజూచువేడ్క
సుందర కాంచన స్యందనారూఢుఁడై
భాసిల్లుచున్న వ్రేపల్లెకరిగె॥

—శ్రీమదాంధ్రభాగవతము.

సంబంధులును, బంధుబాంధవులు వీరియందు గల ప్రేమానుబంధములను విడుచుట మునులకైనను దుస్త్యజమైనది. ఎవరితో మనము బాల్యకాలమున రోజులను గడిపితిమో, ఎవరితో నప్పుడు మధుర ఖేలనములను గావించితిమో, ఎవరికీ మనము సన్నిహితులమై కలిసిమెలసి యుంటిమో వారిని వదలవలసివచ్చినచోఁ జాల దుఃఖము కలుగును. మరల వారిని గలిసికొనుటకెంతో ఉత్కంఠత కలుగును. కాని వారినిఁ గలిసికొనినప్పుడా హృదయము ప్రఫుల్లితమగును. పూర్వపు విషయము లన్నియును జలచిత్రములవలె హృదయపటలమునఁబడుచు విలీనమగుచుండును. మరల నూతన విషయములు పడును. ఈ కౌతూహల మెంతకాలము వఱకు జరుగునో చెప్పుటకు వలను పడదు.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ద్వారకలో భగవానునకు సమస్తవిధముల సుఖములు కలవు. పదునారు వేల నూటయెనిమిదిమంది రాణులు కలరు. వారందఱును సుందరులును బతివ్రతలునైయున్నారు. సువర్ణభవనమున బారిజాతవృక్షములు కలవు. సుందర సుశిక్షితులును, ఆజ్ఞా నిర్వాహకులునగు దాసదాసీ జనములుండిరి. అతులైశ్వర్యము కలదు. లక్షలమంది పిల్లలు కలరు. ఇన్నియున్నను నాతఁడు వీనిని వ్రజమండలి యైశ్వర్యము ముందు తుచ్ఛముగఁ జూచు చుండెను.

గోపబాలురతో గోవులను దోలుకొనిపోవుటయును, అచ్చట నానావిధముల విహరించుటయును, గోవులను దోలు కొనిపోయి మేపుచు నచ్చట నానా ఖేలనములొనరించుట యును, రసమయ బృందావన వాలుకా భూమియు, బచ్చని తృణాదులచే నాచ్ఛాదితమైన గోవర్ధన పర్వతమును, గోవుల కొట్టములును, పచ్చిక బీడులును, గోపకుల నానావిధము లగు క్రీడలును, అసురాగమనమును, గోపికలతో నొనర్చిన హాస, విలాస, రాస, హోళీ, మొదలగు విషయములును జ్ఞాపకమునకు రాఁగానే కన్నులవెంట నానందబాష్పములు వెలువడును. రాణులాతని యీదుఃఖవిషయమును గ్రహింపఁ జాలకపోయిరి. ఆతని నోదార్చుటయును లేదు. ప్రసవబాధ వంధ్యకెట్లు తెలియఁగలదు? ఒక్కొక్కప్పుడు కృష్ణుఁడు

తన వ్రజానుభవములను అన్నయగు బలరామునకుఁ జెప్పి కొనెడువాఁడు. ఇద్దరును భుక్తభోగులే. మరల నొక్క సారి వ్రజమునకుఁబోవలయుననియు, నచ్చట అవ్యక్తా నందము ననుభవింపవలయుననియు వారిద్దరును బరస్పరము చెప్పుకొనుచుందురు.”

ఇట్లు చెప్పుకొనఁగాఁ జెప్పుకొనఁగాఁ బాలరోజులు కడచెను. ఒక దినమున బలరాముఁడిట్లనెను :- “కృష్ణా! నీవు పుట్టినప్పటినుండియు నబద్ధపువాఁడవు. వ్రజమునకు బోవలెననుచుందువుకాని యెప్పుడు పోయెదవో తెలియదు. నాకు వ్రజమందలి మన బంధువులను జూచి రావలయునని యున్నది. ఒక్కసారి పోయి చూచివచ్చెదను. నీవుకూడ రమ్ము.”

కృష్ణుఁడు కొంచెము సంకోచముతో నిట్లనెను :- “అన్నా! నాకిప్పుడావశ్యకపు కార్యములున్నవి. ఇప్పుడు నేను రాఁజాలను. సరే, నీవే పోయిరమ్ము. తల్లిదండ్రులకు మొదలగువారి నడిగినానని చెప్పి, వారికి ప్రణామములు చెప్పవలయును. అవకాశము లభించినపుడు నేనును రాఁగలను.”

నవ్వి బలరాముఁ డిట్లనెను :- “కృష్ణా! నీవను లెన్న డును బూర్తి కానేకావు. నీకవకాశము దొఱకనే దొఱకదు. ఇదిగో యివ్వేళ ఇదిగో రేపురేపనుచు నుత్కంఠతను

బెంచుటయేకాని రానేరావు. పోనిమ్ము. నేను పోయివచ్చె దను.'' అనిపలికి తాళధ్వజముగల తన సువర్ణమండిత రథము నుబూన్చి, దానిలోఁగూర్చుండి వ్రజమునకుఁబోయెను. రామ కృష్ణులు వ్రజమును వదలి వెడలినప్పటినుండి వ్రజవాసులకు రాత్రిం దివములాతని స్మరణయే. రామకృష్ణులు రాఁగలరని యేపూటకాపూట దారులు చూచుచుందురు. ఒక దినమున వారత్యంత ఉత్కంఠితులై యమునానది వైపునకుఁజూచుచు రామకృష్ణ లీలాగానమొనర్చుచుండఁగా వారికి సువర్ణ మండిత రథమును దానిపై విశాలమగు తాళధ్వజమును గనఁబడెను. అందఱును బరువెత్తి రథమువైపునకుఁబోయిరి. చూడఁగా నందులోఁ గుండలములను ధరించి బలరాముఁడు కూర్చుండి యుండెను. ఆతనిఁగాంచఁగనే వారి యానందము నకు మేఱలేకుండెను. బలరాముఁడును వ్రజవాసులగు గోపికలను జూడఁగనే ఆనందమునుజెంది, వెంటనే రథము మీఁదనుండి దుమికెను. ఆతఁడందఱను నాలింగనము కావించుకొనెను. చిన్న గోపకులాతని పాదములను బట్టు కొనిరి. కొందఱు గోపకులు పరుగెత్తికొనిపోయి, రామకృష స్మృతిచే నేడ్చుచుండిన యశోదకడకు ఱొప్పుకొనుచుఁబోయి యిట్లనిరి :- ''అమ్మా ! అమ్మా ! బలరాముఁడు వచ్చు చున్నాఁడు.''

యశోదకు విశ్వాసము కలుగలేదు. ఆమె యిట్లనెను:- "ఓరీ! మీరు నన్నులికించుచున్నారా! నాకు రామశ్యాము లను మరలఁ జూచు భాగ్యమున్నదా?"

గోపకుమారు లిట్లనిరి :- "నీ మీఁద ఒట్టు తల్లీ! మే మిప్పుడు ప్రత్యక్షముగఁ జూచి వచ్చుచున్నాము." ఇంతలోనే ఘణఘణ శబ్దము నొనర్చుకొనుచు రథము నందుని వాఁకిలి కడకు వచ్చెను. వ్రజరాజు లేచి రథము కడకుఁ బోయెను. బలరామునిఁ గాంచఁగనే ఆతనికి శరీరము పులక రించి, ప్రతిరోమమును నిక్కఁబొడిచెను. బలరాముఁడు నందుని పాదారవిందములపైఁబడి వందన మొనర్పఁబోఁగా, నందుఁ డాతని లేవనెత్తి గట్టిగాఁ గౌగలించుకొని, తన ప్రేమాశ్రువులచే నాతని వెంట్రుకల నన్నిటినిఁ దడిపెను. కుశల ప్రశ్నలొనర్చుచు బలరాముని జేతినిఁ బట్టుకొని వ్రజరాజు లోపలి పంచలోనికి దీసికొనిపోయి పంచలో నుండియే యిట్లనెను :-"నీ వెల్లప్పుడు నెవరికొఱకు గంటఁ దడిపెట్టి యేడ్చుచున్నావో ఆ బలరాముఁడు వచ్చినాఁడు." ఇది వినఁగానే యశోద లేచి నిలుచుండెను గాని ఆమె పాద ములును నడపడెను. ఆమె పడఁబోవుచుండెను. ఇంతలో బలరాముఁడు పరువిడి వచ్చి పట్టుకొని, పాదములపైఁబడి 'అమ్మా! నేను వచ్చితినమ్మా' యనెను.

యశోద యేడ్చుచు బలరాముని శిరస్సును జేతితో నిమురుచు మిక్కిలి ప్రేమతో గద్గద వాక్కులతో నశ్రు

విమోచన మొనర్చుచు నిట్లనెను:-"బలరామా! నీవు వచ్చి నావు. బాగున్నదయ్యా! భగవానుఁడు నీకు దీర్ఘాయువు నొసంగుగాక. ఈ విధముగ మీ అన్నదమ్ము లిద్దరును మమ్ములను రక్షింపుచుండుఁడు. జగత్పాలన మొనర్పుఁడు" అని పలికి తల్లి ఆతనిఁ జిన్న పిల్లవానివలె నాతనిఁ దన వడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని,మాటి మాటికినిఁ గౌఁగిలించు కొనుచుఁ బ్రేమాశ్రువులతో నాతనిఁ దడిపెను. ఏడ్చుచు యశోద యిట్లనెను :-"నాయనా! కృష్ణుఁడు రాలేదా?"

బలరాముఁ డిట్లనెను :-"అమ్మా! ఆతఁడును రాఁ గలఁడు. ఆతని కిప్పుడు ద్వారకలో ననేక కార్యములు కలవు."

యశోద యిట్లనెను :- "బాగున్నది నాయనా! నీ వైనను వచ్చినావు. నేను మీరు లేకుండిన నధీరురాల నైతిని. మీరు మమ్ము మఱచియే పోతిరి. సరేనాయనా? నీ వెచ్చట నైన నుండుము. సుఖముగ నుండినఁ జాలును."

యశోద యీ విధముగ బలరామునిఁ బ్రేమతోఁ బలుకరించునంతలో బలరాముఁడు వచ్చినాఁడను వార్త వ్రజమంతటను వ్యాపించెను. వారు వినఁగానే గబగబ పరు విడి వచ్చిరి. పెద్దవారును, జిన్నవారును, స్త్రీలును బురుషు లును, బాలబాలికలును బరువిడి వచ్చిరి. ఈ విధముగ నందుని వాఁకిట పెద్ద గుంపుగఁ జేరిరి. బలరాముఁడు లేచి

పెద్దవారికిఁ బ్రణామము కావించెను. తన యీడువారి నాతఁడు గౌఁగిలించుకొనెను. చిన్నవారాతనికి నమస్కరించిరి. ఈ విధముగ వయస్సు ననుసరించియును, మైత్రి ననుసరించియును, సంబంధము ననుసరించియు నందఱును బరస్పరము ప్రణామాదులు కావించుకొనిరి. వృద్ధ గోపికలు వచ్చి అతని శరీరమును జేతులతో నిమిరిరి. యువతులు తమ ముసుఁగుల చాటునుండి సిగ్గుతో బలరామునిఁ గాంచిరి. పిల్లలాతని జుట్టుకొని నిలుచుండిరి. కొందఱు వరుస జేసికొని పిలుచుచుండిరి. బలరాముఁ డందఱను యథాయోగ్యముగ సమ్మానించుచుండెను. సమవయస్కులగు గోపబాలకులు నవ్వుచు నవ్వుచుఁ జేతులను బట్టుకొనిరి. కరస్పర్శ నొనర్చి ఒకరొకరు తమతమ వైపులకు లాగుకొనుచుండిరి. అప్పుడు యశోద యిట్లనెను:- "బలరామా! చాల అలసిపోయి యుంటివి. నాయనా! వస్త్రములను మార్చుకొనుము. చేతులను గాళ్ళను గడిగికొనుము. వీరందఱును నీ కొఱకు కూర్చుండినారు."

తల్లి బలవంతము చేయఁగా బలరాముఁడు లేచి జలములతోఁ గాళ్లను గడిగికొనెను. చేతులను ముఖమును గడిగికొని పుక్కిలించివైచి, వస్త్రములను మార్చుకొని, తల్లి యానందముకొఱకు కొలఁదిగ నల్పాహారమును గావించెను. ఇంతలోనే శ్రీకృష్ణుని అంతరంగసఖులు చాలమందివచ్చిరి.

వారి శరీరము లన్నియును క్షీణించెను. వారు కమలనయనుఁ డగు శ్రీకృష్ణుని కొఱకు సమస్త సుఖోపభోగములను త్యజించిరి. వారినిఁ జూడఁగానే బలరామునకు వారిపై దయ కలిగెను. ఆతఁడు వారి నత్యంత ప్రేమతోఁ గలిసికొనెను. బలరామునిఁ గాంచఁగనే వాగందఱును గన్నుల నీరుపెట్టుకొనిరి. వారు గద్గద వాక్కులతో నిట్లనిరి.- "బలరామా! మన సమస్త సంబంధులును, యాదవులును క్షేమముగ నున్నారా?"

బలరాముఁ డిట్లనెను:- "అవునయ్యా! ఏదో విధముగ దినములను గడుపుచున్నాము. మీరందఱును కుశలముగ నున్నారా?"

బిగ్గఱగ నేడ్చుచు గోపకులిట్లనిరి:- "మా కుశలము నక్రూరుఁ డిచ్చటినుండి కొనిపోయినాఁడు. మేము దినములను వెడలబుచ్చుచున్నాము. మీరందఱును ద్వారకలో రాజ్యమొనర్చుచున్నారు ఇప్పుడు మీ తమ్మునకు రాజకుమారికలతోఁ బెండ్లైనదఁటగా! చాలమంది భార్యలైరి. ఇప్పుడు మీకు పిల్లలు జల్లలుకూడ కలిగిరి. ఇప్పుడు మేము మీ కెందులకు జ్ఞాపకమునకు రాఁగలము?"

సిగ్గుతో బలరాముఁ డిట్లనెను:- మీరందఱిట్లు మాటలాడెద రేల? మీరందఱును జ్ఞాపకమే లేకుండిన నే నింతదూర మెట్లు రాఁగలను? ఎన్నడైనను వ్రజమును, వ్రజవాసులను

మేము మఱచెదమా? మాగోప గోపములందిచ్చటి అనంతస్మృతులు కలవు. ఇచ్చటినుండి పోయినతరువాత చాల చిక్కులలోఁబడి యిచ్చటికి వచ్చెదమన్నను వీలుకాకుండెను. మా పరివారమునంతను నీ దుష్టకంసుఁడు చాల త్రిప్పలు పెట్టినాఁడు. ఎట్లో వానిని నాశన మొనర్చితిమి. అనంతరము వాని మామ జరాసంధుఁడు మా వెంటబడినాఁడు. చివరకు వానిమూలమున మేము మథురాపురమును వీడిపోవలసి వచ్చినది. అచ్చటను నిట్టి పోరాటములు మొదలైనవి జరుగుచునే యుండెను. శ్రీకృష్ణుఁ డింతవఱకును నీకారణములచేతనే యిచ్చటికి వచ్చుటకు వీలుపడలేదు. నేనెట్లో కన్నులను మూసికొని వచ్చివైచితిని.''

గోపకు లిట్లనిరి:- ''అవునయ్యా! ఈ సంసారమట్టిదే. ఈ గృహస్థాశ్రమము చింతానిలయము దీనిలో నిత్యనూతన చింత లుత్పన్నమగుచుండును. పెండ్లి చేసికొంటిమా చింతా పర్వతమును నెత్తికెత్తుకొన్నామనియే చెప్పవలయును. దుష్టుఁడు కంసుఁడు చచ్చినాఁడు. వాని మూలమున యాదవులేకాదు, అందఱును దుఃఖమును జెందిరి. మనకందఱకు రాత్రింబవళ్ళాతని భయముండెడిది. ఇప్పుడు యాదవగణము వాని బంధనమునుండి విముక్తులైరి. ఇఁక జరాసంధుని విషయమందమా మీరు కుండినపురమున నాతని జయించితిరని వినియుంటిమి. మథురాపురి దుర్గమేమంత

సురక్షితమైనది కాదు. శత్రు వెప్పుడైనను దానిమీఁద దండెత్తుచుండును. మీరు శత్రువులగు నసురులను జంపి ద్వారకాపురమున సుదృఢమగు దుర్గమున సుఖముగ నున్నారని వినియుంటిమి.'' ఈవిధముగ ననేక విషయములను మాట్లాడుకొనిరి. చివరకు స్త్రీ సమూహము బలరామునితో సంభాషింప వచ్చినారని తెలిసికొని గోపకు లచ్చటినుండి తొలఁగిపోయిరి. అప్పుడు బలరాముఁడు చిరునవ్వు నవ్వుచు వారిని సమ్మానభరిత దృష్టితోఁ జూచుచు నిట్లనెను:- ''మీరందఱును సుఖముగనున్నారా? కుశలమే కదా!''

గోపికలు కన్నుల నీరు నింపుచు నిట్లనెను:- ''మా కుశలము మాకే తెలియును. మీరందఱును సుఖముగ నున్నారుకదా?''

బలరాముఁ డిట్లనెను:-''కాలమును వెడలఁ బుచ్చుచున్నాము.''

గోపికలు వ్యంగ్య స్వరమున నిట్లనిరి :-''ఇచ్చట మఱచియే పోయితిరా? ఒకవేళ హస్తినాపురము పోవుచు నిచ్చటికి వచ్చినారేమో!''

బలరాముఁ డిట్లనెను:-''మీ యిష్టము వచ్చినట్లను కొనుఁడు. మేము మఱచి పోలేదు. మీ అందఱ స్మృతి నిరంతర ముండనే యుండును. వచ్చుటకు గూడ వ్యవధి

లేనంతపని. కృష్ణునకు రావలయునని యెంతో కోరికకలదు. కాని ఆతఁడీ పనులచేఁ దీరక రాలేక పోవుచున్నాడు."

గోపిక లిట్లనిరి :- "అవును. ఆతని కచ్చటి చింతఁ యుండును. పదునాఱువేల రాజకన్యకలను వివాహమును జేసికొనెనని వినియున్నాము. ఒక్క భార్యయుండిననే నెత్తి మీఁది వెంట్రుకలూడి పోవుచున్నవి. అట్టియెడ పదునాఱు వేలమంది యుండిన నింకేమి తీరిక చిక్కఁగలదు? ఇప్పు డాతనికి గొల్లపల్లెపడుచులమగు మా జ్ఞాపక మేమి యుండును. ఇప్పు డాతఁడు పురస్త్రీ జనవల్లభుఁడైనాడు. సరేకాని ఆతడానందముగ నున్నాఁడా?

నవ్వుచు బలరాముఁ డిట్లనెను :— "అవును. మీ అందఱ ఆశీర్వాదముల వలన?"

ఉలికిపడి వ్రజాంగన లిట్లనిరి :- "కృష్ణునకు మా ఆశీర్వాదము లేమి? బలరామా! తలక్రిందులుగ మాట లాడుచుంటివేమి? మే మాతని కేమి కావలయును. ఆతఁడు పురవాసినులకుఁ బ్రాణాధారము. ఎప్పుఁడైన నాతఁ డిచ్చటి ఆతని తల్లిదండ్రులను, బంధు బాంధవులను నెన్నఁడైన స్మరించునా?"

బలరాముఁ డిట్లనెను :- "బాగున్నది. ఇదియును నడుగవలసిన మాటయేనా? తన తల్లిదండ్రులను బంధు బాంధవుల నెవఁడైనను మఱచునా?"

గోపికలిట్లనిరి :– ''అయితే, మఱవకుండినచోఁ దన తల్లియగు యశోదను జూచుటకు వ్రజమునకు వచ్చినాఁడా?''

బలరాముఁ డిట్లనెను:–''రావలయునని ఆతఁడు నిత్యము అనుచునే యుండును. నేఁడు పోవలెను, రేపు పోవలయు ననుచుండును. అందువలననే నేనును రాఁజాలక పోయితిని. ఆతఁడు వచ్చుట చాల కష్టమని తెలిసికొని నే నొంటరిగ వచ్చితిని. సమయము చిక్కఁగానే ఆతఁడును నవశ్యము రాఁగలఁడు.''

గోపిక లిట్లనిరి :– ''సరే, బలరామా ! మహాబాహువగు కృష్ణునకుఁ మే మొనర్చిన సేవలు జ్ఞాపకమున్నవా ? ఎన్నడైనఁ గథాప్రసంగమున మమ్ముఁగూర్చిన చర్చయును వచ్చునా ?''

బలరాముఁ డిట్లనెను:–''నే నా మాటలను నా నోట యేమని చెప్పుదును ? ఆతఁడు మిమ్మెంతగా స్మరించుచున్నాఁడో చెప్పుటకు నాకు శక్తి చాలదు.''

ఇది వినఁగానే అందఱ నేత్రముల నుండియును టపటప అని అశ్రువులు రాలెను. అశ్రువులను, ముక్కుల వెంట గారు నీటినిఁ దుడిచికొనుచు వారు గద్గదవాక్కులతో నిట్లనిరి :– 'బలరామా ! మాకు కృష్ణునివలన నట్టి యాశ లేదు. మే మెవనికొఱకు తల్లిని, దండ్రిని, పతి, పుత్రాదులను, సోదరసోదరీ జనమును, అత్యంత దుస్త్యజులగు బంధులను

వదలితిమో ఆ శ్రీకృష్ణుఁడే మమ్ములను గాలదన్ని త్యజించి నాఁడు. ప్రేమ సంబంధమును మీరును నిర్వహింపలేదు. తృణమువలె సంబంధమును ద్రెంచుకొని ఆతఁడు ముఖము తప్పించి శాశ్వతముగ వెడలిపోయినాఁడు. పరదేశినిఁ బ్రేమించుట తెలిసి తెలిసి తన శిరస్సునకు విపత్తును దెచ్చు కొనుటయే. ఇంతఁగా బ్రేమించిన కృష్ణుఁడు మమ్మి నిట్లు కాలఁదన్ని పోవునని కలలోనైన ననుకొనలేదు. ఇంత త్వరగా మఱచిపోవుననియు మే మనుకొనలేదు.''

నవ్వి బలరాముఁ డిట్లనెను :-''దీనిలో మీ దోషము కూడ ఉండవచ్చును. మీ రాతని నంతగాఁ బ్రేమించు చున్నప్పు డాతని మధురకుఁ బోనీయకుండవలసినది. మీ రందఱును గలిసి ఆపియుండవచ్చును గదా!''

ఏడ్చుచు గోపికలిట్లనిరి :- ''బలరామా! నీ వేమి మాటలు మాటలాడుచున్నావు. పోదలఁచినవాఁ డెవరైన నాపిన నాగునా? ఏదైన సరళుఁడైనచో నాపవచ్చును గాని పాదాదిశిరః పర్యంతము కపటియైనవాని నెవరాపఁగలరు? ఆతఁడచ్చట నున్నప్పు డెన్నో తీపిమాటలు, ప్రేమప్రసంగ చేసెడువాఁడు. ''మీ వస్తువు లన్నియును మధురములు. మీతో నెంతగా మాటలాడినను నా మనస్సు తృప్తిజెందదు. మీరు నన్నుఁ బాగుగా సేవించితిరి. మీ సేవాఋణముచే నణఁగిపోయితిని. మీ ప్రేమకు ప్రత్యుపకార మొనర్పఁ

జాలను." అని యిట్టి కపటప్రేమమయ వాక్యముల నే స్త్రీ విశ్వసింపఁగలదు ? మా కాతనిసంగతి తెలియకపోవుటచే నాతని మాటలను నమ్మితిమి."

అంత నింకొక తె కన్నులనీరు తుడుచుకొనుచు నిట్లనెను:-"బలరామా! మేము పల్లెటూరివారము. నగరమందలి స్త్రీలు మంచి చతురలు. అవ్యవస్థిత చిత్తుఁడగు శ్రీకృష్ణుని మాటలను వారెట్లు విశ్వసించు చున్నారో తెలియదు. శ్రీకృష్ణుఁడు గొప్పకృతఘ్నుఁడు కాఁడా ? దీని కొఱకై ప్రాణములు వదలినను నీతని హృదయము కరుగదు. ఈతనిపై విశ్వాసము కలుగునట్లును, విశ్వాసము కలుగకుండునట్లును గూడ యీతఁడు వర్తించుచుండును. మే మాతని మాటల నన్నిటిని విశ్వసించితిమి కాని ఆతఁడు మాకు విశ్వాస ఘాత మొనర్చినాఁడు. నగర స్త్రీ లీతనిఁ జేరనీయరాదు."

అంత నింకొక ర్తుక యిట్లనెను:-'ఓసీ !నీకు తెలియదా యేమి ? నల్లకృష్ణుఁడు విచిత్రపుమాటలను బలుకుట నేర్చుకొనినాఁడు. ఆతని మందహాసము వలనను ఆతని అనురాగ భరిత స్వరూపముచేతను హృదయమున హఠాత్తుగఁ బ్రేమ నుద్దీప్తము కావించును. ఆ ప్రేమావేశమున నాకులురై, ఆనాగర స్త్రీలు తమ్ముఁదాము మఱచిపోయి, ఆ యావేశ మున నీతని మధుర మధుర మాటలను విశ్వసించి యుందురు."

అంత నొక గోపిక కోపముతో నిట్లనెను :–"అయి యుండవచ్చునమ్మా! ఏమార్గమున మనము పోవుటలేదో ఆ మార్గపు చెట్లను లెక్కపెట్టి యేమి ప్రయోజనము? శ్రీకృష్ణుఁడు మనలను వీడిపోయినాఁడు కదా! ఆతఁడు మనలను దలఁపఁడే తలపఁడు. అట్టివానినిఁగూర్చి చర్చించుట వలన నేమిలాభము? ఆతఁడతని యింటిలో, మనము మన యింటిలో నుండవచ్చును. ఇంక నాతని చర్చను మానుఁడు ఇంకొక విషయమును గూర్చి ప్రసంగింపుఁడు. మనము లేకుండిన నాతనికి గడుచుచుండ మనకాతఁడు లేకుండిన నేల జరుగదు? భేదమేమనగా ఆతని కాలము ఆమోద ప్రమోదములతో గడచును, మనకాలము కంటినీటితో జరుగును. ఇంతే"

ఇంకొకతె యిట్లనెను:–"ఓసీ! నిజముగ నీవు చెప్పినట్లా తఁడు మఱపునకు వచ్చిన బాగుగనే యుండును. కాని ఆతని కథ దుస్త్యజమైనది. దానినెంతగా మఱచెదమనిన నంతగా స్మృతికి వచ్చుచుండును."

సూతుఁడిట్లనెను :– " మునులారా! ఈ విధముగ మాట్లాడుకొనఁగా నందఱకును శ్యామసుందరుని స్మృతి అధికముగఁగలిగెను."

సూతుఁడిట్లనెను :– ' మునులారా! ఈ విధముగ మాటలాడుచుండఁగా నందఱకును శ్యామసుందరునిస్మృతి కలి

గెను. వారు భగవానున మధురహాసమును, ప్రేమవాక్కు-
లను, మనోహరరూపమును, లలితగతిని, ప్రేమపూర్వక
ముగ నొనర్చుకొనిన నాలింగనాదులను స్మరించుకొనుచు బిగ్గ
రగ నేడ్వనారంభించిరి. అందఱును వెక్కి-వెక్కి- యేడ్చు
చుండిరి. ముఖమును గప్పుకొని అశ్రువులను రాల్చుచుం
డెను. అంతయును రసాభాసమైనట్లుండెను? విరహవేదన
అధికమయ్యెను. అప్పుడాతఁడా గోపికలను సమాధానపర చు
చుండెను. ఆతఁడనేక విధముల అనునయ వినయ లొన
ర్చుటలోఁ గుశలుడు. మాటలు చెప్పుట ఆతనికినిఁ దెలి
యును కావున నాతఁడు చెప్పుట కారంభించెను. "అయ్యో!
మీరింతగా దుఃఖించెదరేల ? మీరు లేకుండుటచే శ్రీకృష్ణు
నకు ద్వారకలో బాగుండుటలేదు. ఆతఁడెల్లప్పుడును
మిమ్ములనే స్మరించుచుండును. ఆతఁడు త్వరగా వచ్చి
మిమ్ములను గలిసికొనును. మీ విరహజనిత సంతాపమును
బోఁగొట్టును." ఈవిధముగ ననేక మధురవాక్యములను
బలుకుచు బలరాముఁడు వారందఱను శాంతింపఁజేసెను.
ఇప్పుడు బలరాముఁడా గోపికా యూథముతో నారాత్రి
యందు క్రీడించి నదియు నేను వర్ణించెదను. మీరందఱును
సమాహిత చిత్తులరై వినుఁడు."

— —

# వ్రజమున మరల బలదేవుని క్రీడ.

శ్లో. ద్వౌ మాసౌ తత్ర చావాత్సీ న్మధుం మాధవ మేవ చ ।
రామః క్షపాసు భగవాన్ గోపీనాం రతి మావహన్॥

—శ్రీభాగ ౧౦. స్కం. ౬౫ అ. ౧౭ శ్లో॥

వ. అంత బలభద్రుండు వారల మనంబుల సంతాపంబులు వాయ నుపాయంబులగు సరసచతుర వచనంబులఁ గృష్ణుని సందేశంబులు చెప్పి విగత ఖేదలం జేసి యచ్చట మాసద్వయంబు నిలిచి వసంతవాసరంబులు గడపుచుఁ గాళిందీ తీరంబున.”

—శ్రీమదాంధ్ర భాగవతము.

తన ప్రియునితో నే స్థానములలో సరస క్రీడించితిమో, ఆ స్థానములను గాంచఁగనే హృదయమున నొక విధమగు నుప్పొంగు జనించును. ఆ స్థానమును గాంచఁగనే అవన్నియు స్మృతికి వచ్చును. ఇచ్చట నాకు హారమును వేసినాడు. ఇచ్చట పుష్పములను గోసితిమి. ఇచ్చట గూర్చుండి కలిసిమెలసి మాట్లాడుకొంటిమి. దైవవశమున వియోగమును బొందినఁ దన ప్రేమి మరల వచ్చి, మరల నవే సరసక్రీడలను గాంచుచు, వినుచు, ననుభవించుటకు లభించినచో నిఁకఁ జెప్పవలసిన దేముండును ? వియోగజనిత సంతాపమంతయును దూరమై ఒక నూతన స్ఫూర్తి సంచారము హృదయమునఁ గలుగును. వెనుకటి కంటె వేయి

రెట్లుగ సుఖమిందు లభింపఁగలదు. ఒకానొక దినమున నిది యును నంతమై మరల నేడ్చుట తప్పదనియును దెలిసియే యుండును. మరలఁ బ్రియుని స్మృతియందు సదా అశ్రు విమోచనము చేయవలసి వచ్చును. సంయోగ వియోగ చక్ర మిట్లు తిరుగుచుండ వలసినదే.

సూతుఁ డిట్లనెను :- ''మునులారా ! బలరాముఁడు వచ్చుటచే మరల వ్రజమండలమందు సరసతా తరంగము వ్యాపించెను. కృష్ణ చంద్రుని గోపికా యూథము వేఱు, బలరాముని గోపికాయూథము వేఱు. కృష్ణుని గోపికా యూథమునకు శ్యామసుందరుని సమాచారము తెలియఁ గలదనియు, బలరాముడు వచ్చుటచే నిత్య మాతనికి సంబం ధించిన చర్చ జరుగుననియు, నాతడు మన సందేశమును గృష్ణునకుఁ జెప్పఁగలఁడనియు, బలరాముఁ డుండుటచే శ్రవణ, కీర్తన స్మరణ, చింతనము లనేకముగఁ గలుగఁ గలవనియు, కాని బలరామునకు సంబంధించిన యూథము వారు ఆతనితో సరసమగు నాటల నాడు నవకాశము కూడ కలుగుననుకొనిరి.

బలరాముఁడు వసంతఋతువగు-చైత్ర వైశాఖమాస ములు సుఖముగ వ్రజముననుండెను. ఆతఁడా వసంత రాత్రులందు వ్రజవనితలతో విహార మొనరించుచు, వారి యానంధమును నిరంతరము వృద్ధిఁ బొందింపుచుండెను.

వ్రజవనితా పరివృతుఁడై బలరాముఁడు వివిధవనములందును కుముదకుసుమ గంధముచే సువాసితమగు యమునాపులినమందును, నీలసరములతోఁగూడినఁ గాళిందీతటమందును, నిభృత నికుంజములందును నిరంతరము ఆమోదప్రమోదము లొనర్చుచు నందఋకును సుఖముఁ గొసగుచుండెను?

బలభద్రునకు కుసుమ మధువును, వృక్షరసములను బానమొనర్చు వ్యసనము కలదు. అందువలన వరుణుఁడు తన కుమారితయగు వారుణిని బృందావన విశద వనములందు ప్రవహింపవలయుననియు, బలరాముని సేవకు వినియోగ పడవలసినదనియు నియోగించెను. అదియును దండ్రియాజ్ఞను బొంది ద్రవరూపముసఁ దాళాది వృక్షకోటరములనుండి ప్రవహింప నారంభించెను. సంకర్షణునకుఁ బిపాసా దేవి వచ్చి చంచల మొనర్పఁగనే వరుణపుత్రి దానిని వెంటనే శాంతింపఁ జేసెడిది. దీని వలన నాతనికి మంచి సుఖము లభించెడిది. ఆ దివ్య వారుణీదేవియొక్క సువాసచే నా విహారవనమంతయును సువాసిత మయ్యెను. తన ప్రియాసమూహముతో గూడ ఆ పరమ ప్రియ పేయమును బానమొనర్చి బలరాముఁడు పరమ ప్రముదితుఁడయ్యెను. దాని స్ఫూర్తిచే స్ఫూర్తి మానములగు శ్యామాగ్రజములగు సంకర్షణుని నయనము లరుణవర్ణము లయ్యెను. కంఠమున వనమాలను ధరించి, ఒక్క చెవికే కర్ణకుండలమును ధరించి, ఆతఁడు

మదోన్మత్తునివలె సుఖముగ విహరించుచుండెను. జాను పర్యంతము లంబాయమానమగు వైజయంతీమాల వలన నాతఁడు లతలలోఁ దిరుగుచు, రంగు రంగుల పుష్పములతో సుశోభితమగు గజరాజు, తన కరిణీయూథముతో వనమునఁ దిరుగుచున్నట్లుండెను. ఆతని మనోహర ముఖారవిందము స్వేదరూపమగు తుషారకణములతో విభూషితమైనట్లుండెను. ఆ వ్రజవనితలందఱును బలరాముని బిరుదావళులను గాన మొనర్చుచుండిరి. వారి కమనీయ కంఠములనుండి వెలువడు చుండిన తన సుయశగానమును వినుచు నాతఁడు వనము లందు విచరించు చుండెను.

చైత్రము పూర్తి అయిపోయెను. వనములలోఁదిరిగి తిరిగియుఁ, గమనీయ క్రీడలొనర్చియుండుటచే బలరామునకు స్నానమొనర్చి వ్రజవనితలతో జలకేళి యొనర్ప నిచ్ఛజనించెను. అచ్చటకు యమునానది కొంచెము దూరమున నుండెను. ఆతఁడచ్చటనే కూర్చుండి యిట్లు పిలిచెను :- ''యమునా! రమ్ము, రమ్ము! ఇచ్చటకు నీ సుందర సుఖద స్వచ్ఛశీతల సలిలములను బ్రవహింపఁజేయుము. మా అందఱియొక్క శ్రమసంతాపములను బోఁగొట్టుము. మీా మనోహర మధుర సలిలములచేఁ బానమొనర్పనిమ్ము. కాళిందీ రమ్ము, రమ్ము. ఆలస్యమొనర్పకుము.''

యమునానదిబలరాముని వచనములనువిని నవ్వుకొని లోలోన నిట్లనుకొనెను :-''బలరాముఁడు మదోన్మత్తుడు

యున్నాఁడు. ఎవరు పిలిచినను వారి కడకు బరువిడి పోయినచో నా మర్యాద నశించును. నా మార్గ మనిశ్చితము కాఁగలదు. నేను నాయిష్టము వచ్చినట్లు ప్రవహించెదను. ఎవరైన స్నానము చేయవలసి యుండినను, జలపాన మొనర్పవలసి యుండినను నాకడకే రాఁగలరు.'' అది యిట్లనుకొని బలరాముఁడెంతగాఁ బిలిచినను రాలేదు. అప్పుడాతనికిఁ గోపము వచ్చెను. ఆతఁడు యమునను గసరుచు నిట్లనెను :-''ఓసీ! పాపినీ! నీకు గర్వము తలకెక్కినది. ఇంద్రాది దేవతలందఱును సదా నా యాజ్ఞకు చేతులను జోడించుకొని నిలుచుండెదరు. నీవు నదివయ్యును నేను బిలిచిన రావేల? నా వచనముల కవజ్ఞ యొనర్చుచున్నావు. నన్ను మత్తునుగా భావించి, అవహేళన మొనర్చుచు నా సమీపమునకు రాకున్నావు. సరే, నేను నా హలాగ్రముచేఁ జీల్చి నిన్ను చీలికలు చీలికలొనర్చెదను. అప్పుడు నీకు నా ప్రభావము తెలియఁగలదు.'' ఇట్లు పలికి హలధరుఁడు తన హలమును సంబాళించుకొనెను. యమునా ధారను దన హలాగ్రముచేఁ దనవైపునకు లాగఁదలఁచు చుండునంతలో యమున వెంటనే దివ్యరూపమును ధరించి భయభీతయై, చకితయై సంకర్షణ భగవానుని చరణములపైఁబడెను. ఆమె అత్యంత వినీతభావముతో నాతని స్తుతింప నారంభించెను:-

''దేవాధిదేవా! బలరామా! జగత్పతీ! నేను తప్పుచేసి

తిని. నేను నీ పరాక్రమమును గుర్తింపఁజాలక పోయితిని. దేవదేవా! నీవే సమస్త జగత్తునకును నేకైక స్వామివి. ఈ సమస్త భూమండలమును నీ సహస్ర ఫణములలో నొక్క ఫణాగ్రముపై నావగింజవలె నిలిచియున్నది. నేను మోహావశమున నీవాస్తవిక స్వరూపమును గుర్తింపజాలక పోయితిని. స్వామీ! మోహావశమునను, అజ్ఞాన వశము నను నావలన సంభవించిన నవజ్ఞను నీవు క్షమింపవలయును. నే నిప్పుడు తెలిసికొంటిని. నీవు సర్వసమర్థుఁడవు. నాపైఁ గృపజూపుము. నన్ను వదలివేయుము. సజ్జనులెల్లప్పుడును శరణాగత రక్షణమొనర్చు చుందురు. నే నిప్పుడు నీచర ణములను మాత్రమే శరణు వేఁడితిని.''

సూతుఁ డిట్లనెను :- ''మునులారా! బలరాముని పాదములపైఁబడి యమున కొట్టుకొనఁగా, నప్పుడు కృప వహించి ఆతఁడామెను క్షమించెను. అనంతరమాతఁడు తన ప్రియాసమూహముతోఁగూడి వారందఱును నలువైపు లను జుట్టుకొని, జలములను జిలుకుచు నాతని వివశు నొనర్చు చుండ జలక్రీడ లొనర్ప నారంభించెను. ఆతఁడును నంద ఱపైఁ జల్లుచు వారల సంతోషపెట్టెను. జలక్రీడలు కాఁగానే జలములనుండి బయటకు వచ్చెను. ఆసమయమున వెంటనే లక్ష్మీదేవి అచ్చట ప్రత్యక్షమై దివ్యములగు రెండు నీల వర్ణపు పట్టు వస్త్రములను, మహామూల్యవంతములగు మణి

మయములగు నాభూషణములను, దివ్యకేసర, కస్తూరీ మిశ్రితమగు చందనమును నాతని కర్పించెను. వస్త్రాభర ణములను ధరించి, సర్వాంగములయందును జందనము నలఁదుకొనఁగా బలరాముని శోభ కోటికందర్ప సదృశమై యుండెను. ఆతఁడు మత్తగజమువలె సుశోభితుఁడై యుండెను. ఈవిధముగ నాతఁడు నిత్యనూతన క్రీడలొన ర్చుచు సమస్త వ్రజాంగనలను నానంద సాగరమున నోల లాడించెను.

మునులారా! బలరాముఁడు యమునానదిని లాగిన జోటున కిప్పటికిని రామఘాటని పేరు. అది చీరఘాటునకు సమీపమునఁ గలదు. ఇప్పుడుచూచినను నిచ్చట యమునా నది తన మార్గమును వదలి వంకరగఁబోయినట్లు కనఁబడ గలదు. బలరాముని హలాగ్రముచేఁ జీల్చఁబడిన మార్గ మునఁ బ్రవహించుచు యమునానది నేఁటికిని బలరాముని అనంత పరాక్రమమును సూచించుచున్నది. ఈవిధముగా వ్రజాంగనలయొక్క మాధుర్యచిత్తములచే నాకర్షింపఁబడి బలరాముఁడు వారితోఁ గ్రీడించుచుండ సుందర సుఖదము లగు వసంతరాత్రములు క్షణమువలె గడచిపోయెను. అచ్చట నుండి అంత నాతఁడు సరసతాధారను బ్రవహింపఁజేసెను.

సూతుఁడిట్లనెను:-"స్వామీ! ఇచ్చట బలరాముఁడు వ్రజమందుండి వ్రజాంగనలతో విహారమొనర్చుచుండెను.

అచ్చట ద్వారకయందు కృష్ణునకును నింకొక రాజునకును బోరుజరిగెను. వానితోఁ బోరాడుట కాతఁడు కాశీకి వచ్చుట తటస్థించెను."

శౌనకుఁ డిట్లనెను :- "సూతా, ఈ రాజునకును గృష్ణునకును బోరే కారణమున జరిగినది?"

సూతుఁ డిట్లనెను :- "స్వామీ! పేరుకొఱకు పోరు జరిగినది."

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! పదప్రతిష్ఠకొఱకును, భూమికొఱకును,ధనముకొఱకును, స్త్రీకొఱకును బోరాడుటను మనము వినియుంటిమి. కాని నామముకొఱకై పోరుట విని యుండలేదు. ఒకే నామముతో ననేకులుండవచ్చును. కృపతో మాకీ కథను జెప్పుము."

సూతుఁ డిట్లనెను :- "స్వామీ! మీరీ వంకరటింకర నడకలవాని సంగతి నడుగఁబోకుఁడు. ఈతఁడెవరితోఁ బోరఁ దలఁచుకొనునో ఆతనితో నేదోవిధముగఁ గలహమును బెట్టుకొనును.ఎట్లనఁగా—ఒక నదిలోఁ బ్రవాహమునకు దిగువ భాగమున నొక మేఁకపిల్ల నీరు త్రాగుచున్నదఁట. ఇంత లోనే ఒక సింహము వచ్చెను. అది యిట్లనెను :- "నేను త్రాగుచుండు నీరును నీవేల మురికిచేయుచున్నావు? అది యిట్లనెను :- "అయ్యా! మీరు పైన ద్రాగుచున్నారు. నేను దిగువను ద్రాగుచున్నాను. మురికి యెట్లుకాఁగలదు? అప్పుడు సింహమిట్లనెను :- "ఒక దినమున నీవు తిట్టినావఁటగదా!"

మేఁకపిల్ల యిట్లనెను :- "అదెప్పటి మాట స్వామీ !"

సింహామిట్లనెను :- "ఆఱునెలల క్రిందటి మాటయే"

మేఁకపిల్ల యిట్లనెను :- "స్వామీ ! అప్పటికి నాకు రెండునెలల వయస్సుకూడ లేదు."

సింహామిట్లనెను:-"నీవు కాకుండిన నీతల్లి అయియుండ వచ్చును."

మేఁకపిల్ల యిట్లనెను :- "మాతల్లి నన్నుఁగనఁగానే చచ్చిపోయినది. అదెట్లు జరుగఁగలదు ?"

సింహామిట్లనెను :- "మీ నాయనమ్మ కావచ్చును, అమ్మమ్మ కావచ్చును. నీ పినతల్లి కావచ్చును."

మేఁకపిల్ల యిట్లనెను :- "స్వామీ ! మీకు చంప వలయునని యుండినఁ జంపివేయుము. కాని యిట్టి అబద్ధపు అపరాధముల నేల మోపెదరు ?" ఇట్లే స్వామీ ! రాజు రూపమునఁ బుట్టిన నసురునిఁ జంపఁదలఁచినచో వానిపై నిట్టి యపరాధములను మోపును. ఏదో అసాధారణ నిమిత్తము నేర్పఱచి వానినిఁ జంపివేయును. కాకున్న భగ వానునకు సహస్రనామములు కలవు. వానిలో నొకటియగు వాసుదేవనామము నాతఁడు ధరించినాఁడనుకొనుఁడు, దాని కొఱకై పోరాడవలసిన పనియేమున్నది ? "పోనిమ్ము నాయనా ! నీపేరుకూడ వాసుదేవుఁడేనా ?" యని యూర

కుండవచ్చును. కాని భగవానుఁడాతనిఁ జంపవలసియుండెను. అందువలనఁ బేరుకోఁ బోకాతనితోఁ బెనఁగులాడి చంపెను.

శౌనకుఁడిట్లనెను :- "సూతా! ఈ వాసుదేవుఁడైన రాజెవరు ?"

సూతుఁడిట్లనెను :- "సరే, స్వామీ! ఇప్పుడు నేను మీకు మిథ్యావాసుదేవుని కథను జెప్పెదను వినుఁడు."



# పౌండ్రక వాసుదేవుఁడు

శ్లో॥ నంద వ్రజం గతేరామే కరూషాధిపతిర్నృప ।
వాసుదేవోఽహమిత్యజ్ఞో దూతం కృష్ణాయ ప్రాహిణోత్॥
శ్రీభాగ. ౧౦. స్కం. ౬౬అ. ౧ శ్లో॥

సీ॥ మనుజేశ బలగర్వమున మదోన్మత్తుఁడై
యవనిపై వాసుదేవాఖ్యుఁడనఁగ
నే నొక్కరుఁడఁగాక యితరుల కీనామ
మలవాడునే యని యదటు మిగిలి
తెగి హరి దా వాసుదేవుఁడు ననుకొను
నఁట పోయి వలదను మనుచుదూతఁ
బద్మాయతాక్షుని పాలికిఁ బొమ్మన్న
నరిగె....................

—శ్రీమదాంధ్ర భాగవతము.

భగవత్సంబంధమున నేదైన మిథ్యాకల్పన మొనర్చినను దాని పరిణామము సుఖప్రదముగనే యుండును. ఏలననఁగా భగవంతుఁడు సుఖస్వరూపుఁడు. ఒక కథ ఉన్నది. భగవంతునకు గొప్పభక్తురాలగు నొక రాజకుమారి యుండెను. ఆమె విష్ణునకు మిక్కిలి భక్తితోఁ బూజ చేసెడిది. ఒక కుమారుఁడు లోలోపల నామెను ప్రేమించెను. ఆమెతో రాజకుమారుఁడు మాటలాడవలయునని మిక్కిలి యుత్సాహముతో నుండెను. గాని రాజకుమారి మంచి కట్టుదిట్టమగు కాపలాలో యుక్తిగానుండెను. అప్పుడాతఁడు విష్ణువేషమును ధరించెను. ఆతని రెండుచేతులుండి యున్నవికదా! రెండు అత్యంత సుందరములగు చేతులను మైనముతో నిర్మించి అతికించుకొనెను. నాలుగు చేతులందును శంఖ, చక్ర, గదా, పద్మములను ధరించియుండెను. పట్టు పీతాంబరమును ధరించెను, మస్తకమున మణిమయ కిరీటమును ధరించెను. కొయ్యతో గరుడునిఁ జేయించెను. సారాంశమేమనఁగా భగవానునియొక్క కృత్రిమ రూపమును ధరించి, యేదో విధముగఁ గావలివాని సహాయమునఁబైకియెక్కెను. పోయి ఆమెతోనిట్లనెను:- ''నేను విష్ణువును'' రాజకుమారి ఆనందమునకు మేఱ లేకుండెను. ఆమె అత్యంత భక్తిభావముతో నా కృత్రిమ విష్ణువును బూజించెను. ఈతఁడు విష్ణువు కాఁడని ఆమె హృదయమున లేశమాత్రమైన ననుమానమ్ము

లేకుండెను. ఆతని నామె సాక్షాద్విష్ణువుగనే భావించెను. ఒకవైపున సత్యముండినను సఫలము కాఁగలదు. రెండు వైపులను కృత్రిమమై, ఇద్దరమనస్సులలోను విషయవాసనయే యుండినచోఁ బతనము నిశ్చయము. కపటము చాల రోజులు దాగదు? సత్యమెన్నటికినిఁ జెడఁబోదు.

ఆతఁడు ప్రతిదినమును విష్ణువేషమును ధరించి రాజకుమారి సమీపమునకు వచ్చి, కలిసి మెలసి మాట్లాడెడివాఁడు. ఒకదినము నెవఁడో పోయి రాజుతో నిట్లనెను :- "ప్రభూ! రాజకుమారి కడకెవరో పురుషుఁడు పోవుచున్నాఁడు. రాజు నాల్గువైపులను రాజకుమారి ఇంటిని ముట్టడింపించి, తాను స్వయంగా ఖడ్గమును ధరించి రాజకుమారి మహాలులోనికిఁ బోయెను. కపట విష్ణువు ఖడ్గమును బట్టుకొని రాజు వచ్చుచుండుటను గాంచగనే గడగడ వణకనారంభించెను. ఆతని రక్షణ కింకేమియును నుపాయము లేక భగవంతుని శరణు జూచ్చెను. అత్యంతార్తభావముతో, ధనశక్తికోలఁది తన్మయుఁడై భగవానునిట్లు ప్రార్థించెను. "ప్రభూ! నేనెట్టివాఁడనైనను నీశరణు జొచ్చితిని. నీవు నన్ను రక్షింపుము." ఆమె యొక్క సత్యప్రతిజ్ఞను నిజమొనర్చుటకై భగవానుఁడాతఁడెక్కిన కొయ్యగరుడునకు జైతన్యమును గలిగింపఁగా నది ఆతనిఁ దీసికొని ఆకాశమున కెరిగిపోయెను. రాజు వచ్చి ఆతఁడెవఁడని అడిగెను.

రాజకుమారి యిట్లనెను :-"తండ్రీ! ఈతఁడు చతుర్భుజుఁడగు విష్ణువు. నిత్యమును నాకు దర్శనమొసంగ వచ్చుచుండును. మిమ్ముఁజూడఁగనే అంతర్హితుఁడైనాఁడు. గరుడు నెక్కి ఆకాశమున కెగిరిపోయినాఁడు."

ఇది వినఁగానే రాజు మిక్కిలి దుఃఖించెను. ఆతఁడు పశ్చాత్తాప పడుచు నిట్లనెను :-"అయ్యో! నేను మిక్కిలి అభాగ్యుఁడను. భగవద్దర్శనమునకు వంచితుఁడనైనాను."

పై కథను జెప్పుటకు కారణమేమనఁగా నెవఁడైనభగవానునియొక్క మిథ్యావేషమును వేసికొన్నను, భగవత్సంబంధమున మిథ్యాభిమానము కలిగినను గల్యాణమే కలుగును. ఏలననఁగా సాంసారిక పదార్థముల నిత్యములు అశాశ్వతములు. మిథ్యలు. వాని సంబంధమున నెవరభిమానమును జెందినను నది మిథ్యయే కాఁగలదు. అసత్యమే కాగలదు. పరిణామమున దుఃఖదమగును. కాని సర్వేశ్వరుఁడగు భగవానుఁడు నిత్యుఁడు, శాశ్వతుఁడు. సత్యుఁడు. ఆతని విషయమున వేషమును సత్యము కాఁగలదు. ఏలననఁగా నెట్టి సంబంధము కలిగియుండును వస్తువట్టిదే గాఁగలదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఇప్పుడు నేనుమీకు మిథ్యావాసుదేవుని కథను జెప్పెదను. కాశీ ప్రయాగల మధ్యలోఁ గరూషమను నొక దేశము కలదు. దాని రాజధాని విజయపురము. భగవానుఁడు భూమిమీఁద నవతరించి

నరనాట్య మొనర్చుచుండినపుడు కరూష దేశమును పౌండ్ర కుఁడను రాజు రాజ్యమొనర్చుచుండెను. ఆ రాజునకుఁ బూర్వ జన్మ సంస్కారవశముచేఁ దానే వాసుదేవుఁడనను భ్రమ కలిగెను. ద్వారకలోని కృష్ణుఁడు తాను వాసుదేవుఁడనని చెప్పుకొనుట మిథ్యయనుకొనుచు నాతఁడు భగవంతుని లోలోపల ద్వేషించుచుండెను. ఆతనిఁ గొందఱు ముఖప్రీతిగా మాటలాడువారు వ్యర్థముగఁ బ్రశంసించుచు వాని గర్వమును బెంచుచుండిరి.

ఆతఁడును నాల్గుభుజముల నేర్పఱచుకొని శంఖ, చక్ర, గదా, పద్మములను ధరించెను. ఆతఁడు తనరథముపై గరుడ ధ్వజము నేర్పరచుకొనెను. పీతాంబరమును ధరించెను. మణి మయ మకుటమును ధరించెను. సారాంశమేమన నాతఁడు విష్ణువగుటకు నన్నియు నేర్పరచుకొనెను. ఆ సమయమున, బలరాముఁడు వ్రజమందుండెను. సరిగా నదే సమయమున నా పౌండ్రక వాసుదేవుఁడు తనదూత నొకనినిఁ గృష్ణునికడకు బంపెను. ఆ దూత ద్వారకకుబోయి యాదవుల నిండుసభలో నిట్లనెను:–"నేను కరూషాధిపతియగు పౌండ్రకుని దూతను. నేను మా మహారాజుకడనుండి కృష్ణునకొక సందేశమును దెచ్చితిని. ఆజ్ఞయైనచోఁ జెప్పెదను."

భగవానుఁ డిట్లనెను:–"సరే, చెప్పుము."

కృష్ణుని యాజ్ఞనుబొంది దూత యిట్లు చెప్పఁదొడం గెను:–"మా ప్రభు విట్లు చెప్పమనినాఁడు "వాసుదేవుఁడను

నేనే. నేనుకాక యింకొక వాసుదేవుఁడు లేఁడు. బ్రహ్మ ప్రార్థింపఁగా భూభారమును హరించుటకై జీవులు దుఃఖములను బోఁగొట్టుటకై దయావశమున నేను భూమిపై నవతరించితిని. వాస్తవిక విష్ణువును నేనే. నీవు నన్నుఁగాంచి నాచిహ్నములను ధరించితివి. నీవును మిథ్యా వాసుదేవుఁడవైతివి. నిజముగ నీవు వాసుదేవుఁడనఁబడుటకే గుణములును లేవు. నీ జాతియేమియో తెలియదు. వైశ్యవృత్తి నవలంబించిన నందునకుఁ గుమారుఁడవు. నీలో బలములేదు, నిర్బలుఁడవు. జరాసంధుని భయముచే ద్వారకకుఁబోయి దాగితివి. నీకు ధర్మములేదు. నిర్బలుఁడును, రోగియునగు నీమామను జంపితివి. నీకు సాహసములేదు. ఏదోవిధముగఁ గలహమును బెట్టి దూరముగనుండి చూచుచుందువు. నీకు దయ లేదు. స్త్రీయగు బూతనను జంపితివి. నీకు సదాచారము లేదు. గోపాంగనలతో నేకాంతమున రాసక్రీడలాడితివి. నీవు జన్మచోరుఁడవు. గొప్ప స్త్రీలంపటుఁడవు. సదా స్త్రీల కొఱకు తిరుగుచుందువు. మాయావివి. మాయనాశ్రయించి ప్రజలను భ్రమలోఁ బడవేయుచుందువు. ఈ కారణములచే నీవు వాసుదేవుఁడవనఁబడుట కయోగ్యుఁడవు. నా చిహ్నములను దీసివైచి నన్ను శరణువేఁడుము. వచ్చి నన్ను క్షమాపణ కోరుము. కాకున్న నాతో యుద్ధమొనర్పుము.

దూత యిట్లుపలికి యూరకుండఁగనే కృష్ణుఁడు మిక్కిలి వేగముగ నట్టహాసమొనర్చెను. ఆతని అట్టహాసముచే

నా సభయంతయును ప్రతిధ్వనించెను. యాదవులందఱును నాతని నవ్వులోఁ దమ నవ్వులను గలిపిరి. ఉగ్రసేనాది సభా సదగణమంతయును బకపక నవ్విరి. అప్పుడు కృష్ణుఁడు దూతతో నిట్లనెను:-"ఓయీ! దూతా! మీ ప్రభువునుండి నీవు సందేశము నెట్లు తెచ్చితివో, అట్లే మీ ప్రభువునకును మా సందేశమును గొనిపొమ్ము అదేమనఁగా—మీప్రభువు మా సుదర్శనచక్రమును దీసివేయుమని పలికినాడు. వాఁడిచ్చ టికి వచ్చినచో దాని నాతనిమీఁదకే వదలెదము. నీ వెవరి బలమును జూచుకొని మూర్ఖుఁడవై యిట్లు వాగుచుంటివో వారి నందఱను బీచమడంచి, వారి నందఱను మృత్యువాతఁ బడఁచేయఁగలను. ఏ మిథ్యాముఖముచే నిట్లు పలుకరాని పలుకుల నహంకారమునఁ బలుకుచుంటివో, వాగుచున్నావో, ఆ ముఖమునునాయొక్క అస్త్రశస్త్రములచే విదీర్ణము గావించి నేలఁపడవైచెదను. దానినిఁ గంక, గృధ్రాది మాంసభోజు లగు పక్షులు పీకి తినఁగలవు. అప్పుడు నీవు శాశ్వతముగ జచ్చి, దీర్ఘనిద్ర గావించెదవు. నేను నిన్ను శరణుజొచ్చుట కాదు. నీవే కాకులు, గ్రద్దలు, నక్కలు, కుక్కలశరణము నకు బోయెదవు. మంచిది నీవు యుద్ధమునకు సిద్ధపడుము. నేనిప్పుడే యుద్ధమునకు వచ్చుచున్నాను. అచ్చట నీ వీరతను జూపవచ్చును."

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! భగవానుని సందేశమును విని ఆ దూత వెంటనే పౌండ్రకుని కడకుబోయి, సమస్త వృత్తాంతమును రాజునకుఁ జెప్పెను. ఇది వినఁగానే ఆతఁ డత్యంత కుపితుఁడై కృష్ణునితోఁ బోర సిద్ధపడుచుండెను. ఆతఁ డేకరాజులకడకు తన పక్షమునఁ గృష్ణునితోఁ బోర రమ్మని పిలిచెను. కాని ఒక్కరైనఁ గృష్ణునకు విరుద్ధముగఁ బోర రాలేదు. అయితే ఒక్క కాశీరాజుమాత్ర మాతనికి మిత్రుఁడగుటచే నంగీకరించెను.

ఇచ్చట భగవానుఁడును దూతను బంపి కరూష దేశమునకు యుద్ధమునకుఁ బోవ నుద్యుక్తు డయ్యెను. కృష్ణుఁడు కొంత సేనను దీసికొని పౌండ్రకుని పురమునకుఁ జేరుకొనెను. శ్రీకృష్ణుఁడు యుద్ధమొనర్చుటకై వచ్చినాఁ డని తెలిసికొని, ఆతఁడు రెండు గొప్పసేనలను దీసికొని యుద్ధమునకు వచ్చెను. ఆతని మిత్రుఁడగు కాశీరాజు గొప్ప గొప్ప సేనలను మూఁడింటినిఁ దీసికొని తన మిత్రునకు సహాయ మొనర్పవచ్చెను. ఇరువురును ఘోరముగఁ బోరు చుండిరి. పౌండ్రకుఁడు శంఖ, చక్ర, గదా, పద్మ, శార్ఙ్గ ధనుస్సులను, మెడలోఁ బాదములవఱకును వ్రేలాడు వనమాలయును, శ్రీవత్స చిహ్నమును ధరించియుండెను. ఆతనికి వక్షస్థలమునఁ గౌస్తుభమణి శోభించుచుండెను. శరీరమునఁ గనక చేలము సుశోభితమై యుండెను. శిరస్సు

మహామూల్యవంతమగు మణిమయ కిరీటము తళతళ లాడు చుండెను. శరీరమంతటను నాభరణములు మెఱయుచుండెను. ఆతని చెవులకు వ్రేలాడుచుండిన కుండలంబు లందరి కాంతు లాతని మిథ్యాత్వమును లోకమునకుఁ జెప్పుచున్నవా యను నట్లుండెను. ఆతని రథమునకుఁ దెల్లని అశ్వములను నాల్గింటినిఁ బూన్చఁబడెను. ఆ రథముపై విశాలమగు గరుడధ్వజ మెగురుచుండెను. ఆతఁడు రథముపైఁ నెక్కి వచ్చుచుండఁ గ్రొత్తవారు వారిద్దరిలో నెవరు కృష్ణుఁడో గుర్తించుటకు వీలులేకుండెడిది. ఒక నాటకమునఁ జక్కఁగ వేషమును నటకుఁడు వేసికొని రంగస్థలము మీఁదకు వచ్చునెడల నాతని నెఱిఁగినవారును నెఱుఁగని వారును నీతని గుర్తింపలేక భ్రమలోఁ బడిపోవుచుందురు. ఆతఁడు తనవలె వేషమును వైచుకొని వచ్చుచుండుటను గాంచి కృష్ణుఁడు మిక్కిలిగ నవ్వుకొని యిట్లనెను:- "అనుకరింపఁ దలఁచినచో నిట్లనుకరింపవలయును."

మిథ్యావాసుదేవుఁడు సైగఁజేయఁగనే, అతని సేనలోని సైనికులు కృష్ణునిపై త్రిశూల, గదా, పరిఘు, శక్తి, ఋష్టి, ప్రాస, తోమర, ముద్గర, ఖడ్గ, పట్టిస, బాణ, శతఘ్ని మొదలగు నస్త్రశస్త్రములను విసర నారంభించిరి. శత్రువు లిట్లు తనపైఁ బ్రహార మొనర్చుటను గాంచి భగవానుఁ డంధఱకును సమాధానమును జెప్పుచుండెను. ప్రళయకాల

మునం బ్రళయాగ్ని యెట్లు వివిధప్రాణులను వివిధ భంగుల బాధించునో అదేవిధముగ శత్రుసంహారి యగు శ్యామసుందరుఁడు విపక్షవీరులను దసబాణవర్షముచే బాధించుచుండెను. ఆ పౌండ్రకునకుఁ గలరథ, గజ, తురగ, భటాది చతురంగ సేనలను వేలువేలు అస్త్రములతో నుగునుగు నూచునూచు చేయుచుండెను. కాశీరాజు యొక్కయు, పౌండ్రకుని యొక్కయు సేనలు తమ ప్రాణములమీఁదఁ దీపిని వీడి పోరాడుచుండిరి. శ్యామసుందరుఁడు వారిని దన అస్త్రశస్త్రములచేఁ జంపి వారికి సద్గతి నొసఁగుచుండెను. గుఱ్ఱములును, నేనుఁగులును, సైనికులును జచ్చుటచేతను, అస్త్రములును, రథములును దుత్తినియలగుటచేతను నారణరంగము భూతనాథుఁడగు భవుని భయంకర విహారభూమివలె నుండెను. రక్తమును జూడఁగనే సైనికు లుత్సాహముతోఁ బోరుచుండిరి. కృష్ణుఁడు పౌండ్రకుని సేననంతను నాశన మొనర్చుటను గాంచి పౌండ్రకుఁడు కృష్ణునితోఁ బోర నాతని యెదుటకు వచ్చెను. ఆతనిఁ గాంచి భగవానుఁ డిట్లనెను:-

"పౌండ్రకా! బాగున్నావా? నేను నా అస్త్రములను విడిచెదనని నీ దూతతోఁ జెప్పియుంటిని. కావున నే నస్త్రములను విడువవచ్చితిని. వానిని నీపైన నే వదలెదను. ఇదిగో, చూచుకొనుము. మన మిద్దరమును బోరాడుకొనవలయును మనలో నెవఁడు వాసుదేవుఁడో నేఁడు నిర్ణయము కాఁగలదు. నేనే

వాసుదేవుఁడ నగుచో నీవు ధరించిన నా నామరూపముల నిప్పుడే వదలించెదను. నేనే కపట వాసుదేవ నామరూపములను ధరించియుండినచో, యుద్ధమున నీచేఁ బరాజితుఁడనై నిన్ను శరణుజొచ్చెదను. ఇప్పుడు ప్రపంచమున వాసుదేవుఁడుగ నీవైన నుండవలయును నేనైన నుండవలెను. నీవును నేనును నిద్దరముండఁజాలము" ఇట్లుపలికి భగవానుఁ డాతని కవజ్ఞ నొనర్చి, ధనుస్సుపై బాణము నెక్కుపెట్టి, తీక్ష్ణమైన బాణములను సంధించి వాని రథమును ముక్కలు ముక్కలొనర్చెను. సారథిని గుఱ్ఱములను జంపెను. వాని ధనుస్సును ముక్కలు చేసెను. ఆతఁడు రథవిహీనుఁడై నేలపైనుండెను. అప్పుడు కృష్ణుఁడు తన సుదర్శన చక్రముచే శిరస్సును ఖండించెను. వెంటనే ఆతని శరీరము ఱెక్కలు తెగిన పర్వతమువలె నేలపైఁ బడెను.

తన మిత్రుఁడు చచ్చుటనుగాంచి కాశీరాజు భగవానునిపై ప్రహారమును గావించెను. కాని ఆతఁడును సమరమునఁ జాలసేపు నిలువఁజాలక పోయెను. ఆతఁడొక అర్ధచంద్రాకారబాణమును దీసికొని ఆతని శిరస్సును ఖండించి వేఱు బాణములచే నాకాశమార్గమున నాతని శిరస్సును గాశీలోఁ దనమహలునందు బడునట్లొనర్చెను. కాశీరాజకుమారుఁడును, నగరనివాసులునగు స్త్రీ పురుషులు తమ

రాజుయొక్క శిరస్సునుగాంచి కుయ్యో మొర్రోయని విలపింప జొచ్చిరి.

సూతుఁ డిట్లనెను :–"ఈవిధముగఁ గృష్ణుఁడు పౌండ్రకుని, కాశీరాజును జంపి సిద్ధ గంధర్వాదులచేఁ జేయఁబడు స్తోత్రములను వినుచు ద్వారకాపురిలోఁ బ్రవేశించెను. అందఱును భగవానుని హృదయపూర్వకముగ నభినందించెను. అంత భగవానుఁడు సుఖముగఁ దనయంతఃపురమున నివసించుచుండెను."

శౌనకుఁ డిట్లనెను :– "సూతా! ఈ పౌండ్రకు డెవడు? ఈతఁడు వాసుదేవు నేల ద్వేషించుచున్నాఁడు? ఆతనిరూపము నేల ధరించినాఁడు!"

సూతుఁ డిట్లనెను :– "స్వామీ! జయవిజయులెట్లు భగవానునకు ద్వారపాలకులో అట్లే యీతఁడును ద్వారపాలకుఁడే. ఈతఁడు ఒక దినమున లక్ష్మీదేవిని లోనికిఁ బోనీయలేదు. అప్పుడామె క్రోధమున నిట్లుశపించెను :– "నీవు భూమిమీఁద మానవుఁడవై పుట్టి భగవానుని ద్వేషించెదవుగాక!"

భగవానుని పార్షదులందఱును జదుర్భుజులుగ నే యుందురు. అందఱును శంఖచక్రగదా పద్మములను ధరించుచుందురు. కేవలము శ్రీవత్స చిహ్నము వారికుండదు. ఇంక మిగిలిన చిహ్నము లన్నియును భగవంతునకు వలెనే

యుండును. అంతనాతఁడు భగవానుని కడకుఁబోయి మొక్కు కొనఁగా నప్పుడు భగవానుఁ డిట్లనెను –"లక్ష్మీదేవి యీ శాపమును నా యిచ్ఛానుసారముగనే యిచ్చినది. నీవు పృథివిపైఁ బుట్టఁగలవు, కాని అచ్చటను నీవీర్ష్యావశముచే సదా నన్నే చింతించుచుందువు. నా చిహ్నముల నన్నిటిని ధరించుచుందువు. నాతో యుద్ధమొనర్చెదవు. అంత నాచేత జచ్చి నన్నే పొందగలవు. నీ కధోగతి కలుగదు. ఇది వినఁగానే ఆతనికి సంతోషము కలిగెను. ఆతఁడే కరూష దేశాధిపుఁడగు పౌండ్రకుఁడయ్యెను. మునులారా! ద్వేషభావముచే నాతని నిరంతరమును జింతించుచుండుటచే వాసుదేవ భగవానునియందు మనస్సు లగ్నమగుటచే నాతనికిఁ గర్మబంధము లన్నియును దొలఁగి పోయెను. చివరకు భగవానునిచేఁ జచ్చి, చతుర్భుజ రూపమును ధరించి, ఆతఁడు భగవానుని యందుఁ దన్మయుఁడయ్యెను. ద్వేషవశమున భగవంతుని రూపమును ధరించుటచే నాతనికి యోగులకును దుర్లభమైన పదవి ప్రాప్తించెను."

శౌనకుఁ డిట్లడిగెను:–"సూతా! భగవానుఁడు కాశీరాజుయొక్క శిరస్సును కరూష దేశమునుండి కాశీ కేల పంపినాఁడు?"

సూతుఁడిట్లనెను :–"స్వామీ! కాశీరాజునకుఁ దనకు కాశీలోనే మృత్యువు సంభవింపవలయునను నిష్ఠకలదు.

అందువలన భగవానుఁ డాతని నిప్పును నెఱవేర్చియుండెను. అదియును గాక కాశీని దహించు లీలయును జేయవలసి యుండెను. అందువలన నాతని శిరస్సును కాశీంలో రాజ భవనములోనికిఁ బంపెను.''

శౌనకుఁడు కుతూహలముతో నిట్లనెను :-''సూతా! శిరము పోఁగానే కాశీ. దహనలీల యెట్లు జరిగినది? దీనిని గూడ మాకు దయతోఁ జెప్పవలయును.''

సూతుఁడిట్లనెను :-''మంచిది, స్వామీ! ఈ ప్రసంగమున నేను మీకు సుదర్శన చక్రముచే నెట్లు కాశీని దహించెనో ఆ కథాప్రసంగమును జెప్పెదను. మీరు దత్తచిత్తులరై శ్రవణమొనర్పుఁడు.''

౫ —

## కాశీరాజు కృత్య యొక్క దుష్పరిణామము.

శ్లో. కృత్యానలః ప్రతిహతః స రథాంగపాణే
రస్త్రౌజసా స నృప భగ్నముఖో నివృత్తః ।
వారాణసీం పరిసమేత్య సుదక్షిణం తమ్
సర్త్విగ్జనం సమదహత్స్వకృతోఽభిచారః ॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౬౬ అ. ౪౦ శ్లో॥

